శ్రీ

# నలచరిత్ర.

ఆశ్వాసముల ప్రబంధము.

ఇది

సిరిప్రగడ ధర్మయామాత్యకవిచే

రచియింపఁబడినది.

సువర్ణలేఖనుండి పునర్ముద్రితము.



కాకినాడ.

శ్రీ సావిత్రీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడినది.

1907.

వెల రు 1-4-0. { సువర్ణలేఖచందాదారుల కు రు 1-0-0 మాత్రమే. } అంచెకూలి కాక

# పీఠిక.

పూర్వకవిత్వ మిప్పటిపద్యకవిత్వములకన్నఁ బటుత్వమునందును లాలిత్యము
నందును మిగుల ప్రశస్తమైనదియనుట నిర్వివాదాంశము. నన్నయాదులనారంభించి
నేటివరకుఁగలకవులఁ గాలానుక్రమణికగఁ బరిశీలించిచూచినచో రానరాను కవిత్వ
పాటవము తగ్గుచున్నదియనుట స్పష్టముగఁ గానవచ్చుచున్నది. దీనికిఁగారణము నా
రయవలసివచ్చినచో నదియును విశదముగనే కనఁబడకమానదు. ఏదేశమునందైనను నే
భాషయైనను నొక్కొక్కకాలమునందు ఒక్కొక్కరిపరిపాలనవలన వారివారియా
దరణాధిక్యమునుబట్టి మిగుల నభివృద్ధిగాంచుచుండుటయు నటుపిమ్మట నయ్యది కొం
తకాలమునకు క్షీణదశనొంది దానిని పునరుజ్జీవింపఁజేయఁ దరువాతికాలపువారెంతలెం
తలు ప్రయత్నములుచేసినను దన తొల్లిటియౌన్నత్యస్థితి నందలేకుండుటయును జరి
త్రాంశములెఱింగినవారికిఁ దెలియనివిషయముకాదు. ముద్రాయంత్రములులేని పూర్వ
కాలమున మనభాషాభివృద్ధికిఁ గలిగిన చిక్కులు మెండు. మనయాంధ్రభాషయందిప్పుడు
కానవచ్చుచున్న గ్రంథములన్నియును మనదేశమునందు స్వదేశరాజుల యాధిపత్యము
క్షీణించి విదేశీయులప్రాబల్యము అతిశయించిననాటివై యున్నవి.

ఇట్టిస్థితిగతులలో మధ్యమధ్యమున నెవ్వరో యొకరిద్దరికాలములందు తమయ
ధికారప్రాబల్య మతిశయించినభాగములయందుతక్క తక్కినప్రదేశములయందు అ
య్యది యభివృద్ధినొందుటకుఁ దగినయవకాశమునులేక చిక్కుపడియుండెను.

మఱియు నానాటికాలపువారేవృత్తియందున్న వారి కావృత్తియందే విశేషప
రిశ్రమలవడి పరంపరగవచ్చుచున్న తమవిద్యలఁ దమకు వీలగునంతవఱకు క్షీణములు
కాకుండ నిలుపుకొని యందుకుఁదగిన పాండిత్యమలవఱచికొని పిమ్మటఁగాని గ్రంథము
లువ్రాయఁ బ్రారంభింపకుండెడివారు. అట్లుప్రారంభించినను నిప్పటివలెబ్రకటనమా
ర్గములు పూర్వమంతగాలేకయుండుటచేఁ దమవిద్యావైశద్య మొరులచెవింబడవలెనను
నిజమనోరథగమనమునకు నద్యఃఫలమందుట కవకాశముకూడ చిక్కదయ్యె. ప్రపం
చానుభవము హెచ్చి విద్యల నానుపూర్వికగ గ్రహించినపిమ్మట దమ ప్ర[illegible]
ములు తరువాతివానికిఁ దీసిపోవునని తోచకమానదు. అందువలన నెయ్యవి వేఱుగ గ్రం
థములుగఁ గ్రంథకర్తలెంచుకొనిరో యవియే బయలువడుచుండుటయు నట్లువచ్చినవా
నిలోనెల్ల మేలైనవియే లేఖకపాఠకులు కొన్ని ప్రతులువ్రాసికొని వల్లించుచుండుటయు
వాడుకయైయుండెడిది. భాషాభివృద్ధిచేయఁగోరువారికి మాతృకలుగానుండదగు గ్రం
థములనన్నిటిని బరిశీలించి ప్రకటించుచుండుట విధాయకకృత్యమైయుండుటచే బూ
ర్వకాలమునాటిగ్రంథము లెవ్వరికంటబడిన వారందఱును వానిని బ్రచురించి తమవిధా
యకధర్మమును నెరవేర్చుచుందురు.

ఈనలచరిత్రమునందలి శైలి మిగుల ధారాళముగనున్నది, మిక్కిలి తేటతెలుగు

మాంసలోఁ దనగ్రంథమెల్లనను దెలియనట్లువ్రాయుటకై కవిచాలపనిచేసి జయ
ప్రదముగ దీనిఁ దించియుంచినాఁడు. ఇందలికల్పనలును రమ్యములుగనున్నవి కాని గుణపో
షణైతరమై చాలమంది పూర్వకవులవలెనే యీగ్రంథకర్తయు నంతగాఁ బాటించిన
ట్లు కనఁబడదు. ఈకవి యెప్పటివాఁడో సరిగాఁ దెలిసికొనుటకు గ్రంథాధారము లె
వ్వియు లేవు. శైలినిబట్టియును గథాసందర్భవర్ణనాంశములనుబట్టియును జూడఁగా నీ
కవి మధ్యకవులకీవలివాఁడని తేలుపడకమానదు. ఈతఁడించుమించిప్పటికి రెండువంద
లయేండ్లకుఁ బూర్వకాలమున గలవాఁడని చెప్పవచ్చును. కవి నియోగిబ్రాహ్మణుఁడు. పే
రు ధర్మన్న, యింటిపేరు సిరిప్రగడవారు తండ్రి తిప్పన ఈతనివాసస్థలము కృష్ణాజిల్లా
యినుకుర్తిసీమలోని నిడుమోలయని యీక్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

గీ॥ అతఁడు దాస్తాంభగిరివరహరినివాస, మైన యినుకుర్తిసీమలో నమరుసిరుల
కలిమి జెలువొందు నిడుమోలు నెలవు గాఁగ, నిలిచియర్థిల్లునతని వర్ణింపఁదరమె॥

కవి మేనమామగారియూరు గోదావరిమండలములోని పేరూరని యీక్రింది
సీసగీతమువలనఁ దెలియనగును.

గీ॥ అతఁడు కుమునుకోటి వెంకటాద్రిసుఁడు, సతతపేరూరికేశవ స్వామ్యధీన
మానసస్థితిఁ బరఁగు మా మేనమామ, మతిగుణసన్నిభుఁడు ధర్మమంత్రినిభుఁడు

ఈపైరెండుపద్యములనుబట్టి కవి కృష్ణా గోదావరిమండలములలోనివాఁడని తే
లుచున్నది. ఈతడు విష్ణుభక్తాగ్రేసరుఁడు. "శ్రీరంగగురుసూనుదాచ్చితరద యాద్య
డనక్షరుండమృతమహాభావు" అనిగురుస్తుతిలోను "ఇది శ్రీమదాచ్చిరదగురు చరణా
స్మరణాశ్యసన" అని గద్యములలోనువ్రాసికొనియుండుటయె గాక తనగ్రంథమును
శ్రీతిరుపతివేంకటేశ్వరస్వామికంకితముచేసి తనవైష్ణవభక్తిని గ్రంథమునందు వెల్లడిచే
ట్లు కనఁబఱచియున్నాఁడు.

ఈగ్రంథమును బరిశోధించుటలో బ్ర॥ శ్రీ॥ చాగంటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారును
బ్ర॥ శ్రీ॥ పురాణపండ మల్లయ్యశాస్త్రులుగారును మిగుల శ్రమదీసికొన్నందులకు వా
రికి మేము నేకవందనములాచరించుచున్నారము. ఈగ్రంథమొక తాళపత్రప్రతి మొద
ట దొరకినది. దానదప్పులు మెండుగానుండుటచే రెండవప్రతికై యత్నింపఁజొచ్చితి
మి. ఇట్లుండఁగా మామిత్రులును కళావతీపత్రికాధిపతులునగు బ్ర॥ శ్రీ॥ శ్రీపాద కృష్ణ
మూర్తిశాస్త్రులుగారు ముక్కల్లకనుండి మఱియొకప్రతిని దెప్పించి యొసంగిరి. అదియు
నొకటివానికిని సరిపోవుటచే సాధ్యమైనంతవరకు దప్పులుగలభాగముల సంస్కరింపిం
చితిమి. ఇంకను గొన్నియెడలనుండిన నుండవచ్చును. అట్టివానిని ముందుకూర్పునందు
సవరింపించుచున్నారము.

ఇట్లు

తల్లాప్రగడ సూర్యనారాయణరావు.

శ్రీరస్తు.

# నలచరిత్రము.



## ప్రథమాశ్వాసము.



శ్రీరామా వదనేందు బింబ జనితస్మేరోల్లసచ్చంద్రికా
పూరంబుల్ దన దృక్చకోరికలకింపుల్ సొంపుఁ జైకొల్ప, శృం
గారప్రక్రియ శేషశైల శిఖరాగ్రస్థాయియై లోక ర
క్షారూఢింగనుపట్టు నవ్విభుఁడు భక్తవ్రాతముం బ్రోవుతన్.

ఉ. వల్లభునాత్మఁ జేర్చి ముదమందదురస్స్థల రత్నవేదిపై
సల్లలితస్థితిన్నిలిచి సర్వజనుల్ సుఖలీలఁ దేలఁగాఁ
జల్లని చూపులన్ సిరులఁ జల్లెడు శ్రీయలమేలుమంగ, రం
జిల్లనభీష్టసంపదలు చేకుఱఁ జేయుతమాకు నెప్పుడున్. 2

మ. పరమాహ్లాదము మీఱఁ బాల్కడలిపైఁ బద్మాపయోజాక్షితో
సరసక్రీడలఁ దేలు శౌరికి మహోత్సాహంబు సంధిల్లఁ గ్రొ
వ్విరిపాన్పై భువనప్రశస్తిగను నవ్విశ్వంభరాభార సం
భరణోల్లాసి యనంతుఁడంచితమతిం బాటిల్లనన్ బ్రోవుతన్. 3

చ. సిరులు దలిర్చు చెల్వనదఁ జేర్చి శుభావహలీలఁ జేర్చునా
హరికిఁ బ్రియంబుగా వ్యజనమై రథమై చెలియై తురంగమై
పరిసరవర్తియై హితవుఁ బాటిలఁ జేయుచు నుండునట్టి యా
గరుడుఁడు మాకు నిర్మల సుఖస్థితిఁ జేకుఱఁ జేయుఁ గావుతన్. 4

ఉ. వేత్రము కేలఁ బూని యరవిందదళాక్షుని పెద్దకొల్వునన్
గోత్రభిదబ్జజాది సురకోటులు గొల్చుచుఁ బైపయిం బడం
జిత్రగతిన్ బరాబరులు సేయుచు సందడి చక్కఁ దీర్చు నా
సూత్రవతీమనోహరుఁడు శోభనలీలల మమ్ముఁ బ్రోవుతన్. 5

క. సుకరముగ నేలు మము ర, క్షకవృత్తిన్ శంఖచక్రశార్ఙ్గగదానం
దకములు హరికరసంస్థా, నకములు సంశ్రితవితాన నవకల్పకముల్. 6

ఉ. మిన్నఁట పువ్వుఁదోఁట, మరుమేనఁట గందపుదుంప, రచ్చరా
తిన్నఁట వెండికొండ, పెనుఁదేరఁట పంటవలంతి, తోరపుం
గిన్నఁట బమ్మపుఱ్ఱ, బలిగిమఁట సొమ్ములపెట్టె, యిట్టి భా
గ్యోన్నతి నొప్పు శంభుఁడు సముజ్జ్వలలీలల మమ్ముఁ బ్రోవుతన్. 7

ఉ. తమ్ముల నేలు వాలుగను దమ్ములఁ గన్నుదయన్ సమస్తలో
కమ్ములఁ బ్రోచుచుం బసిఁడిగద్దియపైఁ గొలువుండి వేలుపుం
గొమ్మలు సమ్మతిన్ నిలిచి కొల్వఁగఁ గోరినకోర్కు లిచ్చు న
య్యమ్మ, కుమారి మమ్ముఁ గరుణాతిశయంబునఁ బ్రోచుఁగావుతన్. 8

చ. అనిశము భర్త మౌళినిలయస్థితిఁ బొంగెడు గంగఁ జూచి లోఁ
గనలెదు శౌరికిం బ్రియముగా శివుమస్తక పూజసేయు నే
ర్పునఁ గరమెత్తి యమ్మకుటరూఢ జలమ్ములు పీల్చి తెచ్చి పెం
పెనయఁ దదంఘ్రులందిడు గణేశుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 9

ఉ. భారతి చెక్కుటద్దములఁ బైకొని ముద్దిడ రెండుమోము లా
హారి గుణాభిరామ యధరామృత మానఁగ నొక్కమోము త
త్సారసగంధితోడ సరసంబులు వల్కఁగ నొక్కమోముఁ గాఁ
గోరి చతుర్ముఖంబు లొనగూరుచుకొన్న విరించిఁ గొల్చెదన్. 10

మ. నళినాక్షీ! జగదీశ్వరీ! భగవతీ! నాతల్లి! యస్మన్మన
స్స్థలసంస్థాయినివై వినూత్నకవితా చాతుర్యసంధాన వే
ళలఁ దోడై సరసానుకూల వచనోల్లాసంబు చేకూర్చి ని
ర్మలకారుణ్యసమగ్రచిత్తమున నన్ రక్షింపుమీ భారతీ. 11

క. శ్రీరామచంద్రచరణాం, భోరుహమకరందపాన పూరితచేత
స్సారసమునఁ బొదలెడు నా, త్మారాముని నాంజనేయు నర్థి నుతింతున్. 12

సీ. సకలార్యనుత యశస్సాంద్రు భూతమునీంద్రు, సౌభాగ్య ధామిఁ గాసారమౌని
నయగుణ మహిమోన్నత్వ యోగి మహాయోగిఁ బరమపుణ్య సనాథు భట్టనాథు
నతిచి ద్వినోదు నయ్యక్షపాదు, ఁబరాక్ర మాధీను గుణశేఖ రాభిధాను
సతతనిర్మల సముత్సాహుఁ దాపసవాహు, నార్త సంత్రాణు భక్తాంఘ్రిరేణు

గీ. లాలితోదారు శ్రీపరకాలధీరు, చతురగుణధుర్య లక్ష్మణాచార్యవర్యు
బుధజనానీకసంభావ్య మధురకావ్య, గురుకృపావశునల పరాంకుశుఁ దలంతు.

సీ. వైష్ణవశ్రేష్ఠుఁ డిలరంగవిభు * * * * గృహనామ సరణిఁ గాంచె
నే రమ్యగుణశాలి శౌరి రాజపురోహితప్రభావంబున ధరణి వెలసె
నే గురుతిలకుఁ డింపెసఁగ శ్రీవంగిపు రాధ్యక్షుఁ డనఁగఁ బ్రఖ్యాతినొందె
నే దేశికాగ్రణి వేదమార్గప్రతిష్ఠాచార మహిమచే నతిశయిల్లె

గీ. నతఁడు సత్యవచోవైభవాభిరాముఁ, డైన శ్రీరంగ గురుసూనుఁ డాచ్చివరద
యార్యుఁ డస్మద్గురుం డమ్మహానుభావు, నాత్మలో నిల్పి వందనం బాచరింతు 14

క. వినుతింపెద వాముదిలో, జననుత వాల్మీకిమౌని సత్యవతీనం
దనునిఁ బరాశరసంయమి, ననుపమమహిమాభిరాముఁ డగు శుకయోగిన్. 15

ఉ. సన్నుతులే నొనర్తు మది సంభ్రమలీల లెసంగ, భాగ్యసం
పన్నుని భట్టహర్షును, బాణమయూరులఁ గాళిదాసుని
న్నన్నయభట్టు నెఱ్ఱకవినాథునిఁ దిక్కనసోమయాజి ము
న్నున్నఁగ నైషధంబు తెనుఁగేర్పడఁ జేసిన యట్టి ధన్యునిన్. 16

చ. హరికరుణామలప్రమహిమాతిశయంబున నేర్చినట్లు సు
స్థిరముగఁ గావ్య మొకటి చెప్పఁగఁ బూనినవాఁడ నిందులో
నెరసులు గల్గెనేని నను నేరము లెన్నకుఁ డిట్టికొంతయున్
సరసత దిద్దుఁడీ! ప్రకృత సత్కవులార! నమస్కరించెదన్. 17

క. మఱుఁగుఁగని మేలు దెలియఁగ, నెఱుఁగక యూరకింతసేపు నే ద్వవశకునం
పఱపుల నోఁటలెడు దుష్కవి, వఱకుం బ్రార్థింతుఁ నూయవలదని సారెన్. 18

చ. ఘనులగు సత్కవుల్ నెరసు గల్గినచో నది దిద్ది కీర్తిఁ జెం
ది నుతులు గాంతు రాకరణి నేర్చునె దుష్కవి పేర్చుఁ గాక పూ
న్కిఁ గని దగనింటివానివలె గెంటెడు దొంతులు చక్కఁ బెట్టనో
పునె శునకంబు వానివెసఁ బోనెడనోపెడుఁ గాక భూస్థలిన్. 19

క. ఘనకవిసన్నుతునకుఁ గుక, వి నుతియును గర్హణము ముదము వెస ఖేదముఁ జే
యును, గజము నెక్కునతనికి, శుని నెక్కిన సుఖము దిగిన శోకము గలదే. 20

వ. అని యభీష్టదేవతాప్రార్థనంబును, బూర్వాచార్యస్తోత్రంబును, స్వగురుచరణస్మరణంబును, నాదిమకవిప్రశంసయుఁ, గుకవినిరసనంబునుం గావించి సరసవచనరచనాసమర్థుండనైయుండి యేనొక్క ప్రబంధం బొనర్పం గలితప్రారంభుండనైతి; నందు మద్వంశక్రమం బభివర్ణించెద. 21

సీ. సురుచిరాపస్తంబ సూత్రవరిష్ఠుండు హరితగోత్రపవిత్రుఁ డైతనాఖ్యుఁ
పతనికూమిజావఘాటి యగుకొండమాంబకుఁ గొడుకులు తిమ్మన కొండనార్యుఁ
డను నామములఁదగి రందుఁ గొండనకుఁబ ద్మక్కఱుసుతులార్వ రాఢ్యు లెల్ల
సామాత్యవరుఁ డైతయప్రభుండును గొండఢీమణి తిప్పమంత్రిరాయను బ్రగడ

గీ. ఘనుఁడు సిద్ధనాఁగఁ బ్రఖ్యాతులైరి, వారిలో మజ్జనకుఁ డత్యుదారగరిమ
వెలసెసిరిఁ బ్రగడాన్వయ తిలకుఁడనుచు, దృఢయశోహారి కొండయ తిప్పశౌరి.

గీ. అతఁడాస్తంభగిరి నరహరిని వాస, మైనయిందు త్రిసీమలో నమరుసిరుల
కలిమిఁజెలువొందునిడుకుడి నెలవుగాఁగఁ, నిలిచిపత్రిల్లునతని వర్ణింపఁదరమె. 23

ఉ. సూరినుతుండు తిప్పనయశోజలజాక్షికిఁ గ్రీడసల్పఁగా
మేరు ధనుర్ధరాచలము పేఁడ సుధాజలరాసి కేళికా
సారము పువ్వుఁదోట దివిషద్ధరణీరుహసంచయంబు నీ
హారమహీధరంబు కృతకాద్రియునై విలసిల్లు నెప్పుడున్. 24

గీ. అతఁడు లోహితగోత్రాబ్ధిఘ్యుఁ డైనతుమ్మ, గోటితిమ్మయకును నీతికోవిదయగు
వెంగళాంబకుఁ బుత్త్రియై వెలయువేంక, టాంబ నురుపుణ్యశీలఁ గల్యాణమయ్యె.

క. అనువుగ నయ్యిరువురునం, దనులంగని రతులమతులనలువురమహా, ధ
ర్మన, నరసన, రంగన, తి, మ్మనయనఁగా శ్రుతిచతుష్టయము విధముమరన్. 26

క. అందగ్రజుండ నేనుమ, కుందపద ధ్యానపరత గురుకవితాలీ
లందనరి బుధుల సభఁ బ్రియ, మందివెలసినాఁడ ధర్మనామాత్యుండన్. 27

వ. మదీయానుజులతులప్రభావసంపన్నులై వెలయుదురు, తత్తత్ప్రకారం బెట్టిదనిన.

చ. దినమణితేజుఁడై పరగు తిమ్మయమంత్రి, నృసింహుఁ డెన్నఁ బో
ధనపతిసంపదన్ ఘనుఁడు దారగతిన్, మతిదేవమంత్రి, శాం
తనవుఁడు శూరతన్ నడకధర్మజుఁ డింద్రుఁడు వైభవంబునన్
ననవిలుకాఁడు రూపమున నాఁగఁ బ్రసిద్ధివహించె ధారుణిన్. 29

ఉ. రంగనకీర్తిభామినియు రమ్యజయాఖ్యదరైక లక్ష్మియున్
సంగతిఁగూడి యిబ్భువన సప్తకమందుఁ బ్రవర్తిలంగ, వా
రింగని వాగ్వధూటియును శ్రీసతియుం జనుదెంచిరంచు ది
వ్యాంగనలుత్సవంబెసఁగ నర్తనమొనర్తురు మంగళారతుల్. 30

ఉ. రాజు కళాప్రయుక్తి, రతిరాజు శుభాకృతియందు, దేవతా
రాజతిభోగలీల, దినరాజు ఘనప్రతిభాస్థితిన్, నదీ
రాజుగభీరవృత్తి, వనిరాసభలం గవిరాజు లెంచఁగా
రాజిలుఁదిమ్మరాజు నగరాజుధృతిన్ ధరణీతలంబునన్. 31

క. ఇమ్మాడ్కిఁ దనరు మువ్వురు, దమ్ములు గౌరవము సేయ ధరఁ గవివిద్వ
త్సమ్మతి గాంచిన నేనమి, తమ్మయ, గురువిభవలీలఁ దగియుండంగన్. 32

సీ. తనకేఘనుఁడు ప్రపితామహుండగు లోహితస గోత్రుఁడగు పుల్లదండనాథుఁ
డెసఁగు నేఘనుతాత యసదృశోన్నతిఁ జిట్టమాంబాధవుఁడు తిమ్మనాహ్వయుండు
పెనఁచె నేఘనుతండ్రి తనకీర్తిలత లాశ లంటఁ బెంపగు తిమ్మయప్రభుండు
వెలయు నేఘనుతల్లి విమలపతివ్రత వివిధసద్గుణశీల వెంగళాంబ

గీ. యాతఁడు తుమ్మురుగోటి వంశాబ్ధివిధుఁడు, సతతపేరూరి కేశవస్వామ్యధీన
మానసస్థితిఁ బరఁగు మాపేనమామ, మతిని గురుసన్నిభుఁడు ధర్మమంత్రివిభుఁడు.

చ. అనుపమ దానశౌర్య విభవాంచిత ధైర్యకృపాయశః ప్రవ
ర్తనుఁడగు తుమ్మగోటి యలధర్మపురీంద్రు వదాన్యమెన్నచో
మనమున నోడికల్పకము మ్రానుపడెన్. బలిమూలఁజొచ్చె, నా
ఘనుఁడు జడత్వమానె నలకన్నిధిభంగము నొందె నెంతయున్. 34

చ. అతని సహోదరుండు సుగుణాఢ్యుఁడు, కేశవపాదభక్తిసు
వ్రతుఁడు, పరోపకారి బుధవత్సలుఁ డూర్జితకీర్తిభాసమ
న్వితుఁడు, కృపాగభీరనయ విశ్రుత చారుచరిత్రుఁ డార్యస
మ్మతుఁడనఁగాఁ దనర్చె హరిమంత్రి, జనుల్ హరిమంత్రియోయనన్. 35

క. అనఘుం డాహరి భక్తిం, దనయునుమతి మెలఁగ నలరు ధర్మనరత్నా
సనమునఁగూర్చుండి ప్రియం, బెనయఁగ నను జేరఁబిలిచి యిట్లని పలికెన్. 36

చ. వినుమనఘాత్మ! ధర్మసుకవీ! భవదీయ వచోవిలాసముల్
ఘనకవిహృద్వికాసములుగావె? చమత్కృతిమీఱ నీవు నే

ర్చినగతి నిష్పాడా నలచరిత్రము వేంకటశైలరాణ్ణివా
సునకు సమర్పణంబుగను శోభనలీల రచింపు పెంపునన్. 37

వ. అనినం దలపోసి సంతోషంబు మున్నిరిగొనం బులకాంకురిత శరీరుండనై య ంశి
యేతత్ప్రబంధంబు రచియింపంబూనితి నిక్కావ్యకన్యారత్నంబున కధీశ్వరుం డై
న శ్రీవేంకటేశ్వరుని వంశావతారం బభివర్ణించెద 38

క. శ్రీవిలసిల్లంగ నొప్పెను, దేవమహీధరము యామ్యదిశ నుద్భవమై
తా వెలయు నంజనాద్రి ర, మావరుం డుండుం బిదప మహీనగ్గిరయున్. 39

క. హరి యనుమతిచే దక్షిణ, శరధీవల, శేషవాయు సంవాదమునా
డరుదెంచి ప్రాగుదన్వ, ద్వరుణదిశాస్థితిం దనర్చి వసునన్ వెలసెన్. 40

గీ. గరుడగంధర్వయక్షకింపురుషసిద్ధ, సాధ్యవిద్యాధరాసురచారణర్షి
పటలరుద్రమరుద్వసుపన్నగేంద్ర, సేవ్యమై యొప్పు న గ్గిరిశేఖరంబు. 41

క. మానవులకు నపవర్గని, ధానము గనంబడకె యున్నం దానంజనమై
యానిధి చూపెడు కతమున, నానగమున కంజనాహ్వయము సమకూరెన్. 42

గీ. అంజనాద్రి, వృషాద్రి, ధర్మాద్రి, వేంక, టాద్రి, శేషాద్రి, నారాయణాద్రి, గరు
డాద్రి, శ్రీశైలమును, వరాహాద్రి, సింహ, గిరియనుశుభాహ్వయములన్ గ్గిరి త నర్చె.

వ. అమ్మహీధరంబునందు, శక్రతీర్థంబును, శాలివాహ్వయంబును, శాంతతీర్థం బును,
చక్రపాణి దివ్యాయుధ పంచకంబు పేరం బ్రసిద్ధంబగు పంచాయుధ తీర్థంబు ను
ను, చక్రతీర్థంబును, విష్వక్సేనసరోవరంబును, విజయ తీర్థంబును, గరుడతీ బు
ను, గౌరీతీర్థంబును, వాగ్నేయసరస్సును, నధికతీర్థంబును, నశ్వినీతీర్థంబును, బ్రా
హ్మసరోవరంబును, బాంధవతీర్థంబును, సప్తర్షి నామంబులం బ్రసిద్ధంబగు సరో వర
సప్తకంబును, సౌమ్యతీర్థంబును, సౌర తీర్థంబును, సర్వవ్యాధాపహరణంబును వ
రామతీర్థంబును, వామనతీర్థంబును, వారుణతీర్థంబును, వాయవ్యతీర్థంబును, పర
మేశ్వరతీర్థంబును, పద్మసరోవరంబును, పాపవినాశియును, పాండవ తీర్థం బు,
పంచతీర్థంబులను నామంబులంబరగు తీర్థపంచకంబును, మహాతీర్థంబును, మ ది
తీర్థంబును, మాయామయంబును, మధుకతీర్థంబును, శిలాతోయంబును, కు -ర
ధారాతీర్థంబును, కృష్ణనిధియును, శోకహారణంబును, రోగఘ్నంబును నన ౦వి
మొదలుగాం బెక్కుతీర్థంబులు వెలయుచుండు నందు మఱియును. 44

గీ. ధరణి దివ్యతరంగిణి కరణి దురిత, సరణి వెడలించు స్వామిపుష్కరిణియనఁగఁ
దోయరుహనాభు మాయ త ద్రూపమై జ గద్ధితార్థంబుగా నన్నగమునఁ బొలిచె. 45

క. ఏతత్తీర్థము తీర్థ, వ్రాతంబుల కెల్లఁ దానె స్వామియనఁ గా
దే, తన్నామంబు ధరి, త్రీతలమున స్వామిపుష్కరిణియనఁ బరఁగెన్. 46

క. ఈజగతి తీర్థములు తమ, లోజనులు విడుచు నఘములు తలఁగుటకై
యోజమెయి స్వామిపుష్కరి, ణీజలములఁ గ్రుంకుననుచు నిగమము లెంచున్ 47

మ. కిరి ధాత్రీమహిళా మనోహరణ సంక్రీడాంచితస్థానముల్
సుర విద్యాధర సిద్ధ సాధ్య మునిరక్షోయక్షసంసేవ్యముల్
వరజంబీర రసాల పూగ వనదివ్యక్షేత్రముల్ స్వామిపు
ష్కరిణీతీర్థసమీపదేశములు పూజ్యంబెందు వర్ణింపఁగన్. 48

క. ఆ పుణ్య తీర్థ వరము స, మీపంబున భూసతీ సమేతంబుగ, ల
క్ష్మీపతి ప్రసన్నుఁడై కిటి, రూపంబున భక్తసమితిఁ బ్రోచుచు నుండున్. 49

క. అతని చరిత్రము లెంచఁగ, నతి చిత్రము లురగకంకణాంబుజభవ స
న్నుతి పాత్రములగుఁ గావున, నితరుల కమ్మహిమలవియే వర్ణింపన్. 50

వ. ఎట్లనిన. 51

మ. అతుల శ్రీనిధి ధర్ముఁ డన్నను పుదా నయ్యంజనాగంబుపై
నతి నిష్ఠం దప మాచరింపుచు వృషాఖ్యుండాల్చ ధర్మంబు సం
తతముం బెంపొదవంగఁ జేయుటకు నాత్మన్మెచ్చి యాశ్రీరమా
పతి లీలాకిటి రూపమొప్ప నెదుటం బ్రత్యక్షమై నిల్చినన్. 52

వ. ఆ ధర్ముండు మహాత్మా! యీయంజనాగంబు నా పేర నేనభివృద్ధిగాఁ జెందిన వృషాహ్వయ ధర్మంబు పేరం బరఁగునట్లుగా వరంబు దయసేయవలయు ననిన నతనివాంఛితంబుఁ జేకూర్చె, మఱియును. 53

మ. అమరాధీశుఁడు మన్మథవ్యథ నహల్యాజారుఁడై మేన గౌ
తమశాపావిధిచే వ్రణంబొదవ ఖేదంబొందుచున్ వేంకటా
ఖ్యమహీధ్రంబున కేగుదెంచి యచటం గంజాతపత్రాక్షు డెం
దములో నిల్పి తపంబు సేయ నతఁడాత్మన్మెచ్చి ప్రత్యక్షమై. 54

వ. ఆయింద్రునకభీష్టవరంబు లొసంగె మఱియును. 55

మ. అల దుర్వాసుఁడు నిష్ఠచేఁ దపము సేయన్ వజ్రి పుత్తేరఁగుం
తలయన్ దివ్యలతాంగి తత్తపము మాన్పం బూనిరాఁ దత్తపో
బలుఁడుం గాంచి శపించినం బిసప నప్పద్మాక్షి ధాత్రిన్ సవ
ర్ణుల నామర్త్యవధూటియై జలధిరాట్సాంగత్యలీలారతిన్. 56

కం. పుత్రుం గనకసముజ్జ్వల, గాత్రుం జిత్రప్రతాపకలితలసచ్చా
రిత్రున్ సద్గుణపాత్రుఁ బ, విత్రున్ దుష్కృతలతాలవిత్రుం గనియెన్. 57

వ. ఆబ్బాలకుండు దినదినప్రవర్ధమానుండై పెరుగుచు. 58

క. జనకుండగు జలధీశుని, యనుమతిఁ గొని యతఁడు గశ్యపాశ్రమమునకుం
జనుదెంచి వినతుఁడై యా, యనచే మంత్రోపదేశమంది ముదమునన్. 59

గీ. ఆతఁడు శ్రీవేంకటాద్రికి నరుగుదెంచి, యిందిరేశు ముకుందు గోవిందు డెంద
మందు నిల్పి తపంబు సేయంగ, నమ్మురారి ప్రత్యక్షమై వరంబడుగుమనిన. 60

ఆ. శ్రీనివాస నీదు సేనాధిపత్య సా, రూప్యముల నొసంగు రూఢి ననినఁ
గరుణ వెల్లివిరియఁ గన్నుల నబ్బాలుఁ, జూచి పలికె దనుజసూదనుండు. 61

మ. వినరా డింభక! నీతపోమహిమ, నీవిజ్ఞానభావంబుఁ గాం
చినచో నామది సంతసంబొదవె మత్సేనాధిపత్యంబుఁ బా
వన సారూప్యము నీకొసంగితిని విష్వక్సేన నామంబుతో
డ నిలింపాదులచేఁ బనుల్గొనుచు వేడ్కన్నిల్వు నాసన్నిధిన్. 62

వ. అని యానతిచ్చి వెండియుం బెక్కువరంబులొసంగె మఱియును. 63

మ. భగవంతుండగు వాయుదేవుఁడు జగత్ప్రాణుం డభీష్టార్థసి
ద్ధిగ నూహించి వృషాచలంబునకు నెంతే వేడ్క నేతెంచి య
న్నగమం దొక్క పయోరుహాకరము చెంతం బ్రాజ్ఞు నారాయణున్
జగదీశున్ మది నిల్పి తాఁ దపము నిష్ఠం జేయుచుండ న్వెసన్. 64

వ. అతనికి వరదుండై రక్షించె మఱియును. 65

క. తారకదైత్యుం డదితి కు, మారులఁ గారింపఁగాఁ గుమారుఁడు వడిఁ దా
నారక్కసుఁ దునిమినఁ ద, త్కారణమున బ్రహ్మహత్య గదిరిన నతఁడున్. 66

ఉత్సాహ. భయమునం బ్రయాగమునకుఁ బాఱి యందుఁ బార్వతీ
ప్రియునిఁ గాంచి మ్రొక్కి పలికె భీముఁ దారకాఖ్య దు
ర్జయునిఁ జంపినాఁడ దానఁ బ్రహ్మహత్య నన్ను నెం
తయు దహించె దీనిఁ గడప నాకు నేర్పుఁ దెల్పవే. 67

క. అని వినిపించిన సుతునకు, మనసిజ రిపుఁడనియె వినుకుమారక మాకా
నినుఁ బొందిన బ్రహ్మవధా, ఘనివృత్తికి నొక్కనేర్పు గలదెఱింగింతున్. 68

ఆ. సర్వతీర్థమయము సర్వదోషఘ్నంబు, సర్వసులభమగుచు జగతి వెలసి
వాసుదేవునకు నివాసమై తగు వేంక, టాచలంబు దక్షిణాశయందు. 69

సీ. చందనామలకేందర్భి కుందసారంగ మాకంద నానావనీ సుందరంబు
లలిత కందరసము జ్జ్వలిత రత్నప్రభాకలిత చతుర్దిశా విలసితంబు
మహితామర్త్యలోక సహితామృతాంధోగణహిత ప్రచారాగ్ర మహితలంబు
భ్రమరాబ్జసముద చక్రమరాళ మిథున సంభ్రమరాజదురు సరస్సముదయంబు

గీ. సమర వరదహనయమనరాశిపాశి, పవన, భవసఖ, శిఖినేత్ర, భవ్యనవ్య
మకుట మణిఘృణి, నికర సమ్యక్ప్రదాబ్జ, హరినివాసంబు శ్రీవేంకటాచలంబు. 70

ఆ. అందుఁ దపముసేయ హరిమెచ్చి నీదోష, మణఁచునని నట్లు యతఁడు వోయి
యచటఁ దపము సలుపు నంతలోఁ జక్రిప్ర, త్యక్షుఁడై వరంబులడుగు మనిన 71

చ. మదిఁ బ్రమదంబుసంధిలఁ గుమారుఁడు శౌరిమురారిఁ గాంచియో
సదమలరూప! తారకునిఁ జంపిన బ్రహ్మవధాఘమంతె న
న్నది విడిపించి యీయచలమందొక తీర్థము నాదుపేర భూ
విదితముగాఁ దనర్పఁగఁ బవిత్రచరిత్ర వరంబొసంగవే. 72

వ. అనిన నతనికి నభీష్టార్థసిద్ధిగా వరంబులు గృపచేసె మఱియును. 73

క. వినతానందనుఁ డొకనాఁ, డనుపమ మహిమాభిరాముఁడగు నగ్గిరిఁ దాఁ
గొనిపోయి పరమధామం, బునఁ జేర్చెదనంచుఁ దలఁచె బుద్ధిం గడిమిన్. 74

వ. ఇట్లు తలంచి. 75

సీ. పెనుఱెక్కవీపునఁ బెకలి శైలంబులు తాళంపుఁజిప్పల లీలఁదాఁక
జవతీవ్రమునధరా జములుకూఁకటులూడి కారాకు లెగసిన గరిమ నెగయ
దటిసిన నెదుటి త్రిదశవిమానములూడి సెలరాలఁబోలి దిక్కులను వ్రాల
నుడుమార్గమొఱసి పోయెడుదాఁకఁ జెదరి లాజలు చల్లినట్లు చుక్కలిలఁ రాల

గీ. పటుభయంకర సంరావ పటలి దోఁస, పండుగతినట్లు జాంబూనదంబు పసులు వారి
విశ్వభీషణమూర్తితో విహగరాజు, వచ్చె వేంకటగిరికి నవార్యమహిమ. 76

ఉ. అప్పుడు వేంకటాద్రి విభుఁడవ్విహగాధిపుఁ గాంచితార్క్ష్య నీ
విప్పుడువచ్చినట్టి తలఁపిందుఁబొసంగదు గాననేనునిం
దెప్పుడుమందిరంబుగ, ధరేందిరలంగవగూడి వేడ్క పెం
పొప్పఁగనొక్కకల్పము సమున్నతవైఖరి నుందుఁబొందుగన్. 77

క. కావున నన్నెడవాయక, నీవీగిరిదక్షిణమున నిలువుమనివనా
శ్రీవల్లభునమతిగొని, యావిహగాధిపుఁడుదక్షిణాశన్నిలిచెన్. 78

ఆ. నిలిచిహరిపదాబ్జములు భజింపుచునుండు, నాథ! యీనగంబు నాదుపేరఁ
బరఁగునట్లుగాఁగ వరమియ్యవేయన, నతనికోర్కెయొసఁగె నచ్యుతుండు. 79

క. ఈరీతిభక్తసమితికిఁ, గోరికలొసఁగుచును వైకుంఠుఁడుధరి
త్రీరమలఁ గూడియిట్టవి, హారాయతమతివదృశ్యుఁడైక్రీడించున్. 80

సీ. ఒకవేళధారుణీ యోషాకపోల సీమలమకరీ పత్రములులిఖించు
నొకవేళఁగమలా కుచోపరిస్థలముల నఖరాంకములు సమున్నతినొనర్చు
నొకవేళనిరువుర నుపగూహనాసక్తిఁ గేళిఁదేల్చుచు వేడ్క నోలలాడు
నొకవేళనిస్సంగ యోగియైవారలఁ గనుమొఱంగుచును నేకతఁజరించు
గీ. యోగనిద్రాబ్ధి రతినొందు నొక్కవేళ, నుచితలీలలఁ గొలువుండు నొక్కవేళ
వివిధమాయావినోదియై వేంకటాచ, లేశ్వరుఁడదృశ్యముగఁ గ్రీడలిట్లుసలిపె 81

వ. ఇవ్విధంబున నిజమాయానిబద్ధ సకలభువనుండును సంరక్షితకౌశికసవనుండును, వేంకటాచల భవనుండును నగు రమాజాని యన్నారాయణాచలంబు నంబాయక యదృశ్యంబుగఁ బ్రవర్తించుచుండునంత. 82

తరల. నయగుణాఢ్యుఁడు శంఖుఁడన్ జననాథవర్యుఁడు హైహయా
న్వయుఁడు భాగవతాగ్రగణ్యుఁ డవార్యశూరత ధాత్రియం
తయును నేలుచు నొక్కనాఁడు మనంబునం దలచెన్ హరిన్
నయనపర్వముగాఁగఁ జూడఁగ నాకుఁ గల్గునెయంచుఁ దాన్. 83

వ. అట్లుదలంచితనలోన. 84

సీ. కమలాక్షు గానంత సమలాలితంబైన సుందరాకారంబుఁ జూతునొక్కొ
కరుణారసముఁ జిలుకు తరుణారవిందంపుఁ గన్నులననుఁ జూచి కాచునొక్కొ

యురగాన్వయద్వేషి తురగాధిరోహణ స్థితిఁ గాంచి మ్రొక్కి ప్రార్థింతునొక్క
మహితావనీరమా సహితానురాగియై యెసటఁగన్నడి కోర్కులిచ్చునొక్క.

గీ. హారములురత్న మకుట కేయూరములును, దెలఁగునవ్విభుఁ గదిసిభజింతునొక్క
భక్తులందుఁదపఃక్రియాసక్తులందు, నిలుచుదేవుండుననుఁ బ్రోవఁదలఁచునొక్క.

క. హరిఁ జూడ కున్న కన్నులు, హరికథ విన లేని చెవులు హరి వర నామ
స్మరణ మొనర్పని జిహ్వయు. హరిఁ బూజింపని కరంబు లవి వృథగావే. 86

క. కావున హరి పద చింతనఁ, గావించి తపంబుఁ జేసి కళ్యాణకరం
బై వెలయు నతని దివ్య త, నూ విలసన విభవమున్ననుం గొందు వెసన్. 87

వ అని తలపోసి చని యొక్క రమ్యస్థలంబున. 88

చ. కరయుగ మెత్తి చూడ్కి రవిఁ గ్రమ్మఁగఁ జేసి పదాంగుళీతతుల్
ధరణిసోకింత మోపి ఫణితల్పునిఁ గూర్చి తపంబు నిష్ఠ పెం
పరుదుగఁ జేసి ప్రావృడుదయంబున శైళ్య హిమంబునన్ వని
ర్ఝర జలమందు వేసవుల బంచహుతాశన మధ్య సంస్థితిన్. 89

గీ. ఇవ్విధంబునఁ బెక్కువేలేండ్లు తపము, సేయనొక నాఁడు శంఖభూ నాయకునకు
ఘనఘనారావ గంభీర నినదవృత్తి, జలధి కన్యాధి పతి యదృశ్యమునఁ బలికె 90

ఉ. చాలుఁ! బురే! తపంబుడుగు శంఖనృపాల! వియత్తరంగిణిం
బోలెడు స్వామి పుష్కరిణిపొంత ననున్ భజియింపు మందు ని
న్నోలి నగస్త్యుఁ డెప్డుగదియు న్విమలప్రద లచ్చితో జగం
బేలెడు వైభవోన్నతుల నేను నిజాకృతి నీకుఁ జూపెదన్. 91

క అని పలికిన విని సంభ్రమ, మున శంఖుండలరి స్వామిపుష్కరిణికి చే
చనితత్తీరమున నగ, స్త్యునిరాకకుఁ జాల నెదురుసూచుచునుండెన్, 92

వ అప్పుడు. 93

చ. జనసుతుఁడైన శంఖునకుఁ జక్రినిజాకృతిఁ జూపు మాడ్కి నెం
దునన్ బొడగట్టకుండఁడు ఘనుండతఁడవ్విభుఁ జూతమంచు నా
సనకసనందనాదులును సప్తమునుల్ సురలింద్రుఁడీశుఁడీ
శునిసతిచేరి యన్నగముచుట్టును నిల్చి తనర్చిరంతయున్. 94

క. అంత నాకనాథుఁడగస్త్యుఁడు, సంతసమున విప్రగోష్ఠి సలుపుతఱి రమా
కాంతునిఁ బ్రశంససేయుచు, నెంతయుమోదమున మునులకిట్లనిపలికెన్. 95

శా. శ్రీమద్వేంకటశైలమౌళిపయి లక్ష్మీభామినీభర్త మ
ద్భ్యాసద్భాగ్యములకెంతయున్ దయ నభీష్టార్థంబు చేకూర్చు మన్
భూమిన్ శ్రీమహిళాసమేతముగ సంపూజ్యస్థితిన్ నిల్చి ప్రా
ద్యామప్రక్రియనున్నవాఁడు మనమాధన్యన్ నిరీక్షింతమే. 96

వ. అని పలికి యమ్మునులుం దానును గోవిందసందర్శనాపేక్ష నాక్షణంబ తరలి వేంక
టాచలాభిముఖులై యనుదినప్రయాణంబులం బోవుచుండు నవసరంబున. 97

సీ. లలిత జటాచ్ఛటాకలితారుణచ్ఛాయదండనెల్లెడల నీరెండఁగాయ
భసితానులేపవిభ్రమతనూరుచి క్రొత్తచెలువున వెన్నెలపోలుపుఁజిలుక
నవనవమధుర వీణానినాదము చిత్రవైఖరిఁ గర్ణపర్వములొనర్ప
నపవర్గభామినీ హారాయమాణాక్షమాలాశ్రయము వింతడాలు నెఱప

గీ. జిహ్వాకారంగనర్తిత శ్రీవరాఖ్య, సరసవర్ణంబులోష్ఠవిస్ఫురణఁ దెలుప
దివ్యతేజోవిలాసంబు దిశలఁగప్ప, నారదమునీంద్రుఁడరుదెంచె భూరిమహిమ. 98

వ. ఇట్లువచ్చిన నతనికి నగస్త్యమునీంద్రుం డతిథిసత్కారంబు సలిపి యతనిచేత స
ముచిత సత్క్రియలు వడసి యిట్లనియె. 99

క. అమరమునినాథ! యీయా, గమనం బెందుండి యెటకుఁ గదలుటకై చి
త్తమున దలంచితిరో యనఁ, బ్రమదమున సురర్షి కలశభవునకు ననియెన్. 100

క. నారసనాభుని సాక్షా, త్కారంబునఁ జూతుననుచుఁ గలశజ! మది నేఁ
గోరిచని గౌతమీఘునిఁ, జేరి తపోనియతినుంటిఁ జిరకాలంబున్. 101

చ. హరిఁగనలేక కుందుచు రయంబున నంబుజగర్భుఁ జేరఁగా
నరిగి నమస్కరించి జనకా! కనకాంబరుఁజూడఁ గోరి నే
నరిది తపంబుచేసి తుదినవ్విభుఁగానఁగ నోపనైతి సు
స్థిర కరుణాసమగ్రమతిఁ దెల్పఁగదే యొకబుద్ధిదీనికిన్. 102

చ. అనవుడు మందహాస కలితాననుఁడై పరమేష్ఠి నన్నుఁదా
గనుఁగొని యానతిచ్చె హరిఁగానఁగ నెవ్వరికైన దుర్లభం
బనఘ! వికుంఠధామ నిలయంబున నుండక తండు వేంకటా
ద్రినిపుడు నిల్చి భక్తసమితిం గరుణించు నదృశ్యలీలలన్. 103

క. తరులెల్లవందితతిపక్షి, స్తరనిచయంబెల్ల నతని సారూప్యము ని
ర్ఝరులెల్లఁ బుణ్యతీర్థము, లరయఁ దరమె వేంకటాద్రి నభివర్ణింపన్. 104

వ. అప్పర్వతంబునం దెట్టివారికైన వరదుండగుచు భగవంతుండు జగతీరమాసమేతం
బుగా నదృశ్యంబున నున్నవాఁడు గావున. 105

మ. తనయా! నీవటు చేరఁగాఁ జనుము తద్ధాత్రీధరంబందు స
జ్జన సంరక్షకుఁడిందిరావిభుఁడు సాక్షాత్కారముం జూపునీ
కునటంచు న్గురుఁడానతీయ మదిఁ గోర్కుల్మీఱ నచ్చోటికిం
జనుబుద్ధిన్ వడి నిట్లవచ్చితి మహోత్సాహంబునం గుంభజా. 106

వ. అని పలికిన నతనిం గనుంగొని ప్రహృష్టాంతరంగుండై యగస్త్యుం డిట్లనియె. మహా
త్మా! నేను నీమునిగణంబులును గోవింద సందర్శనాపేక్షన వేంకటాచలంబునకు
పోవందలంచి వచ్చుచున్నవారము గావున. 107

క. ఏవిధము నేము దలఁచితి, మావిధమే తలఁచి వచ్చితౌనా నటకుం
బోవుదమే? యోహో! యు, ద్భావం తద్భవతి యనుట తథ్యంబయ్యెన్. 108

వ. అని చిఱునవ్వునగుచ నన్నారద సహితంబుగా మునిగణపరివేష్టితుం డగుచు నను
దినప్రయాణంబులం జనిచని. 109

మ. కనియెం గుంభతనూభవుం డెదుట రంగత్తుంగకూటప్రఘ
ట్టనవిర్ఘోషితమేఘజాలము, నగాధశ్రీసమేతాబ్జలో
చననిత్యోత్సవకేలిలోలము, దిగీశప్రేడితాత్యంత పా
వనసంశీలము, శేషశైలము దరీవైచిత్రికోత్తాలమున్. 110

వ. కని కదియఁజని తదవరోహణంబుఁ గావించి. 111

క. ఇదె బ్రహ్మసరోవర మ, ల్లదె తుంబురుకోన యదె మహాతీర్థం బ
ల్లదె పాపవినాశినియని, సదమలమతిఁ దెలియఁ బలికె చనిచని మఱియున్. 112

ఉ. ఇచ్చట ధర్ముఁడున్ననియె నిచ్చట నింద్రుఁడు గాంచెఁ బాశి తా
నిచ్చటఁ జూచె గంధవహుఁ డిచ్చటఁ బ్రస్తుతిచేసె నగ్గహుం
డిచ్చటఁ గన్గొనెం గరుడుఁ డిచ్చట దానెను శౌరినంచుఁ దా
నచ్చట నచ్చటం గదిసి యామహిమల్ వివరించి చెప్పుచున్. 113

వ. తత్తీర్థంబుల దర్శన స్పర్శన స్నాన పానాదులం దనివిసని ముకుందసరోవర్యా
ర్ఘంబు ప్రవర్తింపుచు. 114

క. ఇదె హరిని నిరీక్షించెద, మిదె హరికిఁ బ్రొక్కులిడెద మిదె హరిని భజిం
చెద మిదె యిదె యిదె యనినది, గుదిగొను తరితీపుతోడఁ గుంభోద్భవుఁడున్.

సీ. జొనుఁబూఁదేనె సోనలు గురియంగఁ బాలుసెలయేటి పజ్జలరసి
పసువంపుఁదావుల విరులపల్లుజల జలరాలు పొదరిండ్ల చాయలరసి
సందుగానఁగరాని గందంపుమ్రాఁకుల వలగొన్న నిమ్మల వాడలరసి
సోగనంటులచాలు చుట్టుగారాలిన కప్రంపుఁదిన్నెల కడలనరసి

గీ. నిండుచెంగల్వకొలకులఁ దండలరసి. గుజ్జుమావులచీఁకటి కోనలరసి
మెఱుఁగులీనెడు నెలరాల మఱుఁగులరసి, సరసిజోదరుఁ గనలేక తిరిగితిరిగి. 116

వ. ఇట్లనియె 117

చ యువనుఁడఁగాను గొండ బిలమందు వడిం జని కన్గొలంగ, ని
న్గవయుజరా తనూభవుఁడఁగాను మెంగంబటు చేసిపాఱఁగా
రశపతిఁగానుగూర్తి బెదరన్వలపత్తు మొనర్చిపోవ. మా
ధవ! నినుఁ నమ్మినట్టి నిజదాసుఁడ నీశుభమూర్తి చూపవే. 118

సీ. చూపవే నీదివ్యరూపంబు నామది తాపంబు వాయఁ గందర్పజనక
కమపింపవే శుభాకారంబు నాదు విచారంబు దలఁగఁ బర్జన్యవినుత
సాక్షాత్కరించవే రక్షింపఁ జాల నపేక్షించి నాడ ముముక్షువరద
సందర్శనంబీవె డెందంబు వెతమాను చందంబునొంద సూర్యేందునయన

గీ. యెదుట నిలిచి మదీప్సితం బీయఁగదవె భవ, పయోరుహ భవవంద్య పాదపద్మ!
కదిసి మముఁ గాంచునట్లుగాఁ గావవయ్య, సంతతోల్లాస! వేంకటాచల నివాస.

చ. అని పలుమాఱు పల్కి కలశోశనముఖ్య తపోధనాళిఁ గ
న్గొని మునులార! నాచెలిమిఁగూడిన దోషమునన్ హరిన్ జనా
ర్దనుఁగనఁజాలనైతిరిగదా! యిఁకనన్నెడవాసి పొందు మీ
కనిశముఁ జూడఁ గల్గెడు నఘౌఘవిమోచనుఁ బద్మలోచనున్. 120

సీ. భూనుతంబైన కాశీనివాసము మాని వెడలివచ్చినయట్టి జడుఁడఁగాన
నాటదూష్యత్వమైన యామ్యభాగస్థితి వదలకుండినదుష్టవర్తిఁగానఁ

చారిఁ జతుర్వ్యూహులాపోశించి మదినహంకారంబు చూపిన గర్వి గాన
వింధ్యాద్రి మహిమ భావించి యోర్వఁగ లేక మదిలోనఁగినియు తామసుఁడఁ గాన

గీ. వాసిఁ గనుపట్టఁ డాజగన్నాయకుండు, వసుధ దుర్జనం దూరతో వర్జయేత్త
నంగ వినియు నతండేల నన్నుఁ గదియు, నెఱుఁగ కూరక తలపోయుటింతె కాని.

చ. అనిన నగస్త్యుఁ గాంచి కలహాశనుఁ డెంతయు నూఱడించి యి
ట్లను, విమలాత్మ! నీవిటుల నజ్ఞునికైవడిఁ బల్కఁ దొప్పునే
విను మనకెన్ని చందముల విష్ణుశుభాకృతిఁ జూడఁ గల్గు ము
న్వనరుహ సంభవుండనిన వాక్య మమోఘము గాక తక్కునే. 122

క. అనిపలుకుచున్న సమయం, బున నంచ పటాణి నెక్కి మునులును విబుధుల్
దనుముట్టుఁ గొల్చిరాఁగా, వనజాసనుఁ డరుగుదెంచె వారలకడకున్. 123

గీ. అపుడగస్త్యాది మౌనీంద్రు లతని కెదురు, నడచి సాష్టాంగ మెఱఁగి వినమ్రులగుచు
బహువిధంబులఁ బలుమాఱుఁ బ్రస్తుతింప, వారిఁ గన్గొని పల్కెన వ్వాగ్వరుండు

చ. వినుఁడు మునీంద్రులార! యరవిందదళాక్షుఁ బ్రయత్న పూర్వకం
బునఁ గన దుర్లభంబు మము బోంట్లకునైన నతండహేతుకం
బునఁ గనుపట్టు భక్తతతిఁ బ్రోచుటకై యొక వేళ మీరలా
ఘనునిజరూప వైభవముఁ గాంచెదరెంతయుఁ జింతమానుఁడీ. 125

ఆ. అనుచుఁ దెలిపి బ్రహ్మ యంతర్హితుండైన, నల్లమందుముదము వెల్లిగొనఁగ
మొలక నవ్వుఁ జిలుకు మోముతోఁ గుంభసం, భవుఁడు మునులఁ గాంచి పలికె నపుడు

వ. మహాత్ములారా! చతుర్ముఖు వాక్యం బమోఘంబు భగవంతుండగు రమాకాంతుండు ప్రత్యక్షంబగునంతకుఁ దాళవలయు నంతపర్యంతం బిమ్మహాచలంబునకుఁ బ్రదక్షిణంబుగాఁ బ్రవర్తింపుచు నయ్యైస్థలంబులంగల విశేషంబులు గనుంగొన వలయు నని వారుణాశం దరలి వాయవ్య భాగంబునకుం జని యచ్చట. 127

మ. కమలాప్త ప్రతిమానతేజు నతి దీర్ఘస్పష్టనీలాంగు ర
త్నమయానేకవిభూషుఁ జిత్రతరవస్త్రప్రాంచితున్ దివ్యనౌ
క్క మహాపూరుషు దొలఁ గాంచి కదియంగా నేగి మీరెవ్వర
య్యా! మహాత్మా యన నంతలో నతఁ డదృశ్యంబైన నప్పానియున్. 128

క. ఆచ్చెరువందుచుఁ, గన్పడె, నిచ్చట నెవ్వఁడో మహాత్ముఁ డితఁడని వేసఁ దా
వచ్చోటువాసి ముదమున, వచ్చెం దద్దిశకు మౌనివర్యులు గొలువన్. 129

వ. వచ్చియందు. 130

చ. పటుతరమైన పక్వఫలభార వినమ్రమహీరుహంబు చెం
గట సనకాదియోగితతిఁ గాంచి సమర్చలొనర్చి వారచే
నట ప్రతిపూజలంగొని దయాయతమానసులార మీరలిం
తట వేసఁ గాంచియుండిన విధంబును నాకెఱుఁగంగఁ జెప్పరే 131

వ. అనిన నగస్త్యునకు సనకాదు లిట్లనిరి. 132

ఆ. అనఘ! యిమ్మహీధ్రమున కధీశ్వరుఁడైన, కమలనాభుజాడఁ గాంచివార
మతని మీఱఁ గాంతు రనితలిర్చి సనకాది, మునులదృశ్యులైర ఘనుఁడతండు. 133

మ. చని యీశాన్యమునందుఁ జేరి యచటన్ సప్తర్షులం గాంచి మీ
రనిశం బిచ్చటఁ గాచియున్న విధ మేమన్నన్ ఋషింద్రాజనా
ర్దను నీక్షింపఁగఁ గాచినారమిట మీరల్గాంతు రద్దేవు నం
చును వారంత నదృశ్యులైన నతఁడచ్చోటువాసి పూర్వాశకున్. 134

క. చని యచట సురల నింద్రునిఁ, గనుఁగొని మీరిచట నిట్లు గాచినవిధమే
మినిమిత్తం బనవుఁడు న, మ్మునికి సురేంద్రుండు పలికె ముదము దలిర్పన్. 135

ఆ. ఇన్నగేంద్రమున కధీశ్వరుం డగు శౌరిఁ, గాంచుకొఱకు నిచటఁ గాచివార
మతని మీఱఁ జూతురని శక్రుఁ డమరుల, దృశ్యులైన నగ్నిదిశకు నతఁడు. 136

వ. చేరం జనుదెంచి యచ్చట. 137

గీ. హార కుండల మకుట కేయూర ముద్రి, కోపపీతాంబరములతో నొప్పువిప్ర
వేషములు దాల్చియున్నట్టి విష్ణుదివ్య, సాధనంబులఁ గని మ్రొక్కి సన్నుతించి,

వ. ఉండునంత వారంతర్హితులైన నానెలవుదరలి యామ్యభాగంబునం జేరి యచ్చట.

చ. తలవినువంక క్రొవ్విరిగఁ దాల్చిన క్రొన్నెలవంక కేలునం
జెలువుదలిర్చు జింక వెయిచేతులనొప్పెడు లెంక మేనునం
జెలి యొకవంక శోప్పగను జేకొను రిక్కలడొంకగల్గి పెం
పలరు సమాధినాయకు జితాసమసాయకుఁ గాంచి నమ్రుఁడై, 140

క. మీరెల్ల నిచటనునికికిఁ, గారణమే మనిన, శౌరిఁ గాంచుట కొఱకు
న్నారము తద్దేవోత్తము,మీరెల్లను గాంతురనుచు మృడుఁడన నతఁడున్. 141

వ. అచ్చోటువాసి నిర్ఋతిభాగంబునం జేరం జని యుండు. 142

సీ. వైడూర్య రత్న భా-స్వత్కిరీటము వాని, రమణీయ మణి కుండ-లముల వాని
వెలి దామరలఁ గేరు-వెడఁద కన్నులవాని, మొలకనవ్వులఁ జేలు-మోము వాని
కంఠావలంబి ము-క్తాహారముల వాని, హైమవర్ణచ్ఛాయ-నమరు వాని
యాజానుబాహువు-లతిశయిల్లెడు వానిఁ, బటుతర కేయూర-పఙ్క్తి-వాని

ఆ. గరుడ సిద్ధసాధ్య-గంధర్వ యక్షుర, క్షోబలంబులెల్ల-గొలుచు వాని
దానవాలిఁ దోలు-వాని విష్వక్సేనుఁ, గాంచి సన్నుతించె-కలశభవుఁడు 143

మ. అపుడా సూత్రవతీ మనోహరుఁడు నే-త్రాబ్జంబులం దొల్కని
ద్దపుఁగారుణ్యరసంబు వెల్లిగొనఁగాఁ-దన్మౌనితోఁ బల్కె మీ
రిపుడిచ్చోటికిఁ గోరి వచ్చినతలం-పేదేని శ్రీమాధవా
ధిపుఁడు న్మీకుఁ బ్రసన్నలీల నిజమూ-ర్తిస్ఫూర్తిఁ జూపట్టెడున్. 144

క. అనినఁ బునఃపునరభివం, దనము లొనర్చుచును నచటఁ దరలి కలశజుం
డను చరముని సహితముగాఁ, జని చని యొకచోట దివిజ-సంయమిఁ గాంచెన్. 145

క. శ్రీదయితుఁడు గనుపట్టమి, ఖేదము మదిఁ బురకొనంగఁ-గృష్ణా! యిఁకమా
కేదిగతి యేమి సేయుదు, మే దెసనినుఁ జూడఁగల్గు-నెయ్యది తెరవో. 146

శా. ఆపద్బాంధవ! దీనరక్షక! త్రిలోకాధీశ! గోవింద! ని
న్నీ పట్టం గనుగొందు మంచిటకు వే-యేండ్లయ్యె నేతెంచి, హా!
మా పుణ్యం బెటువంటిదో విమల ల-క్ష్మీశ్రీలఁ గన్పట్టు నీ
రూపంబెందును గానమైతిమి, ఖగా-రో హా! దయం జూపవే 147

క. ఎందెందు వెదకి చూచిన, నందందే కలఁడు చక్రియనెడు దనుజ గా
ణ్ణందను వచనంబిచ్చోట, సందేహము పాలు సేయఁ జనునె మహాత్మా. 148

సీ. పెఱవారివలె మాకు బెడిసిపాటిదవవయా తలఁచూపక శ్రీశ దాఁగఁదగవె
కడకొమ్ములను నిల్చి కనుపట్టవకటా! కోపంబు మాపట్లఁ జూపనగునె

నీపాదములుగొల్చు నేర్పుమాకొసఁగవే పాడకట్టకొందరో నుడిగెదేల?
మునివృత్తినున్న మమ్ములఁజూచి దయరాదె బలిమియే నీ కృపకలిమి గాక

ఆ. రావిదేమికపట భావమోతలపోయ, దురితమెల్లనెడలఁ ద్రొక్కిదేవ!
దీనరక్ష! మిమ్ముఁ గానంగఁజేయు ని, ర్నిద్రశౌర్య వేంకటాద్రివర్య! 149

క. అని పలుకుచున్న తఱి న, మ్మునులఁ గదియవచ్చిరటకు ముదమొదవ గురూ
శనులును నుపరిచరవసువు, ననుభాగవతోత్తముండు నతిరథసమునన్. 150

వ. ఇట్లువచ్చి. 151

క. గురుశుక్రవసువులమ్ముని, వరులకు నిట్లనిరి యోగివల్లభులారా!
యరయఁగ నిందఱుమీరీ, కరణిఁ చట నుండ నేమి కారణమనినన్. 152

వ. అగస్త్యుండిట్లనియె. 153

చ. వినుఁడనఘాత్ములార! యరవింద దళాయత నేత్రునిగ్గిరిం
గనుఁగొనఁగల్గునంచుఁ గుతుకమ్మున నీమునులేనువచ్చి పా
యనితమినిందువత్సరసహస్రము దిమ్మతుచుండి యస్మహా
త్మునిఁగననోపమైతిమి మముంబయిఁగొన్న యభాగ్యసంపదన్. 154

వ. ఏతన్నిమిత్తంబు చింతాక్రాంత స్వాంతులమై యున్నవారము. 155

గీ. అనిన గురుశుక్రవసువులిట్లనిరి కలశ, భవ! వినుము శంఖుఁడనుమహీపతికిమునుము
రారివరమిచ్చె నిన్నగస్త్యముని గదియు, నపుడునీకేను బ్రత్యక్ష మగుదునను చు

వ. ఆశంఖుఁడు భవదాగమనంబున కెదురుచూచుచు స్వామి పుష్కరిణీతీరంబున ని
ప్పుడున్నవాఁడు నీవు నెమ్మనంబున ఖేదంబుడిగి యాశంఖమహీపాలుం జేరంజను
ము. భగవంతుండగు రమాకాంతుండు సాక్షాత్కారంబునం బ్రత్యక్షంబయ్యె
డు ననిపలికిన నతికుతూహలమానసుండగుచుఁ గుంభసంభవుండు వారదాదిమునిగ
ణసహితంబుగా స్వామిపుష్కరిణీతీరంబున కభిముఖుండై చన నగ్గురూశన వసువు
లును వారి నిరీక్ష ణాశాపాశనిబద్ధ హృదయులై యమ్మునీంద్రు లనుగమనంబున స
మాచిత సంభాషణంబులం బొద్దుపుచ్చుచుఁ జనిరాసమయంబున. 157

క. ఘనుఁడగు శంఖునకు వృషా, ద్రిని వారి గనుపట్టు నత్తఱిని జూడఁగఁగ
ల్గున టంచును శ్వేతద్వీ, పనివాసులు వచ్చిరటకుఁ బటురయమెసఁగన్. 158

వ. అంత. 159

గీ. కలశజాదులుస్వామి ప్రదక్షిణీకరించియు, నెదుట యుండు శంఖభూపాలుఁ డెదురునడచి
యర్ఘ్యపాద్యాది కృత్యంబు లాచరించి, యుచితలీలల వారు దానుండునంత. 160

సీ. వైడూర్యమకుట భా-స్వచ్ఛిరో నిచయంబు, సంఖ్యాక సర్వాంగ-సముదయంబు
కౌస్తుభ వనమాలి కాహలాసంబద్ధ, చక్రాదిసాధన-సంచయంబు
పద్మ బాంధవకోటి-భాసురా జఃపుంజ, మురుదివ్య భూషాస-ముజ్జ్వలంబు
శ్రీభూ వధూ కలి-తోభయ పార్శ్వంబు, లలితపీతాంబరా లంకృతంబు

గీ. పత్రిప స్కంధ సంరోధ-బంధురంబు, నగుచు నిఖిలామరశ్రేణి-యలమికొలువ
భవ్య వేంకట గిరి పర-బ్రహ్మమప్పు, డమ్మహాత్ముల కెదుట బ్రత్యక్షమయ్యె. 161

ఉ. అప్పుడు దివ్యదుందుభులజాండమునిండఁగ మ్రోయుచుండ నా
చప్పుడు వీనులం బడిన పారసలోచనుఁ డంజనాద్రిపై
నిప్పుడు శంఖముఖ్యులకు నెంతయు వేడ్కఁ బ్రసన్నుఁడయ్యెఁబో
తప్పదటంచు నచ్చటికిఁ దాఁజనుదెంచె విరించి ప్రేల్మిడిన్. 162

వ. మఱియును. 163

క. మునులు ప్రదక్షిణకాలం, బునఁగాంచిన నీలవర్ణ పురుషాగ్రణియున్
సనకాదులు సప్తర్షులు, ననిమిషపతి శివుఁడు వచ్చి రచటికి వేడ్కన్. 164

వ అప్పుడు. 165

గీ అనుపమం బప్రమేయ మనంత మత్తు, ర మసమమవాఙ్మనసగోచరం బచింత్య
మవ్యయం బద్భుతం బాద్యమైన శౌరి, వైభవాకృతి నేత్రపర్వముగఁ గాంచి.

క. పులకాంకురిత శరీరులు, గలితానందాశ్రు నేత్ర కమలులగుచుఁ ద
త్కలశజ శంఖప్రముఖులు, పలుమఱు నత్యంతభక్తిఁ బ్రణమిల్లి వెసన్. 167

వ. శంకర పంకజాసన పూర్వకంబుగ నిలువంబడి ముకుళితకరులై యిట్లని స్తుతి
యించిరి. 168

ఉ. స్వర్ణమయాంశుకావృతు, నజస్రమదాస్రపసంఘలప్రహా
దార్ణవసంప్రాతౌర్వ, నఖిలాత్మకు, నక్షరు, నాద్యసంబుము
గ్వర్ణ్ణ, ననంతగేనపటుకాంతు, నచింత్యు, ననంతసామర్థ్య
కర్ణశయాను, నీశ్వరు, నగణ్యునిమం బ్రణుతింతుమీశ్వరా. 169

సీ. మానితదుగ్ధపాథోనిధిసంచార శ్రితపరిరక్షణాయతవిచార
జీర్ణితాసురవధూసీమంతసిందూర ప్రాకటదుర్జనానీకదూర
కమలాలయాహంసికాదివ్యకాసార మోహనమాంగళ్యమూర్తిసార
బాహుసంశోభితపటురత్నకేయూర భూసతీకైశికాంబుదమయూర

గీ. భాసితాతిమభూదార భవవిదార, యతులితాంచిత సుకుమార నతకుమార
యతనుకోటినిభాకార గతవికార, లలితగుణహార వేంకటాచలవిహార. 170

క. విశ్వమయ విశ్వరక్షణ, విశ్వాత్మక విశ్వవినుత విశ్వేశహరీ!
శాశ్వత సర్వోత్తమ పర, మేశ్వర మ్రొక్కెదము కావవేమముఁ గరుణన్. 171

గీ. వేదములు గానలేని నీవిశ్వరూపు, గరిమఁ గంటిమి జ్యోతిఃప్రకాశమహిమ
నమరు మిముఁ జేతి చూడంగనలవిగాదు, సుప్రసన్నుండవగుము భాసురగుణాఢ్య.

వ. అని విన్నవించినఁ గరుణారసంబు వీక్షణంబుల వెల్లివిరియ నాక్షణంబ.

సీ. మణికిరీటంబును మకరకుండలములు సొగసునామంబుఁ గస్తూరిబొట్టు
శంఖచక్రంబులు చారుకేయూరంబు నెదసిరి యఱచేత బొడలుకెంపు
కౌస్తుభము త్తైపుసరుల్ కౌసుమ్మెఱుంగులశాలు తళుకుల మొలనూలు బలుకటారి
పసిఁడి చిల్లాణంబు నొసపరివగబాగు తీరైన రత్నమంజీరయుగళి

గీ. యుచట నేఁ బొయకుండుదు నెప్పుడనెడు, కరణిఁ జూపెడువలకేలుఁ గటియుగంబు
నందుఁ జేలువొందుడాకేలు నమర వేంక, టాద్రిపతి సుప్రసన్నుఁడగుచు నిలిచె.

వ. అప్పుడు శంఖాగస్త్యప్రముఖు లతివినయంబున స్తుతించి పునఃపునరభివందనం
బు లొనర్చి నిటలతటఘటిత కరపుటులై యుండిరంత నమ్ముకుందుండు. 175

క. హరనర శంఖాగస్త్యా, మరమౌని సితాంతరీపమందిరధిషణా
సురగురు సప్తర్షివసు, స్వరధిపసనకాదులకును వరములొసంగెన్. 176

ఆ. అంత నమ్ముకుందు-నాజ్ఞ నచ్యుతము దే, దీప్యమానమగుచు-దివ్యమైన
ధామ మధికమైన-స్వామి పుష్కరిణికి, దక్షిణమునఁ బొలిచె-నాక్షణమున. 177

శా. ఆ దివ్యంబగు ధామమందుఁ గరుణాయత్తైకచిత్తంబుతో
భూదేవీ కమలా సమేతముగ నంభోజాత గర్భాదికా
క్షాదుల్ చేరి భజింపనింపలరు నాహ్లాదంబుచే నిల్చె న
య్యాది బ్రహ్మము వేంకటాద్రివిభుఁ డత్యానంద లీలారతిన్. 178

వ. మఱియును, 179

సీ. మనుదీశ్వరుఁడు నవ్య-మౌక్తిక చ్ఛత్రంబు, బిరుదు టెక్కెంబు కృ-పీటభవుఁడు
దక్షిణాశాపతి-తగు సాల వట్టంబు, కాళింజిదనుజ లో-కప్రభుండు
జలధీశుఁడ నిలుందు-చామర యుగళంబు, దీపంబు నవని ధా-నాధిభర్త
యడిదమీశానుండు-కడు వేడ్క-తోఁ బూని, తమతమ సేనతో-నమరి కొలువఁ.

గీ. దివిజ సేనాని సూత్రవ-తీప్రియుండు, నిరుగడలు పాయవక బరా-బరులు సేయ
బ్రహ్మరుద్రులు వందిమా-ర్గమునఁ బొగడ, నోలగంబుండె వేంకట శైలవిభుఁడు.

క. కాసునకు వర మొసంగును. దాసుల మనువారిఁ గావఁ దలఁచును దయతో
భాసిల్లు వేంకటేశుని, తో సరియే యూసడింపఁ దులఁ చని వేల్పుల్. 181

సీ. భక్తజనాభీష్ట-ఫలములం జేకూర్పఁ, నమరభూజము వేంక-టాద్రివిభుఁడు
దాసుల దారిద్ర్య-తతులు వీడఁగఁ జేయ, నల నిధానము వేంక-టాద్రివిభుఁడు
హితవృత్తి నార్తుల-తృష్ణ వారింపంగ, నమృతవాహిని వేంక-టాద్రివిభుఁడు
విడువక కాపన్నుల-వెదకి రక్షింపంగఁ, బ్రాణబంధుఁడు వేంక-టాద్రివిభుఁడు
కొంగుబంగారమయి కోరికోలు చువారి, యక్కఱలుదీర్చు తిరువేంకటాద్రివిభుఁడు
కామధేనువుగతి నార్యగణము వాంఛి-తార్థములొసంగు శ్రీవేంకటాద్రి విభుఁడు.

## షష్ఠ్యంతములు.

ఏతాదృశగుణయుక్తున, కాతతవిపులోర్వి గూహనాసక్తునకున్
వీతేహాత్మానంద, ఖ్యాతయమానావనక్రియారక్తునకున్. 183

వితతాంతర్దళితబలా, యతపీడిత తుండిళంబ-రాట శిరోగ్ర్యా
గ్గతరక్తసిక్తమహిమా. న్వితకరచక్రునకుఁ గలిత-విధిశక్రునకున్. 184

అసమశర వేళపయోదా, శనముఖ్యానూత్న శిల్పిజామా
తృసుతామృగనయనాంచితఘన, రసకేళీలోలబంధు-రస్వాంతునకున్. 185

మదనప్రథనావసరాం, చదురుపరిష్వంగజనిత-సంభ్రమలీలా
స్పదహృద్యమేలుమంగా, రదనక్షత శోభితాధ-ర కిసలయునకున్. 186

సారామృతరస దుగ్ధ, శ్రీరాధ స్వామిపుష్క-రిణ్యాఖ్యసర
స్తీరధరిత్రీ వలయావిహారునకు నిత్య నిర్మలాచార్యునకున్. 187

క. సంతత పాప వినాశి, స్వంతర్గంగాప్రముఖమహాతీర్థసమా
కాంత గరుడాద్రి శిఖర, ప్రాంత విహారునకు శోభితాకారునకున్. 188

క. అక్షీణకృపాన్విత శుభ, లక్షణలక్ష్మీవధూటికాలంకార లస
ద్వక్షునకును వికసితప, ద్మాక్షునకును వేంకటాచలాధ్యక్షునకున్. 189

వ. సమర్పణంబుగా నాయొనర్పంబూనిన నలచరిత్రం బను మహాప్రబంధంబునకుం గ
థాప్రారంభం బెట్టిదనిన. 190

సీ. వరనిజశ్రీబాహువలయీభవత్సాలమార్త్తికీభూతశోధుమండలంబు
క్రీడార్థగతఫణిరాడంగనాలోకగంభీరపరిఖావిజృంభమాణ
మభ్రంకషస్వహాశుభ్రగోపురగర్భకలితచర్త్వసవితకంధరంబు
హరిపదవిష్ణుపీతాంబరాయితకిరీటాకారహేతుహేమాంశుకంబు

గీ. మఖభుజానీకశైత్యాయమానవిలస, దతులితోత్తుంగభద్రహర్మ్యాదిహసిత
నిషధనగవర మనఁ దగి నిషధనగర, మనుపమప్రౌఢిఁ జెలువొందు నవనియందు.

చ. అనుపమహర్మ్యశైలశిఖరాగ్రములన్ నృపనూనుపత్త్రికిఁ బ్ర
క్కనఁ గని యచ్చరల్ హరిని గోత్రవిరోధి సురాసురక్షుఁ గా
దని యటఁ జేర వా రచటి యన్నులతో సరిగా రటంచుఁ దై
కొనరిలఁ దాము నామెపయికొన్న నజోల్కనగాడి రొచ్చటన్. 192

చ. అవిరళరత్నహేమకృతకాగ్రుల నేసురిచూచి, రత్నసా
నువోయని చుట్టువాఁటి తపనుండిది చాలుఁ బురే యిదేటి ము
ద్దివిజనగం బిటం దడసితిన్ భ్రమయారె! యటంచుఁ బాఱుఁ ద
ద్దినములు కావె వేసవుల దీర్ఘములై కనుపట్టు నెల్లెడన్. 193

క. కనకపుగోపురములపైఁ, గనుపట్టున్ రత్నపుత్రికలు దత్పురి, త
క్కొన నగరములు తనసరిరా, వని బొమ్మలఁబెట్టె నిక్క మని కాఁయాదన్. 194

మ. ధవులుత్సాహముమీఱ బాలికల నూత్నక్రీడఁ గూడన్ మహో
త్సవుఁడుఃన్ బ్రౌఢ్వన నార్వ నీవు తెడలింపన్ సిగ్గుమై నచ్చెలుల్
దివియల్ పెద్దవి సేయఁ దోడనె పునగ్గిపాలిఁ గల్పించు మా
స్త్రవిగాఢాప్రతిమానరత్నచయనిర్యన్నవ్యకాంతిచ్ఛటల్. 195

క. కపటీగరా ధనపతి, నా, రపుసంపదఁ దన్నుమించెరా యని పురినై
ర్యపటలిఁ గనుఁగొని యోర్వక, యొప్పుదుం దనయలక విడువఁ డేమని చెప్పన్-

చ. పిడుగులలీల నైరితతి బిట్టుగలంచి కలంచి పేర్తు రె
య్యెడ నిజధర్మవర్తనల నేమరకుండుదు రర్థిసత్త్వముల్
విడువక స్వామికార్యహితవృత్తి వహించి తనర్తు రాత్మలో
నుడుగని దానశీలరతి నొప్పుదు రప్పురిలో జఘన్యజుల్. 204

వ. మఱియు నన్నగరంబునఁ గరంబు వెలయు మలయ పరిసరంబుల నెఱమెఱుపులకాఁ దిరపు మెఱుపుఁ గఱపు నొరపు మైతళుకులమించు, క్రొమ్మించుబోఁడుల గుబ్బలికవంబోని నిబ్బరపు గబ్బిగుబ్బల పయిం జొబ్బిల్లు వెల్లు మృగమదంపు టసుఁబునబడి మసలి విసువని పసల నెసంగు పవనంబులకు భవనంబులకు నుపవనంబులగల యెలమావి పల్లవంబులు పల్లవంబులుగా; పిటంగల తేఁటిమిటారి యాటకత్తెయల పాటలం గరంగి ప్రవహించుతూజాలు కాలువలఁ దుఁ పొందుదరిసి నొరపానులు వేఁడుకలకు మేడల పంచలం బెంచిన మించుదగువులు పరువున విసలు వొరలెత్తి బుదబుదఁ గురియు బెడిదంపుఁ దేనియజడి వడిఁ బుడమిఁ జాఱి యేఱులై మెండుకొననిండు నిండుచెఱువుల పొగవులదండిగా ముక్తాగురులం బండు స్తంబకి గర్భకాండస్వభావంబులు జంఘాప్రభావంబుగా, అఖండంబులై కొండకోనలయేఱులంబోలి గండభాగంబుల మెండుకొనగురియు మదకాండప్రకాండంబులలో నిజరాజదర్శనావసరంబుఁ గోరి చేరిన నరవరులసందడిఁ బుడమి గ్రక్కదలల మిక్కిలి ద్రొక్కులాడు వేళ చిరత్నరత్న భూషణజాలంబు లొఱసి రాలిన కాంచనరజంబున సొంపియైన జంబేటి జంబాలంబు దంబు సంపాదించుచుఁ బెంపుమీఱిన ప్రచారంబుల హజారంబుల నెలంగు భద్రశుండాలంబుల శుండాదండంబు లూరుకాండంబులుగా, మింటనంటిన కుంటిగొంటరి దంటలైన దంటయరదంబు సరథంబుఁ జేసి దంటతనంబున వింటగొంటని బంటుతనంబునం జెందు సంక్రందనస్యందనంబునకు విమానత్వంబుఁ గల్పించి, యనల్పశిల్పకారకల్పితంబులై వీథుల మెలంగు కనత్కనక రథచక్ర చక్రంబు జఘనచక్రంబుగాఁ, శృంగాటకంబులకు శృంగారంబుగా సమర్చి మెచ్చులు గుల్కు పచ్చఱాకవాటంబుల వాటంబులు వీటకొల్పు మానికంపు గద్దెవాట్లులకు సాటులు లేకుండఁ బస లా

సొంపు నీలంపుదారబందంబుల నందంబులైన మొగసాలవాకిళ్ళఁ గనుపట్టు గట్టివా
పొంకమ్ముల బింకమ్ములు మెఱసి హరికరికి దరముగ గ్భ్రించు కల్పిత రజతసింహబలక
బు మధ్యస్థలంబుగా; అమృతంబుఁ గేరు నమృతంబుల విమలకమలంబులఁ గలువల
చెలువుల హంస ప్రముఖ కవివతంసములచేఁ జెలువలరు కేళిసరోవరంబుల సౌరు
సొక్కులతీరుగా; నందుఁ జెలువొందు కుందనపుఁ జెందమ్ములు ప్రశస్తహస్తారవిం
దమ్ములుగా; మిసమిసని జిగుఁగు దంతపుఁ బనుల బొంగరి గోసబుదేరి నెల సెనసిన
సొను వజ్రంపుఁ జవులు చవులు గొలుపు వెన్నెలపొలుపు తెలుపుచ్ఛాయయొప్పుగు
ప్పుగొప్పకప్పుటాల కప్పుకుప్పురాలు గొమసెడ నెడనెడఁ గడుబెడ గడరు పైడూ
ర్యంపుటాలు రంగులెసఁగ గంగాయమునా సరస్వతీ సంగమంబు పెంపు దీపింప
నిలింపమునిదంపతులు సంపులుగొని డాసిడాసిన యనంత స్రవంతి పైఁదన్ని తాం
త కాంతిప్రవాహంబు ప్రసరించుటం జేసి మిథ్యాత్రివేణి యనఁ దనరక యచ్చటం
గుప్రింక, సంతసిల్లం జేయు మణులచే నున్నతంబులైన సౌధంబుల ముదలంగాల బం
గరుకుండలు గుబ్బ చనుగొండలుగా, నిగనిగని పసలందగి, ధగధగాయమానంబు
లై, జగత్ప్రస్తుతిం బరఁగియౌన్నత్యంబుల కాధ్యంబులైన కుడ్యంబుల దాఁపిన
ప్రాచీ నోపలంబులం బ్రతిబింబితంబులైన యంబుజారాతి మండలంబు వదనమం
డలంబుగా, తళతళను తళుకుబెళుకుటపరంజి శలాకలం గలకలాగు నలరులమ్ము
చెలువల చెలువలరు పదనదన కరచరణంబుల నంబురుహకుంద కుట్మలపల్లవంబు
లను శంకఝంకారంబులం బొదలికదియు కొదముతుమ్మెదకదుపులం గనిక్రొమ్మిం
చు లన్నించు నబ్బురపు పుబ్బుల నిబ్బరంబని యుబ్బుచు నిత్యంబు నృత్యంబు సే
యు పోషితబర్హిబర్హంబుల యొప్పువిప్పుఁ గొప్పగా, ననవరత ఘుమఘుమాయమాన
విలిప్తమార్గంబులగు రాజమార్గంబులం జరించు భూపకుమారవర్గంబు చూపులకుమి
ఱుమిట్లుఁ గొలుపురుచుల నేపుమీఱి విటులయెడఁ జటులటలు ఘటియింపం జే
యు నటనలం గలవారకుటిలాలకలవిలస దలసగమనాభ్యసన వ్యసనంబులనుగ
మించు పెంపుకురాయంచల యానంబు యానంబుగా, నలుమొగంబుల వేలుపు
లం దగఁ బంజరాలు జగతీసురుల తొలుపలుకులు పలుకుతఁజేఁగపుఁ నదీర్చు పెంపుడు
రా చిలుకల కులుకుపలుకులు పలుకులుగా, (జెలువలరి ప్రద్యుమ్న జనక మనో
హరతం డనరి, సారస భోజన వైఖరిం గరంబుమీఱి, దుగ్ధాధిపస్త్రాయ మానస్ఫీతిన్గను
పట్టి, సర్వమంగళాశ్రయ మహిమం జెలంగి, సుమనస్సముత్కరా వనగరిమం బ్ర

సిద్ధివహించి, సమస్తశుభరేఖా పదవిలాసంబున వన్నెకెక్కి, ప్రత్యర్థి ప్రతాపహ
రణ బలసంగతి నున్నతిఁ గాంచి, నిరంతర క్షమాభరణప్రసక్తి నెపుమిగిలి, సకల
సంపదలకుం దానతానకంబై యొప్పునప్పుర శ్రీకాంతకు శ్రీకాంతుండుం బోని భూ
కాంతుండు.

సీ. సర్వసర్వంసహా నిర్వాహకాఖర్వ దుర్వారతరబాహు గర్వశాలి
కూటారినృపసైన్య కోటీభిదాత్యుగ్ర ధాటీనిరాఘాట పాటవుండు
పాటీరభవదివ్య కోటీయశశ్చంద్ర పేటీభవదజాండ కోటరుండు
సౌందర్యలీలావి నిందితార్ధపసూను కందర్పపురుహూత నందనుండు
గీ. రాజమాత్రుండె సకలదిగ్రాజరాజ, రాజదుత్తుంగ మకుటవిభ్రాజమాన
జలజరాగచ్ఛవి చ్ఛన్న చరణయుగుఁడు, వీరసేనుండు నిషధపృథ్వీవరుండు 206

ఉ. ధారుణివీరసేనవసు ధావరువాలటు వాలవీరులా
సారస మిత్రుదూరితన సన్నిధిఁజేరిన వారికెల్ల జం
భారియెడ స్సురద్రుకుసుమావలి యేయుడివోయె నన్నచో
నారగణింపఁగా దరమె యాఘనుఁడోర్చిన శత్రుసంఘముల్. 207

ఉ. వేడుక వీరసేనుపృథివీవరుకీర్తి వధూలలామ యీ
రేడుజగంబు లున్నదికి నింపులొసంగను బొమ్మరిండ్లుగాఁ
దోషనజాండ భాండములు దొంతులుగానడి బాలపాత్రియుమం
దాడునటన్నఁ జోత్రిదయగునత్తతి కచ్చెలి యెంత సేయునో. 208

చ. అనితరదాన శూరుఁడగు నజ్జనపాలుని యీవిచూచియా
యనఁగొఁగిఁబంచ, భూమిధనమంతయు నాటమి నెట్టి వేళఁబై
కొనివ్వయపెట్టునోయనుచుఁ గూరినభీతిని వేల్పులీశుఁడు
న్పనివడి గాచియుండుదురు బంగరుకొండయు వెండికొండయున్. 209

సీ. తనచేయు సంతతోద్వరమహా మహిమ సుపర్వుల కాఁకటిపంటగాఁగ
తన పరాక్రమసముత్కరరూఢి యప్సరఃస్త్రీలకుఁ గళ్యాణసిద్ధిగాఁగ
తన నిత్యవైభవాత్యనుపమానప్రౌఢి పాకవైరికి మేలుబంతిగాఁగ
తన కీర్తిముక్తావితతి దిగంగనలకు సీమంతభూషణశ్రేణి గాఁగ
గీ. తనదు దుర్వారసముదారదానవారి, యర్థిజనదైన్యపంకాపహంబుగాఁగ
సోమవంశాబ్ధినీహారధాముఁ డతఁడు, లీలమై సర్వసామ్రాజ్య మేలుచుండె 210

శా. దుర్వారస్వరినప్రమోదహరణోద్యోగాంచదుద్దండదో
ర్గర్వారంభవిజృంభమాణవిజయోత్కర్షాకరస్ఫూర్జద్వ
త్సూర్వాశ్వామర్త్యకఠోరమస్తకవరక్షోణీధ్రశంబాయితా
ఖర్వప్రాభవకంజభూప్రముఖలేఖక్షేమకృద్వైభవా. 211

క. అమరాతిక్రమణాసమ, సమరాగ్రహమధువిదారి సంతతగర్వ
క్రమధారిప్రమదారి, ప్రమదాపహరణ మహాపరాక్రమధారీ. 212

భుజంగప్రయాతము.

అమర్త్యావనప్రౌఢవాంఛద్విలోకా, సముల్లాసవత్ఖాటసంప్రాప్తతాకా
యమిత్రప్రమోదార్ణవోర్వప్రతీకా, రమావ్యాత్సరస్సంచరస్నానసౌకా.

## గద్యము.

ఇది శ్రీమదాచ్చివరద గురుచరణ స్మరణాభ్యసన రసనా వికాస తిరుమలగిరి
వేంకటేశ్వర వరప్రసాదలబ్ధ కవితావిలాస హారితసగోత్ర సిరిప్రెగడతిప్ప
నమనీషిపుత్ర సుజనవిధేయ, ధర్మవనామధేయ ప్రణీతంబయిన
నలచరిత్రంబునందుఁ బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# నలచరిత్రము.

## [ద్వితీయాశ్వాసము.]



శ్రీ వల్లభ సర్వజగ
త్పావన మాఘదనుజదర్పదమన ఖచరలో
కావన వేంకటనామ
గ్రావాగ్రమహీనివాస కలితోదారా.

వ. అవధరింపుము. 2

ఉ. అమ్మహనీయకీర్తిధనుఁ డాత్మజహీనతఁ జింతవంత భా
వమ్మునఁ గ్రమ్మఁ గాంక్షవిభవమ్ములపై నవయమ్ము లేక వై
పమ్మును దూఱుచు న్నిజభవమ్ము భవమ్ములకీయు పుత్త్రర
త్నమ్ములు లేమి హా! విధికృతమ్ము నెపమ్మిటు లేలచేసెనో. 3

క. బంగారు తొట్టెలోపల, నుంగేయుంగేయటంచు నూగఁ జెలువగు పు
త్త్రాంగారఁ గరములాడిం, తంగా సుతుఁ జూడలేని బ్రతుకు బ్రతుకే. 4

చ. గొనబు మెఱుంగు మానికపుఁ గుండలముల్ గదలంగ, గల్లుగ
ల్లనఁ జిఱుగజ్జెలందియలు నందము గాఁ బలికో సుతీరుగా
గునగునఁ బాఱుతేఱఁగని కోరిక లీరిక లెత్తఁ బుత్త్రినో
య్యన ననుఁ జెక్కుముద్దుగొన నబ్బునొకో నను బోటివానికిన్. 5

గీ. ఇలను బుత్త్రులు లేని వానిల్లు పొల్లు, పట్టి నెత్తని మానవు బ్రదుకు కొఱుకు
మానఁ గాంచని మర్త్యుని మేను మ్రాను, సంతు గలుఁగని మనుజుని సౌరు నీఱు. 6

క. సంతానము తనపాలిటి, సంతానంబగుట నిజము చర్చింపంగా
సంతతి లేకుండిన భవ, సంతతి నేరీతి గడపఁ జను నెవ్వరికిన్. 7

వ. అని నిరంతర సంతాన చింతాభరాక్రాంతుండై కొంత యాలంతం జెంది భూకాంతుండు గులకాంతయుం దానును నేకాంతంబున నొక్కింత గనుగూర్కునవసరంబున. 8

సీ. అరులఁ గెల్చిన తెంపు ధరణి దాల్చిన సొంపు కరటిఁ గూల్చిన పెంపుఁ గలుగువాఁడు
చదల నించిన కాలు నెదవసించిన యాలు గదవహించిన కేలుఁ గలుఁగువాఁడు
చిలువదొరిక్కుడు పేరుపులుఁగు నెక్కుడు తీరువలువ వ్రెముక్కుడు సొయగలుగువాఁడు
పాలు మెక్కుడు ద్రేన్పు పూల నెక్కుడు కాన్పు గాలిబొక్కుడు పాన్పు గలుగువాఁడు
గీ. మించు లీనెడు పటము చేమించువాఁడు, మేలు దళుకొత్తు బ్రహ్మాండ మేలువాఁడు
ఛాయబలు కెంపుగల మొవచాయవాఁడు, చూపుల దయారసస్ఫూర్తిఁ జూపువాఁడు
వ. అట్టి భక్తసంత్రాణ పరాయణుండగు నాదినారాయణుండు. 10
సీ. కలుకుముత్తియపుఁ జొకట్టులో వనిచిన తులసిరెమ్మలచెమ్మ తొంగలింప
నొయ్యారముగ దిద్దు నూర్ధ్వపుండ్రము లోనఁ దిరుమణ్ణ మంతంత సిరులు గుల్క
తళుకు వెన్నెలతోలు కుల్క తెలిజన్నిదములపైఁ దీర్ఘ నవనమాల పేరు లమరి
పదియారువన్నియ బంగారుజలపోఁత మేలుకుళ్ళాయి క్రొమ్మెఱుఁగు లీన
గీ. నపుడు శ్రీవైష్ణవాకార మవధరించి, జాళువాకట్లబెత్తముఁ గేలఁ బూని
వెంటఁ గొందఱు ప్రియశిష్యు లంటి కొలువ, మానవాధీశు కలలోనఁ గానిపించె.
క. కట్టెదుర నిల్చి తనచేఁ, బట్టిన బెత్తమున నొకటి పడిమారిదయం
బట్టు మనియతఁడు దనచేఁ, బట్టునఁ జెలువారుదవ్వ ఫలమొకఁ డిచ్చెన్. 12
వ అంత. 13
క. కలఁగని మేల్కని యెన్నఁడు, గలుఁగని మేల్గంటి నిటులఁ గనఁగల్గె నయా
కలఁగనిన వారికిని నని, కలగని సంతోషరసపుఁ గడలిం దేలెన్. 14
వ. ఇట్లు మహీకాంతుండు సంతోషరస స్వాంతంబునం దేలి నిజకాంతను మేల్కొలిపినఁ దత్తరపడు చిత్తంబున సమ్మతి కాశిని నిలిచినం గనుంగొని యిట్లనియె. 15
ఉ. ఓకలకంఠకంఠి కలనొక్క మహాత్ముఁడు వచ్చి వైష్ణవా
నీకముతోడ నిల్చి కడు నెయ్యమి బెత్తునఁ గొట్టి నన్ గృపా
స్తోకవిలోకనంబులను జూచి ఫలం బొకఁ డిచ్చె నిచ్చిన
న్నాకపు డైన సంతసము నాకపుడైన నెఱుంగఁ డెన్నఁడున్. 16
వ. అంత. 17
క. గ్రక్కున మేల్కని యటనలు, దిక్కులు పరికింప శౌరదృక్చరులగుచుం
దక్కినఁ దక్కిన యొనవిషె. యక్కలవిన లేపిసాఁడ నక్కజనిన్నున్. 18

వ. అనిన నయ్యిందువదన యమందానంద కందళిత హృదయారవిందయగుచు నగుచు
మగనిం గని యిక్కలకల తెఱంగెఱింగించెద వినుమని యిట్లనియె. 19

గీ. వైష్ణవాగ్రణి ప్రత్యక్ష విష్ణుమూర్తి, వైనతేయాదులతనితో వచ్చువారు
గొట్టుటరయం జింతలెల్లం బోంగొట్టుటరయ, ఫలమె సంగుట సంతానఫలము సుమ్ము

క. సంతానహీనతకు మతిం, జింతాకులవెందు మనలం జేపట్టి రమా
కాంతుండు దాంతుండు కరుణా, స్వాంతుండు నీస్వప్నమునం బ్రసన్నుండయ్యెన్

చ. హరిపదసేవ సేయుదు ననంతగుణాకరు సన్నుతింపుచున్
సరసిజనాభుం గొల్చు మను జక్రి కథాస్తుతు లాలకింపుమిన్
నిరతము కాలముం గడుపు నీకు నభీష్టఫలంబులెల్లం జే
కుఱు టిది యబ్రమే విమలగోత్రసురేశ్వర! జీవితేశ్వరా. 2

వ. అని మఱియు నిట్లనియె. 2

సీ. ఆశ్రితావళికి నిష్టార్థముల్ ఫలియించు విబుధభూజము తీవ విష్ణుసేవ
ఆపత్పరంపర లనుచీకటులు వాప వినుమానికము తేవ విష్ణుసేవ
అజ్ఞానరోగచయంబుల నణంగింప విలసదౌషధ సేవ విష్ణుసేవ
నిరత ధర్మక్షుధాతురులైనవారికి వేలుపుగమి జావ విష్ణుసేవ

గీ. అసమ సౌశీల్య సత్క్రియాసమేత, భక్తసముదయ సముగతయ ఫలవిశేష
పరమవైకుంఠపర నామ తరులలామ, వితతిలోపలం గలచేవ విష్ణుసేవ. 2

వ. కావున విష్ణుసేవాపరతంత్రులగు వారలకు నభీష్టార్థ సిద్ధియగు మఱియును. 2

సీ. సర్వజ్ఞనర సర్వగీర్వాణసరసప్రవర్తనమ్ములు విష్ణుకీర్తనములు
దురితసంచయతమోహరణకృత్యాంచద్వికర్తనమ్ములు విష్ణుకీర్తనములు
చిరతరోదారనిశ్రేయసలాస్యకీర్తనమ్ములు విష్ణుకీర్తనములు
కష్టసంసార సంకలిత సంతాపనికర్తనమ్ములు విష్ణుకీర్తనములు

గీ. కామ మదలోభ మత్సరాగ్రహవిమోహ, పటలసంజాత దుర్నయ పరిహరాచ్ఛ
నిత్యసుజ్ఞాన సద్భక్తి నిబిడభయని, వర్తనమ్ములవో విష్ణుకీర్తనములు. 2

గీ. అట్టి హరికీర్తనములు నీకాటపాట, లిందిరాప్రాణవిభుండు నీకిష్టదైవ
మతని దాసవ్రజంబు నీయాత్మబలము, లిట్టి నీకోర్కి చేకూఱకేలయుండు. 2

క. అనితరలనయన పలికిన, ననితర వాంఛన్మహీశుండ కాంతయు దా
ననవరతము నవరతమతి, ననవరతము లీలందగిలి యట్లున్నంతన్. 2

క. కలగనినది మొదలుగ నృప, కులకామిని కందిపుచ్చు కొన్నటువలె ని
ష్ఠూలఁ జెట్టు కాయఁ దుంచిన, చెలువున నెలమసలి చీరచిక్కెఁ బారిక్రపకన్. 29

చ. అలసత దోఁచెఁ బోరుచుల కాసలొకిం మిక డాసె నోకలిం
తలు దఱుచయ్యెఁ జిట్టుములు దట్టములై కనుపట్టె మద్దుఁ జె
క్కులు వెలవెల్లఁ బాఱెఁ గనుఁగూర్కులఁ బైకొనె గుబ్బచన్మొనల్
నలుపు వహించె భూవరుని నాతికి గర్భకళాతిహేతికిన్. 30

మ. గమకంబై చెలువొప్పెఁ గాను జిఱుప్రక్కల్ మించులన్ మించు దే
హము నీర్వట్టె వళిత్రయంబును సదృశ్యంబయ్యె నొయ్యం గుచా
గ్రములం జీకు జనించె నాభి సమమై కన్పట్టె విప్పారి, వ
క్త్రము వంగమ్మని మంటితావి వొదలెన్ రాజీవపత్రాక్షికిన్. 31

వ. అంత. 32

క. లలితాశ్రిత సంరక్షక, జలజాక్షకృపాకటాక్ష సంపన్మహిమన్
నెలలుం దొమ్మిది నిండిన, లలనకు జనియించె సుతుఁడు లక్షణయుతుఁడై. 33

వ. అప్పుడు. 34

గీ. తనయుఁ డుదయించినాఁడహో ధరణినాథ, పాలకడలింటి వేల్పునీ పాలఁ గలిగె
మహిత సౌభాగ్యములపంట మాకుఁ బండె, నను మునుముచు ముదంబుతో నబ్జముఖులు

గీ. జనకు జన్నిదము డిగిపాపనికిఁ గట్టి, కోరి వయగునట్టి చెలియోర్తు బొడ్డుగోయఁ
ద్రోనను లివెచ్చ కలినీట మేను గడిగి, యువిదలొనరించిరా యా యుచితములు.

క. మంగళగతిఁ దానము సృప, పుంగవుఁడు పుణ్యాచరించి పుత్రోత్సవమా
త్మం గాంచుక ముప్పతిలన్, బంగారు వసంత మాడె బ్రాహ్మణతతికిన్. 37

వ. అప్పుడు. 38

శా. ఆకల్పంబగు వాయువున్నతిని వంశాకల్పమై కీర్తిచే
లోకాలోక ధరప్రశస్తిత ధరాలోకంబు దావీఁకమై
నేక చ్ఛత్రము గాఁగ నేలు ఘనుఁడై యిబ్బాలుఁ డంచున్ సము
త్సేక ప్రక్రియ జాతకంబరసి యర్థింబల్కి రార్యోత్తముల్. 39

వ. మఱియును. 40

క. బాలెంతరాలి కొనరిచి, రాలోలవిశాలనయన లత్తఱిమున్నం
టాల వెసనానబాలం, నూలంజాలుగ్గ జగద్వినుతమను లీలన్. 41

క. పురుడాచరించి రతనికిఁ, బురుడా మరుఁ డైననముఁ బొగడిరి మినులన్
ధరణీభృద్వరకుచలా, ధరణీభృద్వరతనూజుఁ దరుణీసమాజున్. 42

క. సంతసమును మితిదివసా, నంతరమునఁ బుత్త్రికునకు నయ్యఖిలధరా
కాంతుఁడు కాంతాజననవ, కంతుఁడు నలుఁడనుచు నామకరణముఁ జేసెన్.

శా. లీల న్నీలపురాల మేడకడ లాలింగేలి మైమంచి జో
జో లక్ష్మీశ కటాక్షవీక్షణయుతా జోజో శుభాకార జో
జో లావణ్యరమాకుమార యనుచుం జోకొట్టుచుం బాడిర
న్నాళీకేక్షణ లానృపాలసుతు వీణాకోకిలాలాపలై. 44

వ. అంతఁ గ్రమక్రమంబున. 45

గీ. అర్భకుఁ డుబ్బిలఁ దొంగితొంగాడు వేళఁ, గరకమలపాదపంకజ క్రమముఁ జూడ
ధర్మమీరీతి నాల్గుపాదములనడుము, నింకఁ ని మాపటుకు నెల్ల నేర్పరించె. 46

క. చిటిపొటి నటనల బట్టువై, యటునిటు వడుగులిడు భూవరార్భకమణి మున్
చిటిపొటి నటనల బట్టువై, యటునిటు వడుగులిడు వామనాకృతివోలెన్. 47

ఉ. గొప్పమెఱుంగు ముత్తెములు గూర్చిన నిద్దపురావిరేకతోఁ
గప్పఁజిగుర్చు నీలములకంటియుతోఁ జనుదేరఁ దల్లి మా
యప్పలవిందులంమఁ బ్రియమారఁగ నక్కునఁజేర్చఁజేర్పఁగా
నప్పసిబిడ్డఁ డందఱకు నప్పుడొనర్చు నేత్రపర్వముల్. 48

వ. ఇట్లు నెలబాలుండునుంబోని యబ్బాలుండును దినదినప్రవర్ధమానుండగుచున్నంత.

క. విపులానందకరంబుగ, విపులాపతిపుత్త్రికునకు విహితాబ్దములం
దుపనయనం బొనరించె మన, కుపనయనం బిడఁదని సముత్సాహమునన్. 50

వ. మఱియును. 51

గీ. అసమనిగమాదివిద్యల కాఢ్యుఁ డయ్యె, శౌరివరపుత్త్రికుఁడు గాన ధీరుఁడాతఁ
డసమనిగమాదివిద్యల కాఢ్యుఁడౌట, శౌరివరపుత్త్రునకు సహజంబ కాదె. 52

వ. అంత. 53

ఉ. ఆయువనీశమౌళి తనయాగ్రణికిం గనుపట్టె యౌవనం
బాయము సుందరీనికరభవ్యవిలోకనమీనసంచయా
వాయము సర్వభూతల జనప్రియగేయము శైశవక్రియా
పాయము వైరిదారనిటలాయత కుంకుమపంకతోయమై. 54

సీ. తళుకుసెత్తమ్మిపై యెలదేఁటిచాలు నా ముద్దుమోమున మీసములు జనించె
పటుజయశ్రీకాంత పవళించుబలిమి నా విప్పైన పెనుఱొమ్ము వింతమీఱె
ధరణిఁ బూనెడు హరిద్దంతి తుండములు నా నాజానుబాహువు లతిశయిల్లె
పున్నమనెలఁ బొల్చు వెన్నెలనిగ్గు నా మొగమునఁ జెలువు మొలకలెత్తెఁ
గీ. జిత్తజునియంపమొనలపై చిగురు లనఁగఁ, గలికికన్నుల నెత్తురుజీరలు వసించె
మారనిభుఁడైన రాజకుమారునకును, యౌవనారంభ సంభూతమగుటఁ జేసి. 55

వ. అంత నతిసుకుమారుండును, అపూర్వ లావణ్యబంధుర సింధురాట్కుమారీకుమారుండును, బటుశౌర్యవినిర్జితకుమారుండును నగు కుమారుం గాంచి మించిన హర్షోత్కర్ష పయఃపారావారంబు వెల్లిగొన జనవరుండు తన మనంబున. 56

శా. దుర్వార ప్రతిమాన వైరివరులన్ దోర్లీలమైఁ దోలితిన్
సర్వోర్వీవలయంబు నేకధవళచ్ఛత్రంబుగా నేలితిన్
గీర్వాణాధిప భోగభాగ్యమహిమం గేళీగతిం దేలితిన్
సర్వజ్ఞప్రియుఁడైన శౌరి కృప నైశ్వర్యంబునన్ బ్రాలితిన్. 57

వ. అదియునుంగాక. 58

గీ. అంగజాజనసుమనోహరాంగరంగ, మధ్యమునసాముఁ జేయించు మరుఁడు మెచ్చ
నట్టి జగజట్టి యౌవనం బకట యిపుడు, పైనపై చేతబొంగరముఁ బట్టినదియు. 59

సీ. వక్త్రపురద్వార వజ్రకల్పదంత ఘోరకవాటముల్ గూలఁదన్ని
కౌటిల్య తరనీల కంఠకంఠసమాన వరరోమబలముల వన్నె చెరచి
సర్వాంగకస్ఫురత్సత్వసంపదలను కుపితలీలలఁ గొట్టి కొల్లలాడి
బహుళస్వయంకృతాపభ్రంశవాక్యూహ్య రవములఁ బైకొల్పి చెవుడువరచి
గీ. సుమతియను దొంటి మంత్రిని స్రుక్కఁజేసి, యౌవనంబను పగతుని నతిమిహేళి
హేళియనిమేని పొరలుదా నేలఁ గోరి, వచ్చెజర, రాజవృత్తిపుం వ్యక్తిఁ బూని. 60

క. పెంజెఱువు లెదుగు పెంజర, కుంజిక్కిన నేర్పులేక కొదుకుగుఁ బిదపన్
గుంజర కులాధిపతి వర, దుం జనకుం జిక్కకేను దాశరి భజింతున్. 61

సీ. చింతిత స్వాంతార్థసిద్ధి గావించంగఁ జింతామణులువిష్ణు చింతనములు
చతురమోక్షాంగ నాసమితిఁ బైకొనఁ జేయఁ గంతుదూతలువిష్ణు చింతనములు
క్రోధాదిరిపులను గుదులుగా గ్రుచ్చంగఁ గుంతహస్తులువిష్ణు చింతనములు
మతిరథార్వఘులను మంచితోవలద్రోల యంతులుమహి విష్ణు చింతనములు.

గీ. బుధజనావళి వాంఛితమ్ములు ఫలింపఁ, జెంతకల్పకములు విష్ణు చింతనములు
ఘనులు సుజ్ఞాన ధనముఁ జేకొనఁగఁ జేయు, నుంఛనమ్ములు శ్రీవిష్ణు చింతనములు 62

క. కావున హరిపద చింతనఁ, గావించెద నన్నుఁ బ్రేమ గవయుట కొఱకై
రావించెద మోహన నవ, లావణ్యత రాపగ్గ లలనామణులన్. 63

వ. అని తలంచి తన తనయుం జేరంజీరి శిరంబు మూర్కొని చెక్కిలి ముద్దిడి తొగల
చెలివగు నగుమొగంబు మొగంబునఁ గదియించి చుబుకంబుఁ బుణుకు నతని ను
ద్దేశించి యిట్లనియె. 64

మ. అరివర్గంబుల నొంచితిన్ ధరణి నాద్యంతంబుఁ బాలించితిన్
హరి కారుణ్యముచే నినుంగని సుపుత్త్రావాప్తి మించితిన్
వరభోగంబుల నిందుఁ గుంచితి మహైశ్వర్యస్థితిం గాంచితిం
బరితృప్తిం గడుఁ బొందినాఁడ నిఁక మద్భావంబునం బుత్త్రికా. 65

క. ధరఁబుట్టినవాడిగ విమ, తరమై ప్రాయంబుచే వృథాచనె దినముల్
జరవొందునప్పుడైనను, బరికింపఁగ బుషమపంటపాకమువలదే 66

సీ. అరివర్గములఁ ద్రుంప నభిలషించుటమాని యరివర్గములఁ ద్రెంప నభిలషింతు
హరిధర్షణవ్యాప్తి కాసఁ జేయుటమాని హరివర్యరవ్యాప్తి కాసఁగూర్తు
సంతానమందుల స్వాంతంబుడిగి శుద్ధి సంతానమందుల స్వాంతమిడుదు
భామినీమణులపైఁ బ్రేమంబుడిగి ముక్తిభామినీమణులపైఁ బ్రేమనింతుఁ
గీ. గాన ధరణిభరంబేను మాని నీదు, కైవసమొనర్తు సైంధవగంధనాగ
బంధురసమస్తసంపత్ప్రభావమైన, భూరి సామ్రాజ్యభారంబుఁ బూను మీవు.

వ. అనిన జనకునింగని సాష్టాంగదండప్రణామం బాచరించి లేచి కేల్మోగిచి సమ్ముఖా
వంబుగా నిలిచి నలుండిట్లనియె 68

చ. నయగుణశీలురైన సుజనస్తవనీయులు మీరలెప్పుడున్
దయవలిరొత్త భూధరముఁ దాల్చి ప్రజావళిఁ బ్రోచి కీర్తిన
క్షయగతి నిల్ప మీపదయుగంబుల దాఁపున నాకుచాటుపిం
దియవలె నుంశునేను ధరణీతలభారముఁ బూననేర్తునే. 69

క. గురుశక్తి మీరుపూనెదు, ధరణీభారంబు నాకుఁ దరమె వహింపన్
హరి కుక్షిఁ దాల్చు భువనము, నరుఁడు భరింపంగఁగలఁడె నయసంపన్నా. 70

వ. అని పలికినఁ గ్రమ్మఱ నమ్మనుజేంద్రుండు బహువిధంబుల బోధించిన నయ్యకొనక ప్రతివచనంబులు పలికిన విని వెండియు వీరసేనుండిట్లనియె, 71

క. పితృసేవోద్భవయనఁగా, మతి నెవ్వఁడుఁ గనవె నాకుమారా డెందా యో
సుత! నీకిట్టిది ధర్మమె, చతురత నీ వెఱుఁగనట్టి శాస్త్రము గలదే. 72

క. తలిదండ్రు లిష్టఫలదులు, తలిదండ్రులు దైవతములు తనుఁదలి దండ్రుల్
నిలుపం బనిగొనఁగర్తలు, దలిదండ్రుల మాటఁద్రోయఁ దగదు కుమారా. 73

ఆ. తండ్రిచెప్పినట్లు తాఁజేయకుండెనా, కొడుకుగాఁడు పనసకొడుకుగాని
తండ్రిచెప్పినట్లు తాఁజేయుచుండెనా, కొడుకుగాఁడు పసిఁడికుడుకగాని, 74

గీ. తనయ! నాబుద్ధిమదిలోనఁ దలఁపవయ్య, పరిహాసోక్తులఁ బలుమాఱు పలుకకయ్య
భూరిసామ్రాజ్యభారంబుఁ బూనవయ్య, పూనననుమంకు బుద్ధులు మానవయ్య. 75

వ. అని బహువిధంబుల నన్నిసుంగువిసుఁగనాడుచుఁ గుమారా! నాకుమారాడితేని నీకువాయాన, నాయనా! నాయానతికి నతికి, కదలి చుట్టుఁగట్టుగట్టిమోపు మూఁపునఁజేపట్టు మనిబిగంబట్టినంబట్టి యొట్టకేలకునొడంబడి సంభ్రమాయత్తచిత్తంబున హితపురోహితామాత్యవర్గంబులకుం దద్వృత్తాంతంబంతయు నెఱింగించి పురంబుఁ గైసేయించిన. 76

మ. జిలుఁగుంబంగరు పూలపట్టుతెరలుం జెంగావిమేల్కట్టుతె
ల్పులబెళ్కుల పతాకలున్ మెఱుఁగుజల్లుల్ కమ్మకస్తూరి పూఁ
తలు, ముత్తెమ్ములరంగవల్లికల వింతల్పచ్చతోరణం
బులుఁగన్పట్టఁ బురంబు నెల్లెడల నేర్పుల్ మీఱఁ గైసేసినన్. 77

వ. అంతబంధుమిత్రామాత్య ప్రమోదంబుగా ననివార్యతూర్య నాదంబులును, మంగళపాఠక గానంబును, భూసురాశీర్వచో ఘోషంబును నృత్యన్నర్తకీ చరణకంజ మంజుమంజీరశింజితంబును, నేకంబై బ్రహ్మాండభాండంబుఁ గలయనిండ నఖండవిభవంబునఁ గార్తాంతిక ప్రచోదిత శుభలగ్నంబునందు యథోచిత ప్రకారంబున నక్కుమారు రాజ్యాభిషిక్తుం గావించి వృద్ధక్షితీశ్వరుండు హరిపదధ్యాననిష్ఠాగరిష్ఠుండై సుఖంబుండె. నలమహీకాంతుండు పూజ్యంబగు సామ్రాజ్యంబు నిజభుజవశీకరణంబుఁ గావించె. నయ్యవసరంబున సురలు పుష్పవృష్టిం గురియించిరి. గంధర్వగానంబులు సెలంగె. రంభోర్వశ్యాద్యప్సరోగణంబు లాడిరి. సిద్ధవిద్యాధరకిన్నర కింపురుషవరు లానందంబునం గూడిరి. మఱియును, 78

సీ. దీర్ఘకాలాలభ్య దృఢరతిస్థితి నాగకాంతలు పతినిచ్చఁగలయఁగనిరి
బహుకాలవిస్మృత ప్రకటభూషాహి శంకరుఁడు క్రమ్మఱఁ దాల్చెఁ గంకణంబు
కతిపయకాలదూరిత తల్పఫణిరమాభర్తకెన్నాళ్ళకో పఱపుదొరకె
కద్రూసుతుల కెంత కాలానకో యింట నన్న పస్తీఁగలిగె నారగింపు
గీ. సాహసోద్దండ మండితబాహుదండ, మండనాయత విశ్వభూమండలుండు
నైరసేనిధరణి నేల భారముడిగి, యురగపుఁడు స్వేచ్ఛవిహరించుచుంటఁ జేసి. 79

ఉ. తల్లడపాటుతోఁగడకుఁ బాఱెదమోనిచయంబు, వేసఁగిం
జిల్లఁగనొప్పె సత్సమితి, చేటునుబొందె నరాతిచక్ర మ
త్యుల్లసితస్థితిం గువలయోన్నతి పెంపువహించె నప్డు డా
చిల్లనిరాజు ధారుణిఁ బ్రసన్నముఖంబున నేలుచుండఁగన్. 80

సీ. వలసినకాలఁది వానలఁ బయోధరములు గోరినయప్పుడు గురియుచుండుఁ
దముఁదామె మూడలఁ దన్నికాగులకొద్ది పాలు ధేనువులు మువ్వేళఁ బితుకుఁ
జోకకుఁ బుట్టిచొప్పునఁ బొన్నినమలోని పంటలుదున్నకపండుచుండు
మేటిసంపదలచేఁ గోటికిఁబడగలెత్తనివారు వెదకి మందునకులేరు
గీ. ధర్మదేవత నాల్గుపాదములనడచు, మునిజనాధ్వర జపతపంబులు ఫలించు
నాయురారోగ్య గరిమ ప్రజాభివృద్ధి, దనరియుండును నలుఁడేలు ధరణియందు.

వ. ఇట్లఖండవైభవాఖండలుండును చండతేజఃప్రకాండ మార్తాండ మండలుండును నై
నలుండు పూజ్యంబగు సామ్రాజ్యంబు వహించియుండి యొక్కనాఁడు. 82

సీ. ఒకవంకఁ గుకురాది సకలదేశాధిప ప్రకరమంపిన రాయబారములును
నొకవంక గురుసహస్రోపమాన సుధీసమన్విత స్వాంతసామంతవరులు
నొకవంకఁ జకితవ్యాద్వికటారిదళన విక్రమధీర రాహుత్తసముదయంబు
లొకవంక సుకవిగాయకవంది జనముఖ్య వరసభాస్తాంగ పరిచయంబు
గీ. మిక్కుటంబుగ దైవజ్ఞులొక్కవంక, నొఱపుగల వారభామినులొక్కవంక
నురుతర ప్రాజ్ఞులగువారలొక్కవంకఁ, గొలువఁ బేరోలగంబుండె నలవిభుండు.

చ. ఇసుగడ భీతినంజలి వహించి నృపావలి నిచ్చకొల్వనె
చ్చరిక పరాకు హాయనుచు సారెకు వేత్రధరాళి వల్కఁ భా
సురకర దీపికాతతులు చూడ్కికిఁ బండువు సేయ భూవరుం
డురుతర సింహపీఠిక సమున్నతిమై గొలువున్న యత్తఱిన్. 84

వ. సకలదిశా సంచారులగు చారులేతెంచి జోహారు లొనరించిన వీక్షించి లోకవా
ర్తలడిగిన వారలిట్లనిరి 85

క. దేవర ధరఁ బాలింపఁగ, నేవంకం బొర్విద్దులాడుచు బెట్టుఁగక యెపుడుం
దేవరకే జయ వెట్టుచు, నేవేళ్లం బదల విజ్ఞ మీఁగుచుఁ బ్రజలున్. 86

సీ. మంత్రులమనసుఁ బల్లఱుదేని తెలిసి దుర్గాధినాథుల మర్మ మరసి చూచి
మన్నీల భేదముల్ పన్నిపాయఁగఁ బెట్టి సాన్నిధ్యులకు గుట్టు చనువులీక
కొనుట మానుట నిల్వలును మట వివరించి పాళుపత్తైయి వారి తీరు లెఱిఁగి
బలముల నప్పటప్పటికి నీక్షింపుచు గ్రాసక్రమములడుగక యొసఁగుచు
గీ. లోకవార్తలు మావల్ల లోఁగొనుము, నను దినా యవ్యయంబులంగనుచుఁ బర్త
లీల నేర్పడ నీవు భూపాలనంబు, సేయఁ బ్రజగొడవందునె క్షితివరేణ్య. 87

వ. అని మఱియు సకలదేశాంతర వృత్తాంతంబులెంతయు విన్నవించిన సంతోషకలి
తస్వాంతుండై వారల వీడ్కొని హిత పురోహితామాత్య వరులం గనుంగొని
యిట్లనియె. 88

మ. దురహంకార విహారమత్త రిపురాడ్దుర్వార దోర్గర్వ సం
హరణోపాయ పథంబు నిర్మలయశో వ్యాపార మూలంబు సు
స్థిర సామ్రాజ్యరమా వశీకరము భూతివ్రాతసంధాయి పెం
పరయల్ గానిల దండయాత్ర యను సామ్యం బెద్దియున్ గల్గునే. 89

క. జననాథవరుల శౌర్యం, బును బల సంపత్తియశము భువనస్థలిఁ బెం
పును బొందుట దిగ్విజయం, బనగా దె యంతకంటెఁ బూజ్యముకలదే. 90

ఆ. అట్లుగాన దండయాత్రా సముత్సాహ, కలితమగుచు హృదయ మలరునెపుడుఁ
జతురలీల సర్వసన్నాహ గరిమతోఁ, జనఁగవలయు జయముఁగొనఁగవలయు 91

వ. మీర లతిరయంబున సకల వ్యూహంబుల సన్నాహంబును సేయింపుఁడని శుంభ
దంభోధర గంభీరభాషణంబుల నానతిచ్చిన మహాప్రసాదంబని వార లవ్విధంబు
వీటం జాటించిన. 92

ఉ. ఘోరతరంబుగా మొరసె గూహకశాత్రవ సంభ్రమాపసం
హారి విహాయసావనితలాంతర భీకర నాదకారి ది

స్ఫారణ కర్ణకోటర విఘట్టకఠోర సుపర్వమానిదృ
క్సారస మోదకారణ విశాల విహారి ప్రయాణభేరియున్. 93

మహాస్రగ్ధర.

చెదరెన్ సప్తాశ్వసప్తుల్ పృథుతరగతి విస్ఫీత చేతఃప్రవృత్తిం
బెదరెన్ నక్షత్రపఙ్క్తుల్ శిథిలముఖకళా చిత్తచాపల్య చర్యం
గదలెన్ సర్వావనీభృద్గణ మతిభయ సంక్రాంత సత్వాకులంబై
వదలెన్ దిగ్వారణేంద్రవ్రజము సహజ దుర్వారమౌ ధైర్యరాశిన్. 94

వ. అంతఁ గువలయాధిప కువలయాప్తుండును, సుఖసుప్తుండై యా రేయిం గడపి ప్ర
భాతంబగుటయుం గృతకాల్యకరణీయుండై 95

గీ. వైరిసేనావిదారి యన్వైరసేని, సేన నడిపింపుఁడింకని యానతిడిన
మ్రొక్కి దళవాయి వౌరయమ్మక్కయనఁగ, నడిపిరి బలాళి నపుడుక్కుపోఁడులురాల.

సీ. అద్రీంద్రసన్నిభాత్యుద్రాంగపటిమ నిర్నిద్రవైఖరిఁ బొల్చు భద్రకరులు
గంధవాహసమాన బంధురత్వరహేళి గంధర్వగతిఁ గెల్చు సైంధవములు
పృథుల విక్రమ మహాప్రథిత భూస్థలి శుభ ప్రథ చేతఁ దనరెడు రథచయంబు
భూరిసాహసలీల వైరివీరులఁ బోరఁ జీరనోపెడు రణశూరభటులు

గీ. శాతకుంభోరు కేతనవ్రాతములును, చారువిస్తారధాటీ కుటీరములును
నిస్తులప్రస్తుత సమస్త వస్తుతతులు, మొదలుగా సేన పుడమి గ్రక్కదలఁ గదలె. 98

వ. ఆసమయంబున.

గీ. పైనమైపోవుతతి నొక్క బల్లిమందు, కేల జళిపించ ననఁ జూడఁజాలనమర
శత్రుమస్తకకబళగ్రసనము గోరు, లీలఁ గనుపట్టు మృత్యువు నాలుకనఁగ. 99

క. భయదగదాధరుఁడై యొం, తయుఁ జను నొక్కరుఁడు ఘోర దండముఁగొని తా
లయసమయమందునఁ బ్రజా, క్షయమొనరింపంగ వెడలు జముఁడోయనఁగన్.

చ. కరికరిణీవరంబుబలె గాఢరతిం బ్రియురాలిఁ గూడు త
త్తరమున యూదిరేకపుడు దాటునఁ బైనము సేవపారిసం
గిరిఁగొని వేగలేచి వలకేలఁ దవుల్కొను పైఁటవీడఁగా
నలుఁగక పోయె శూరుఁడొకఁడెంతయు సంభ్రమలీల నొప్పుమన్. 101

కం. మాపట్టి వెడలె నొక్కఁడు, కేవల కుంభజునిఁబోలి యిలలోపల దు
ర్వారపారవిమతసేనా, కూపారం బొక్కఁ బ్రుక్కఁ గొనియెదననుచున్. 102

వ. అంత. 103

చ. అనఘుఁడు రాజమౌళి విపులాంచితమై కనుపట్టు స్యందనం
బును పనుభాసురాచలశరాసనమచ్యుతసాయకోజ్జ్వలం
బును జతురాగమాశ్వములు భూరిశిఖాత్తక సూతుఁడొప్ప సొం
పున వెడలెన్ విపక్షపురముల్ వడిఁ గూల్చుటకై రయంబునన్. 104

కం. ఆసమయంబున నొసఁగిరి, భూసురు లాశీర్వాదములు పుణ్యసతుల్
సేసలు సల్లిరి దిక్కులు, భాసిలె శుభలీల నెసఁగెఁ బటువాద్యంబుల్. 105

వ. ఈక్రమంబున నిర్వక్రవిక్రమకేసరి యను రాజశతక్రతుండు సన్నాహంబు లను
వ్యూహంబులతో నడుచు సమయంబున. 106

గీ. శరధిసంశోభమాన విస్ఫురణ మెఱసి, సార్వభౌమసమాగమ శక్తిఁ దనరి
పల్లములుగల్గి బలువిండ్లు పైఁదనర్చి హరిసమాజంబుగ నుప్పటై ధరణికరణి. 107

చ. తురగఖురాహతక్షితిజ ధూళిమహోద్భత లీలఁ బొందమి
యరిగె నభంబుముట్టి నిజధాధిపుఁ డేలఁగఁ దామనోవ్యథల్
దరలసుఖంబుఁ గంటివని ధాతకు దండన మేలుచెప్పఁగా
స్థిరయలసత్యలోకమును జేరఁగఁబోయెడు పొల్పుఁ దెల్పుచున్. 108

మ. క్రతుభుక్సంయమికల్యసహ్యేతరమై కంఖాణరింఖాహతి
క్షితిసంభూతపరాగజాలములు సంకీర్ణంబుగాఁ దోనవ
ద్యుతి నేత్రోత్సవ మొందునట్లులది మాయం జేసి యత్యంతసం
స్తుతిఁ గాంచెన్ మదహస్తిగండపుట నిష్ఠ్యూతంపుదానాంబువుల్. 109

ఆ. వసుధవానలేని నటువయటంచును. హాస్యమునకు లోకులండ్రుగాని
యదియసజముఁ జేసి నదులఁ బాఱించెఁబో, కరులకటములందుఁ గురియు మదము.

చ. తెలుచుగ దంతి గండమదధారలు క్రమ్మఁగ సైన్యకోటులుం
గలకలఁ ద్రొక్కుటం బురద గానఁబడుం దిగఁబాటు నొందకే
జరుగ రథంబులున్ భటులసందడిపై వివిధాయుధవ్రజం
బారసిన రాలి యుక్కుఁబొడియుం దలమై యల రొంపి మాన్పెడున్. 111

112

వ. అప్పుడు.

క. కేతన పటాంచలంబుల, వాతోద్ధూతములఁ గదలె వైరిమహీశుల్
మీతరము గాదు నిలువఁగ, వేతొలఁగుఁడటంచుఁ గొంగు వీఁగినభంగిన్. 113

114

వ. అప్పుడు

సీ. నూఱాఱువన్నెనఁ జీఱలేకుంటినా పేరు గాదుర పూస పేరు గాని
పిడుగు నైనను నల్చి పొడిసేయకుంటినా చెయి గాదు తాళము చెయియె గాని
దున్న నైనను బట్టి యొగవేయకుంటినా లావు గాదుర యావు లావు గాని
బలమెల్లఁ గలసుండు వడఁద్రెంచకుంటినా వాలు గాదుర మెక్కు వాలు గాని

గీ. అనుచు గొబ్బున గొబ్బున నార్చిపేర్చి, పేరములు ద్రొక్కి యొండొరు బీరమొదవ
కేరికలు గొట్టుచు నుగట్టె వీరభటులు, పార్థివేంద్రుండు గాంచి సంభ్రమము నొంద.

వ. ఈక్రమంబున నవక్రవిక్రమ మృగేంద్రుండగు రాజచంద్రుం డనుదిన ప్రయాణం
బులం బోవుచున్న సమయంబున నవ్వార్తయును మున్న విని లాట మరాట కర్ణాట
వావాట బంగాళ చోళ పాంచాల నేపాళ కేరళ ద్రవిళాది దేశంబుల రాజులెల్ల
నొక్కెడ నొక్కటంగూడి విచారంబులంబొంది యందు గొందఱతని కెదిరించి
చూతము జయాపజయంబులు దైవాధీనంబు లనువారును, గొందఱతని కెదిరించు
ట యశక్యంబనువారును, గొందఱిద్ధరిత్రంబుమాని యప్పార్థివేంద్రునకుఁ గప్పంబు
లొప్పింతమనువారును, గొందఱిన్నియు నుజ్జగించి దేశత్యాగంబు గాఁ జనుట యు
క్తంబనువారునునై పెక్కండ్రు పెక్కువిధంబుల నాడుచున్న సమయంబునఁ బు
ష్కరుండను మహీమండలేశ్వరుండు నైషధుని పితృవ్యపుత్త్రుండగుకతన జ్ఞాతి వి
రుద్ధ బద్ధ బుద్ధిం జేసి యందఱి నిట్లనియె. 116

క. ఇందుల నందఱమీగతిఁ, గొందలమును బొందిసందు గొందుల నెన్నా
ళ్లుందాఁక నుందుమిహిహీ, పందలమై బ్రదుకుటొక్క బ్రదుకే తలఁపన్. 117

క. మీసములు పెంచుకొనియొక, వీసమునకుఁ బనికిరాక వెడలుట తగవే
రోసిన బ్రదుకేటికయో, సీసీ మొలబట్టయేల ? సిగ్గునకెకదా. 118

క. ఉఱికెడి వారలఁ జూచినఁ, దఱిమెడి వారలకుఁ గడు మదంబగుఁ గాదే
నెఱిచెడిన మనలఁ గని మఱి, మఱలునె దయవలఁచి నలుఁడు మనబాంధవుఁడై

వ. కావున రణముఖంబున నిలిచి వైరి సేనాసముదయంబులం బాఱఁదోలుట యుక్తం
బని పలికిన నతని పలుకులనందఱు నియ్యకొని సమరసముదిత సంభ్రమాయత్త చిత్తం
బున నొండొరులు దమలోన. 120

సీ. కనుఁగొని మాళవమనుజాధినాథుండు చిఱునవ్వునవ్వె కాశ్మీరనృపతి
పక్కలువొడిచె నేపాళమహీభర్త చెయిచేతఁ జఱచెను సింధురాజు
మీసముల్ వడివేసె కోసలాధీశుండు చంకలుదాటించె శకవిభుండు
పట్టంబు జళిపించెఁ బాంచాలభూజాని మగధుండు మిక్కిలి బిసవు చూపె

గీ. నంతకంతకునుబ్బె నవంతినేత, కేరళక్ష్మాపపుత్త్రుండు కెళయుకొట్టె
తక్కుఁగలిగిన నరవరులుక్కుమిగిలి, ప్రల్లదంబులుపలుకుచు నుల్లసిలిరి. 121

గీ. ఈవిధంబున నొండొరులేపుమిగిలి, సమరసముదితసన్నాహసరణినసమ
భేరికాధ్వానమున దిశల్ బీఁటువాఱఁ, బుడమియీనిగతి సేననడపిరపుడు. 122

వ. అంతఁ దద్వృత్తాంతంబంతయుఁ జారులవలన నెఱింగి నలమహీకాంతుండు.

క. చిఱునవ్వునవ్వి భళిరే, కొఱవిందలగోకికొనుటకు దలఁచిరి యే
డ్తెఱనిత్తఱిఁ బైకొనిసే, నఱిమెదయుమనగరిదరియ నరివర్గములన్. 124

గీ. అయ్య మానుమట్టుపెట్టిన దాదిగాఁగ, వలసవంగుడు తెఱుఁగక బలిసిగవ్వ
కాసువ్యయపోక నెత్తికిఁ గన్నులెక్కి, క్రొవ్వియున్నారు వోరాచగొఱియలిపుడు.

క. అహోయూహలుచేసిరె, కూహకములనట్టిపగరగొఱియలుగాను
గ్రాహవచండికయగుమ, ద్బాహాసికి వేటచెఱకుపండువొనర్తున్. 126

వ. అనిపలికి. 127

క. ప్రతిలేనియట్టిసేనా, పతులన్ నియమింప వారపారప్రౌఢిం
జతురంగబలంబులతో, జతురస్థితిమీఱఁ బన్నసమకట్టుటయున్. 128

క. కరిరథమునరదమేనుఁగు, హరిహయముల్ స్యందనంబు హస్తిసుభటత
త్పురుషుఁడు వాజిశతాంగము, లరసిగజముగాఁగఁ బన్న వద్భుతమయ్యెన్. 129

వ. అంత విమతకుతలాధిపతులు దిశానిరోధంబులగు బలయూధంబులతో నెదురు
నడతెంచుడు, 130

క. అలగోలుజగడమపుడే, యలగోపతి మెచ్చిపొగడ నరిసైనికులన్
నెలగోలలజడిఁ గూల్చుచు, నెలగోయనిపించలేని చెయ్యేయిదియున్. 131

క. వేదండ రిపునిసైనే, వేదండరిపుప్రతాప విహృతిగదియనా
కోదండము గనినంతనె, కోదండమటంచు నతఁడు కొంకకయున్నే. 132

వ. అని బీరంబులాడుచు నిషధసేనలంగదియ నేతెంచి యప్పుడు. 133

గీ. ఎదురుకోలుచేసి రిపుడెఱుంగులవార, లణఁకిఁ గినుక లెగయ వెనుకసరళ
నెదురుకోలుచేసి రిదితమకళ్యాణ, కాలమనుచు మేనకాప్రముఖులు. 134

వ. అప్పుడు. 135

క. కరిఁ గరినిం దురగంబును, దురగము రథికుండు రథికు దుస్తరబలబం
ధురభటుఁడు భటునిఁ దలఁపడ, సరివోల్పఁగరాని ఘోర సమరంబయ్యెన్. 136

సీ. కొండలకైవడి దండిమైఁ డీకొని, యొండొంటిఁ దాఁకు వేదండకాండ
ముదుగులొత్రిక్కనభటుల్ పాడిగాఁ గనొండొంటి, వడిఁ జేరఁ బాఱు తత్తడుల బాఱు
ప్రకటసైనికరథుల్ రణభూమిఁ బడఁగి నొం, డొకటిఁ దాఁకెడు రథప్రకరములును
జేరుతబంటును జీరయొండొకనికిఁ, బోరసుదూఱెను వీరభటులు

ఆ. గలిగియరగియరగి యలయక మలయుఁచు, బెగ్గడిలక రోషమగ్గలముగ
ప్రళయజలధిలోఁ దరఁగలమాడ్కి నిదాఁకి, ఘోరతరముగాఁగఁ బోరిరపుడు. 137

గీ. జొన్నఁదఱిగినకైవడిఁ బన్నిదమునఁ, జెఱకుతుంటలు డెగవ్రేయు చేవ బోడు
నరకుచాడ్పున నొండొరుల్ పిటికిఁ గొనక, నరకులాడిరి వేల్పులందఱును బొగడ.

వ. అందు. 139

చ. అనిఁ జలమూనియుద్ధులు మహాగ్రహులైపడిఁ బోరిసూలి, తా
రిసు నెడదూఱజొచ్చుగొన నిందఱుఁ బట్టక నేను నేను ముం
దనిజగడించిరట్లు చని యచ్చట సూర్యసిఁ జూచి నాకు నా
కని కలహించిరామడిసిరైయెనను వైరము వీడరేమనన్. 140

వ. మఱియును. 141

చ. పెటపెటఁ బండ్లుగీటుచును భీషణనైషధసైనికుల్ సము
త్కటచటులాసిధారలను ఖంగనవైరుల వ్రేయ వారిమి
కుటమగు జోళ్ళతాఁకి మిణుగుర్లురసుల్క్రాని తేరులంటుచోఁ
బెటలు పెటేళ్ళు పెళ్ళు పెళుపెళ్ళు పెటేల్లని కూలఁగాలుచున్. 142

వ. వెండియు.

ఉ. నైషధసేనలార్చ్చను మనంబుల రోషము మీఱఁ బోరవి
ద్వేషిచమూసమూహముల దివ్యశిలీముఖ వృష్టి నెంతయున్
భీషణలీలనొంచుటయు బిట్టుకలంగుచు వారలార్తని
ర్ఘోషము మీఱఁ బాఱిరి యకుంఠిత మానసులై రయంబునన్. 143

వ. ఆసమయంబునఁ బుష్కరక్షోణిమండలేశ్వరుండు స్వపక్షక్షితిపతులం గనుంగొని యిట్లనియె. 144

క. ఆదమనబలంబు ధృతిచెడి, కదనంబున వీఁగిపాఱెఁ గదుఁ బైకొనెదు
ర్మదరిపుసేనలు, మనమీ, యదనం గడియనఱిఁగి పగరన ఱముగ వలయున్, 145

వ. అని పలికి యాక్షణంబ 146

క. మరలుఁడు పోకుఁడు పోకుఁడు, వెరవుననిదె పుష్కరుండు విమతబలంబున్
బొరిఁగొనఁగ మిమ్ముఁ గావఁగఁ, బరతెంచె నటంచు రథము పరపె రయమునన్. 147

వ. ఇట్లు రథంబుఁ బఱపి నిజబలంబులం బురికొల్పిన నంగ వంగ కళింగ భూపతులొక్కపార్శ్వంబును లాటకర్ణాట మరాటమండలేశ్వరులొక్క పక్షంబును జోళకేరళప్రముఖులొక్క భాగంబును సౌవీరసౌరాష్ట్రసాళ్వదేశాధినాయకులొక్కవంకం బైకొని యొక్కపెట్టునఁ జుట్టుముట్టి నిషధబలంబులం జలంబు మీఱి పొడిచియు నడచియుఁ గొట్టియు మట్టియుం జించి చెండాడిన నందెగిన మావంతులును నొగిలిన దంతులును సురిఁగిన తురంగంబులును, విరిసిన శతాంగంబులును నై యొప్పు నప్పుడు శౌర్యంబు వీడి ధైర్యంబు దూలి రక్షరక్షేతి శబ్దంబుల నాక్రోశింపుచుఁ బఱతెంచు నిజసేనాసముదయంబునఁ బెనఁగొను పగఱఁ గాంచి ముంచిన రౌద్రరసంబు వెల్లివిరియ నిషధమహీపాలుండు నిజసూతుండగు వార్ష్ణేయుని రథంబు తిరయంబునఁ బఱపుమని విమతసమితిం గదియం జని. 148

గీ. ప్రకటతరమైన విష్ణుకార్ముకముఁ బూని, మిగుల గర్జింపుచును మేరమీఱకుండఁ
వృష్టిఁ గురియుచు జూపఱ వెఱగుపడఁగ, ఘనత మెఱయంగ నతవిపుష్కరుఁడు గాంచి.

వ. కదియం జనుదెంచి యతని నుద్దేశించి యిట్లనియె. 150

చ. మగఁటిమి మీఱ ఘోరరణమండలిలో భవదీయసేనలన్
బగతుర నొంచెఁ గానిటుల పాఱిన నుదాపుచు దొలనుంచు శే

నగరులవారిదోఁచఁగను నాయఁడుపొంచిన యట్లుసేయఁగాఁ
దగునె యశంబుశౌర్యమును ధైర్యము వన్నియకెక్కఁ జేర్చునే. 151

క. ఎఱుఁగవు మునురణమెన్నఁడుఁ, బెఱవారలకరణిఁబోఁడు భీకరగతిఁబ
ల్లఱునఱుముపుష్కరుండిట, పెఱవకనిలువంగఁగలవె విక్రమగరిమన్. 152

వ. అనిననలుండిట్లనియె, 153

క. మాటలపోటరివగునీ, పాటించునఁగానఁబడియెఁ బ్రాజ్ఞుఁడవనఁదా
మాటికిఁబొగడుకొను నెన్నృప, కోటులుగొనియాడఁగందగుం గాక యనిన్. 154

క. ధరశూరుఁడ సేననిపా, మరమతిఁబొగడుకొన నేల మనశౌర్యములి
ద్దురమున నేర్పడియెడుఁనిక, నరయఁగముం జేతి (నగలకద్దంబేలా.) 155

వ. అని వీరప్రతాపం బేర్పడ నాడుచు నయ్యిరువురు ధనుర్బాణపాణులై పోరఁద
డంగిరయ్యెడ, నలుం డసమశర పరంపరలు నిగుడించినం బుష్కరుండు నిశితస
యకంబులు ముప్పిరిగొన నతనిపయిం బఱపి సంభ్రమంబున నార్చిన నవ్వీరాగ్రే
రుండు కోపాటోపంబుదీపింప బెడిదంపుటంప జడిముంపుచు నొక్కతూపున
తని రథ్యంబుల రూపుమాపి యొక్కశరంబున సారథిశిరంబుఁదుంచి యొక్క
ల్లంబున నతనియుల్లంబుఁ బల్లటిల్ల జేసి శతాంగంబు భంగంబుఁగావించిన విరథు
డై యవ్వీరుండు సౌవీరనృపతి యరదంబునకుఁజికె నిషధసేనలార్చి పేర్చినంగన
యంగవంగకళింగ లాటచోళమరాట కర్ణాట ప్రముఖులగు నరవరు లుక్కుమిగి
సింగముంబొదవు మత్తమాతంగంబుల భంగింగవిసి నిజబలంబులతో నలుంజుట్ట
ముట్టి ధనుర్విద్యాకౌశలంబు మెఱయ నతని రథరథ్యసూతకేతనాదులపై శిలీమ
ఖంబు లసంఖ్యంబుగాఁ బఱపినవతండు. 156

గీ. కోపమెల్లను రూపుగైకొనిన కరణి, నాగ్రహంబెల్ల విగ్రహంబైనయట్లు
చేవయెల్లను బోరివైన చెలువుదనరి ప్రళయ కాలఫాలాక్షుని పగిదిఁగనలి. 157

ఉ. మిక్కుటమైన శౌర్యమున మించునతం డభియాతిసేనలన్
ముక్కలుఁ జెక్కలుం జెవులు మూతులుఁ జేతులుఁ గాళ్ళు వ్రేళ్లునుం
జిక్కులు డొక్కలుం దఱఁగి పేరును బెంపెఱుఁ గంగనీక పే
రుక్కునఁ జెక్కుజేసె నిజోత్కరముల్ గని ప్రస్తుతింపఁగన్. 158

వ. ఇట్లు ఘోరంబుగా వైరసేనివైరిసేనలం జెండిచెండాడినం గొండలుగాఁ బడుకం
డలును బొఱిపుత్తైనపేఱ్పులును గొప్పలైనయెమ్ములకుప్పలును పేరులుమీఱం బొఱలునె
త్తుఱ్ఱేట్లుం గలిగి భయంకరంబగు సమరస్థలంబునం బొట్టేలకొలఁది దట్టంబులగు
మాంసఖండలంబులు మెసంగి పేరెంబులు వాఱువంచకవారంబులును, దంతిపట
లంబులును, జలంబుగా దోదోపులాడం జిటిలిన ముత్తియంబు లేరి గిరనగింజలాడు
కూష్మాండపుంజంబులును, గొప్పలగు శల్యంపుటరుఁగుల మఱుఁగుల డాఁగిలిమూఁత
లాడు భూతనిచయంబులును పగఱేఁగిచూడ నద్భుతంబయ్యె నయ్యెడ. 159

చ. సెలఁగిన పుండరీకముల చెంతలవాఱిలు శిలీముఖంబులున్
మెలఁకువఁ దక్కుచక్రముల మించి కెలంకులఁ జేరు నూర్పులం
గలకలరావముల్ దలము గావినుమిట్టిన ఖేచరావళిం
గొలనువిధంబుఁ దెల్పె నృప కుంజరుతొఱ్ఱిక్కుడు నారణోర్వియున్. 160

గీ. అమ్మహారణకేళిఁ దానట్లుచూచి, త్రిదశమునిచూడ్కిమిగుల నత్యూనుఁ జిక్కె
కలహమెన్నాళ్ళకో లేదు కలవుకొనిన, బక్కపేగునకఱుఁగు నేబహ్వాశనము. 161

వ. ఈక్రమంబున విక్రమంబు మెఱసి యారాజకంఠీరవుండు విమతనృపకుంజరంబులు
బెగ్గటిల నగ్గలంబుగ నేసిన శరసియాశీవిషంబు గతిమోఱియించుం బుష్కరుండుదు
ష్కరంబగు శరంబులవానఁ గురియుచు నతనిరథరథ్యసూతులం దలంకం జేసినం దొం
డుకాండంబునఁ గోదండంబు రెంటుతునియలుగావించిన మించినరౌద్రంబున నిష
ధక్షితీశ్వరుండు వేఱొక్కవిల్లందినిశిత మార్గణంబులనర్గళంబుగాఁ బఱపినఁ దెఱపి
లేనియాబెడిదంపుటంప జడికిజడిసిన భీరంబునం బుష్కరప్రముఖులు విముఖులై
పాఱిరందుగొందఱతని శరణొందిరి కొందఱుగప్పంబులొప్పించియప్పార్థివేంద్రుం
గొల్చిరి కొందఱు శస్త్రసన్న్యాసంబుసలిపి విరక్తిఁగని యుక్తింజనిరి కొందఱు
సపుత్త్రమిత్త్రకళత్త్రంబుగ స్వస్థానంబువదలికదలిరి మఱియును- 162

క. అడుగులు దడఁబడ నడుములు, వడవడవణఁకంగ వడలు వడిచెడిచెమటల్
జడిగొనఁబఱతులు వెంబడి, యడవుఁగనడవులకుఁజనిరి నానారిపులున్. 163

వ. అప్పుడు.

సీ. వడిదప్పిపాదముల్ దడఁబడ నూఁదుచుఁ దమకందములతీరుఁ దలఁగఁ బొలిచి
మొదుసమాటాడక పెనవులుబడుపుచ నూహఁబోఁచక యుస్సురుస్సురనుచు

మాటికినిజవృత్తి మఱుఁగుగా మెలఁగుచు బహుతరాలంకారసుహీనునైనన్
గూఢార్థమనసిలోఁ గొనక దుర్ఘటములొందుచున్న దిపునరుక్తిఁగొనుచు

గీ. దారిదెలియంగనేరక తప్పుతప్పు, చాయఁద్రొక్కుచు మదిని సంశయమెకలిగి
దుష్కవిప్రోక్తమును బోలి దుష్టవైరి, కాంతలొప్పిరి చూడ వికారమొంది, 164

వ. మఱియును.

క. ఏకతమున వాకలములు, మేఁకలవలె వాఁకలైన మెలఁగుసుమతియే
పోకలెఱుంగక తిరిగిరి, చీకాకైగట్టుగుట్ట చెట్టన వరిపుల్, 165

సీ. ఉద్యానములఁ ద్రిమ్మరెడువారికి ఘనతరారణ్యముల్ గానఁగలిగె
కృతకాచలముల పైఁ గ్రీడించువారికి మేటికొండలమీఁద మెలఁగఁగలిగెఁ
బోఁడి చిల్కలతో వినోదించువారికిఁ బలువన్నె పులుఁగులఁ దెలియఁగలిగె
తోఁటకాల్వలదాటి తోషించువారికి దండిమైసెలయేర్లు దాటఁగలిగె

గీ. భళిర రిపుకాంతలనక యావలసనైన. నిండ్లకంటె విహారంబులెచ్చఁజేసె
నెంతదాక్షిణ్యశీలియో యెంచిచూడఁ, గామితార్థుఁడగు సార్వభౌము ధాటి. 166

వ. ఇవ్విధంబున జంబూద్వీపంబునంగల సర్వసర్వంసహాభర్తలగర్వంబులు వోకార్చి యబ్బల్లిదుండాక్షణంబున నంబ్లక్షద్వీపప్రముఖంబగు దీవులకుం బోవుటకుఁ బ్రయాణోద్యోగంబు వేలంబునఁ జాటించిన. 167

క. వేవులవారలు తమతమ, దీవులకుం బోయి వార్తఁ దెలిపిన నృపతుల్
చేవలుచెడి కీవులువిడి, తావులువడఁ దరలి మిక్కుటంబగు భీతిన్, 168

పంచచామరము. హరుల్ కరుల్ సిరుల్ దలిర్చునట్టి రత్నముల్ ఘనా
మరుల్ మరుల్ గొనం దనర్చు మంజుకంజనేత్రలం
గురుల్ పెనంచనొప్పు చాలఁ గొప్పు ముత్తియంబులున్
గురుల్ హితోక్తి దెల్పఁ గాన్కఁ గొంచు వచ్చి భక్తితోన్, 169

మ. అకలంకస్వనయాంకుశాపహత సాహంకార దర్పోన్నత
ప్రకటంబేనృపకుంజరప్రతతి చేరన్వచ్చె సంగ్రామరం

గకతోరధ్వజినీసమేతరిపుభూకాంతేభ కుంభస్థల
ప్రకటోద్భేదనశాతశస్త్రనఖకుంభద్రాజసింహున్ నలున్, 170

ఉ. కాంచితరత్నరత్నమయకాంచన చారుకిరీటకాంతిని
ర్వంచితభక్తిదచ్ఛరణవారిజయుగ్మముఁ జుట్టిరానివా
శించియొకింత కేనిఁ గొదలేనిధనాదులు కానుకల్ సమ
ర్పించితదీయులైకనుసరించుచుఁ గొల్చిరి యమ్మహాత్మునిన్, 171

వ. అంత, 172

క. నలుగురవచనక్రమమున, నలుగురుమంత్రీంద్రులరిగి నలుదిక్కులయం
దలచక్రవాళగిరిపై నిలిపిరిజయశాసనములు నిస్తులఫణితిన్. 173

వ. ఈప్రకారంబున నిజప్రతాపప్రకాశప్రవాళ వల్లికలనలుదిక్కులం దల్లిబిల్లిగొ
నంబాదుకొల్పి మరలి నిజపురాభిముఖుండై యనుదినప్రయాణంబునం గదలి 174

మ. సప్తాంభోనిధి మధ్యభూభువన రాజవ్రాతముల్ గొల్వరా
సప్తాశ్వప్రతిమానతేజుఁడు నలక్ష్మాపాలవర్యుండు సం
ప్రాప్తైశ్వర్యమహోత్సవాంబునిధి దెప్పందేలి వేంచేసెఁదా
సప్తిస్యందనమత్తవారణభటుల్ సంప్రీతిమైఁ బోవరాన్, 175

వ. అయ్యవసరంబున, 176

తరల. గరుడపచ్చలతోరణంబులఁ గట్టిగోడలు గమ్మగ
స్తురినిబూసి పునుంగువీథులఁ జొబ్బిలంగ నల్కిపె
ల్లిరిదిముత్తెపుముగ్గువెట్టి నిజావనీశ్వరుఁ గొల్చి
త్తరుల ప్రాసియలంకరించిరి తత్పురీంద్రమునత్తఱిన్. 177

సీ. జయజయనైషధక్ష్మాపాలవర యనికైవారములువందిగణము నెఱప
దీర్ఘాయురస్తుపృథ్వీభుజోత్తమయని చేరిభూదివిజులాశీర్వదింప
మంగళమవనీశమణియని వారాంగనాతతుల్ నీరాంజనంబొసంగ
డమరుడిండిమతూర్యఢక్కాప్రముఖవాద్య ఘుమఘుమనాదముల్ గుబులుకొనఁగ

గీ. బాయపడఁగంచుకులు బరాబరులు సేయ, నప్పటప్పటియరిగెల చప్పుడెసఁగ
నెదురసాధనకారులు పొదలినడువ, నగరుసొత్తెంచెనలమహీనాయకుండు, 178

క. ఈరీతిఁ బ్రవేశించి ధ, రారమణులుదన్నుఁగొలువ రాజసవిభవో
దారాగ్రహములలోరవి, గౌరవమున నాతఁడతి సుఖస్థితినుండెన్. 179

ఉ. కంటికిఁ దృప్తిగా నకటఁ గయ్యపుఁ దించి చెరించెమింటలో
కంటినగంటిమానిసుఖ మందెఁ బయోరుహ బంధుబింబమి
మ్మింటికినప్సరాంగనల కెవ్వరు సేరమి నొంటిదోఁచెని
ష్కంటకవృత్తిగా నలుఁడ ఖర్వమహోన్నతి రాజ్యమేలఁగన్. 180

మ. వరసాధూత్కరశాసనా సురసభస్వద్గూఢపాదీభవ
త్కరకాండాద్యచరేనకాండ పురరంగత్తాండవపాదస్రవ
ద్వరతారాధ్వగ కాండఖండన సముద్యచ్చండకోదండబం
ధురకాండా వరకాంతిమద్భువన బంధుగ్లౌస్ఫురద్గోద్వయా. 181

క. సింధుసుతా బంధురవో, ర్బంధనకలితాంగ యర్క బంధువధూదో
ష్కాంధతమఃపటలహరి, స్సైంధవనాగాంఘ్రిపద్మ సరిదినసద్మా. 182

క్రౌంచపదవృత్తము. ధారితపద్మా వారిజపద్మాతతకరవినిహితదనుసుతపద్మా
సారక రామా వైరివిరామా సముధికగుణజయసదబలరామా
సారసనాభా చారుఘనాభా శతశశిదినకరచతురఘనాభా
భూరివికాండా మూర్గదకాండా స్ఫుటతరనిరుపమపురగతకాండా,

గద్య. ఇది శ్రీమదాచ్చిపరదగురు చరణస్మరణాభ్యసన రసనావికాస తిరుమలగిరి
వేంకటేశ్వర వరప్రసాద లబ్ధకవితావిలాస హారితగోత్ర సిరిప్రగడ
తిప్పన మనీషిపుత్త్ర సుజనవిధేయ ధర్మయనామధేయ ప్రణీ
తంబైన నలచరిత్రంబునందు
ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# నలచరిత్రము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీరమణీమానసకా
సారస్థితమానసౌక సముదితకరుణా
సారాంబకపారసద
గారిభుజోద్దామ వేంకటాచలరమణా 1

వ. అవధరింపుము 2

ఉ. ఆగరిమన్నృపాలకుఁ డనంతవిభూతిఁ దనర్చి యొక్కనాఁ
డాగమవేత్తలున్ హితజనావళిబాంధవులున్ బ్రధానులున్
భాగవతోత్తముల్ గవులుపాఠకులున్ వరవీరపుంగవుల్
నాగరికుల్ బురోహితులు నర్తకులుం గొలువంగ గొల్వునన్ 3

వ. ఉన్న యెడల 4

ఆ. ఒడలగోసులంట నుంచినయొడిదాళ్ళు, గొబురుమీసములును గోరసికలు
ముక్కుమీఁదిబొట్టు ముంజేతిపైడేగ, లెసగుచున్న యట్టి యొలుకదొరలు 5

గీ. వచ్చిధరణీశ్వరునిగాంచి వఁకవంక, మొగ్గిక్కలిడి కానుకలువట్టి నిక్కినిక్కి
నేలమాపులఁజూచుచుఁ గోలలూను, గద్దువలనడ్డుపడుచు చొక్కయుఁడఁవలికె 6

శా. సామీ దేవరయయ్య యొల్లవినవే సప్పన్న దేశంబులన్
మామాకోనలుసూతు గాని యిపుడీ మాయున్న కానంబలెన్
నేమున్నెన్నడుసూడవాల్మెకము లున్నీయాన వెన్మైయ్యేనీ
సీమన్ నిల్పినయట్లు నిల్తునసూ సేరాజు గల్గన్ వలెన్ 7

క. వేడుకఁజూడఁగ దేవర, నేఁడటువిచ్చేసితేని నేనె మేకములన్
దూడలకదుపులఁగతిఁదో, లాడుచునీయెదురనన్ని నాఁగఁగ నేర్తున్ 8

గీ. ఏన్గునైనను జెవిపట్టియీడ్చి తెత్తు, సింహమునునైన దౌడలుచీరి తెత్తు
నెట్టిపులినైన నెలవులుగట్టి తెత్తు. చిఱుత మేకముల మాటలుచెప్ప నేల? 9

క. ఇచ్చటి పెగ్గలి దేటికి, వచ్చిననాతోడ సామి వారటనూనే
మెచ్చుము దేవర సెంచును. విచ్చేయుము వెంటనోదె వేదము గంతున్ 10

క. అని చెంచుదొరలు పలికిన, మనుజేంద్రుఁడు వారియేస మాటలకు మొగం
బున నగవు మొలకలెత్తఁగ, మునుకొను వేడుకలఁ గట్నములు దయచేసెన్ 11

వ. ఇట్లు సంగి మృగయావినోద వాంఛాడెందంబునం గ్రిందుకొనఁ దత్ప్రకారంబు పీటంజాటించిన 12

మ. కలుఁజోనులు పందివాట్లు జిగురుల్ వాగుర్లు చిక్కంబు లె
ద్దులుగంటల్ మిడుమిడ్లు చాటుతడికల్ దూబాణులున్ గోలక
జ్జులనీటెల్ గొలకల్ తుపాకులు కటారుల్ విల్లుకత్తుల్ సివం
గులబళ్ళున్ దలముల్లు గొంచుఁ జని రాకోయల్ మహోపాయులై 13

చ. పసు దనిగందముల్ వెనక బాదురుమాళ్లోడి దోళ్ళుజొంపు గా
లలు నెలవంక నామములు లాగులు నత్తెములున్ కటార్లు కా
సెలుబిగివారు మెట్టి కలుచిక్కములుం గనుపట్టి పైడిమూ
గలు జెలువొందు డేగలను గైకొనివచ్చిరి ముస్తుత్తటిన్ 14

సీ. బలుగండు రాయిది పులిపిండునైనను గలగుండు నడఁజేయఁ గలదు రయ్య
గద్దజీరాయిది పెద్దయేనుఁగునైన బుద్ధిఁ జెప్పఁగనోపఁ గద్దురన్న
పెనుబోతు రాయిది మనుబోతునైనను దినఁబోరు కేకాలుఁ జెనకదప్ప
దయ్యంబు రాయిది కయ్యంబునకు డాయ నయ్యెడఁబంది గీటణఁచునార

గీ. యనుచు మృగయులు దమనప్పుడరసిపొగడ, నెగడుచును గాలి పసిగొంచు నిక్కినీగి
కొనుచుఁ గోణతాలతో గునగుననడచె, విశ్వభయదంబుగా భైరవాశ్వగణము 15

గీ. చెలువు గాడుప్పి నునువంక సికలమర్చి, బలుగటారులు నీలి కాసెలు సవించి
వలిపముప్పటు లరిగంటములుఁ గట్టి వింటిమూఁకరయంబున వెడలెనపుడు 16

క. ఉడిగపుబుడతల వెంబడి నడపంబుల చెంచులీటెలాదిగఁ గొని రా
వడిహయుల నెక్కి వెడలిరి గొడుగుల నీడలను రాచ కొమరులు వేడ్కన్ 17

వ. అంత 18

సీ. సన్నసన్నపుఁబాగఁ దిన్నగాఁజుట్టి జాళ్వాకంటసరి యమర్పైనమర్చి
మేనిచాయలు బయల్పరించు కంచుకమూని తళుకురింగులపట్టు దట్టిగట్టి
జెళుకాలువానికమ్ముల వంకిమొలఁజెక్కి కళుకుముత్తియపుఁ జౌకట్లుదాల్చి
తీరుమీఱంగఁ గస్తూరి నామముదిద్ది నునుదాయెతులసందిటను ధరించి

గీ. జినుగుబంగారుకంగుల సేలఁగప్పి, లీలమైఁగంఠ మాలికల్ గీలుకొల్పి
నిలువుటద్దంబువట్టిన నీడఁజూచి మన్మథునిపోలి నిలిచెనమ్మనుజవిభుడు 19

వ. అప్పుడు 20

ఉ. వాయువుమీఱు ఝూమనిన వార్థిజవుస్కనఁ జౌకలించు హా
హూయనినిల్చుఁదాళగతి నొప్పగ బళ్ళెరమందు నాడు నా
రాయనఁ జాలునుత్తమ తురంగము సాహిణిఁ దెచ్చిపట్టుచో
నాయవనీశుఁడెక్కె వినతాత్మజు నెక్కిన శౌరికైవడిన్ 21

గీ. కొత్తముత్తెపుపగజంపు గొడుగు మెఱయ బారుగొనివచ్చునరిగెల బారు మెరయ
మేలువెలిఁజల్లి గడెలభటాలి మెఱయ నడచెభూపతి వేఁటసన్నాహమెసఁగ 22

వ. అప్పుడు 23

సీ. ఎలుఁగులేవోరకెనా మలుగులే తెగవ్రేసి యలుగులేనింతు నాయబ్బతోడు
కారుపోతాయెనా చీరిపోవిడుతుఁ బోతాకిపోనీక నాతల్లితోడు
సింగమేకదిసెనా భంగమైపోరలఁగా నంగమేపాడుతు నాయప్పతోడు
జింకయేమసలెనా అంకెలేవేయుచుఁ గొంపలేతెంతు నా కొడుకుతోడు

గీ. చాఱలమెకంబుఁగన్నను బారగుంజ కమ్మకొసఁగుదుఁబోకుండ నయ్యతోడు
వేడఁనుచుఁగూడి పంతంబు లాడికొనుచు మిగులఁగేరిక నడచిరి మృగయులపుడు 24

ఉ. పుణ్యుఁడు నైషధేంద్రుఁటటు వోవుచు డగ్గఱఁగాంచె నంచితా
రణ్యము సారఘోరమృగ రాజశరణ్యము నిత్యచైత్రిలా
వణ్యముసాంద్ర వర్ణతరువారనివారిత చండభానుకై
రణ్యము లోకసప్తక విరాజితసర్వవనీవరేణ్యమున్ 25

గీ. ఆనిమహీశుండు కంటికే వనవిలాస మధికసత్వసమృద్ధి సమాశ్రితేంద్ర
మానిఖచరావవస్థిరి మదనజనక మగుచుమాటిపోలె నిబిచాలనబ్రమెసఁగె 26

వ. అప్పుడు బహువిధంబుల నవ్వేఁటకాండ్ర నెచ్చరిల్లంజేసినఁ బెచ్చు పెఱుఁగుచు వారలు 27

గీ. తఱుముగానుఱలొడ్డి యోదములు త్రిప్పి బోనులొగ్గి బన్ని చుట్టిరాఁ బోఁగువారి
వలలు వలుదిక్కులను జొట్టి యలుచుఁ జేసి చోఁపు వెట్టిరి మెకముల చోట్లు దెలిసి 28

గీ. చెంగుననునింగి కెగురు తురంగములను కొకరువెట్టుచు నెదిరించు కోలములను
వాలములు ద్రిప్పుచును క్రోల్చు క్రోలుపులుల జిలజిలను ముండ్లు రాల్చు నేదులను జూచి

క. పట్టియుచు బసిఁడిపూఁతలఁ బట్టెడలు జరానదూసి పైనుసికొలుపం
జుట్టియురకట్టి మెకముల నిట్టట్టు దగిడఁగనీక నేపున నేపుల్ 30

క. నావంకఁ జూడు దేవర నావంకం జూడు చూడు నను నన్ననుచున్
భూవరుఁడు వినఁగ నార్చుచు వేవిధములఁగ విసిరపుడు వేఁటకు మృగయుల్ 31

గీ. భల్లములవానితగనఖ భల్లములను ఖడ్గములఁ బూని బలితంపు ఖడ్గములను
శల్యములు మాటి వేసఁ బొఱ శల్యములను ఖగములవైచి ఖగములనొగి వధించి 32

క. కయిపూని యొకఁడు కేలం బయిదుప్పటిఁ జుట్టియదరి పాటున నెదుటం
బయిఁబడు పులినోటికి నా చెయిఁ జూపి తటుకునఁ గూల్చెఁ జిల్లాణమునన్ 33

గీ. నడుచుతటి నెద్దుచాటున నతికినతికి పొదలమాటున మెల్లన బొంచిపొంచి
యాపఁడకలములుఁగున నడఁగియడఁగి కూల్చిరి మెకంబులను దుపాకుల నవైచి

ని. బల్లెమునఁ బొమ్ముపిరుదున నెల్లబొడువఁ బందికఱ వెంట నెచని యా
బల్లిమ పైఁబడనపుడతఁ డల్లాసతవంక బొడిచి యుర్విఁ గూల్చెన్ 35

వ. మఱియును 36

సీ. పొడువరా నాతాత జడియ కా పులిని నీ వడి నేఁడు గాక యెన్నఁడు దలంప
మాటరామను మడ యీ టెక్కొద్దిగఁ బంది నేటికే దాచె మాన్పుఁడు నిన్ను
వయసుకో డెవ్వసివు బయి సిమాలకు బావ చెయిచేసి యాలదుప్పి జిమ్ముకొమ్ము
పిరిఁదికిఁ బోకురా మఱఁది సింగముఁ జూచి బెదరిపాటేసనీకు బిరుదు గలదె

గీ. యనుచు నొండొరు వేలంబులాడు నటుల యెత్తి పొడుచుచు నేజాల నెత్తిపొడిచి
వసుధఁ గూల్చిరి మెకముల వట్టుగాను ధారుణీనాయకుఁడు ప్రమోదంబు నొంద 37

వ. అట్లుగాక 38

క. పాయనిబలుపు మెకంబుల, పాయనివడిఁ దఱిమి పసులపగిదిని ఱొదుటం
గోయని మెలపు మసాఁగిన, కోయనికి న్మెచ్చులిచ్చెఁ గోయనివిభుఁడున్ 39

వ. ఇవ్విధంబున మృగయుల మృగయావినోదంబునకు మోదంబు నెమ్మదిం బాదుకొనన నమ్మేదినీశ్వరుండు 40

గీ. సార్వభౌముని తలమీఁది చాయ మెలఁగు, పుండరీకాహ్వయము మీఁదఁ బూనఁ దగునె
సతతగోగణహత్యాప్రచారులైన, మారలని బెబ్బులులఁ బట్టి మెదిచె నృపుఁడు 41

చ. భుజములకాన గాధరణిబూనుట శత్రులెదుర్చ మట్టుఁబెం
గజములు రాజలందె సహకారులు వానినకారణంబ తా
రజగడమూరి చంపు నపరాధులు దండనకర్హులంచుఁ దా
గిజగిజ చేసెనార నృపకేసరి కేసరిపఙ్క్తి నెంతయున్ 42

గీ మొదలమారంశములకెల్ల ముఖ్యుఁడైన, ఘనకళానిధికొక కళంకంబుఁ జేసె
తోడుతనువీనిఁజూచె నాపోసనుమదు, హరిణవర్గంబు నపుడు గీటణఁచె నృపుఁడు 43

గీ. అపుడు పంచాస్యదైత్యసంహారి యగుచు, వసుబలసార శంబరధ్వంసియగుచు
ననుమశేషఖేలనాసక్తి నతిశయిల్లె, దర్పమేర్పడ రాజకందర్పుఁ డెసఁగి 44

వ. ఈకరణి ననేకకరిణీహరిణహరికిటిప్రముఖంబులగు మృగంబులం బరిమార్చి పురంబునకు మరలుతలంపునం బరివారంబులంగని యిట్లనియె 45

చ. అలసితిరెల్లవారలు హయవ్రజమాఁకటఁ జాలడస్సె జా
గిలములు దప్పినొందె మదికింబరితృప్తి యొనర్చె వేఁటని
ర్జనకరిస్థలంబులివి చాలును బోవుదమంచుఁ జాగన
బ్బలియుఁడు సేనలెల్ల నిరుపార్శ్వములం దనునంటి కొల్వఁగన్ 46

వ. ఇట్లు చనుచెడ 47

వనమయూరము ఒక్కయెడ నుప్పరము నొప్పగగనున్ వే
రొక్కయెడ నర్తనల నుల్లసిలు దానిం
కొక్కయెడ మారుతజవోన్నతిగఁ ద్రొక్కన్
జొక్కముగఁ దేజిపతి చొక్కితను మెచ్చెన్ 48

వ. ఇవ్విధంబున 49

ఉ. ఆయవనీశవాజి చనుదత్తటిఁ గాంచె నభోంబుధంగికీ
లాయతమానసౌకము నిజాంతరసారసగంధపాంణో

పాయసమాగతప్రమద బంభరలోకము సర్వదావర
త్తోయవరాతిరేకమత్రితోషితకోకము సత్తటాకమున్ 50

వ. కనుంగొని 51

క. అచ్చెరువునగలమహిమల, కచ్చెరువునుబొంది నిజబలావలిఁగూడన్
మెచ్చులు వెఱుఁగఁగనచ్చట. విచ్చలవిడినీరుద్రావి విశ్రుతఫణితిన్ 52

వ. ఇట్లని కొనియాడె 53

క. అమృతాంధసులసుదందఁగ, నమృతముతోఁబోరిగెల్చి యాన్వయమునక
య్యమృతచరజ్యేష్ఠునిచే నమృతాఖ్యమునిలిపి నవిగదా యీజలముల్ 54

క. అనుపమకమలాంచితమై, వనమాలికలఱుతఁదనరు వన్నియకిరవై
ఘనచక్రస్ఫురితంబై, యనిమిషకోటియును జెరువుకరుగుటయరుదే 55

వ. అని కొనియాడి తత్ప్రాంతంబునం బ్రవర్తింపుచున్నంత 56

ఉ. చాయపసిండి ఱెక్కలుపసందగుబోడు తనంబు వెన్నెల
ల్గాయుశరీరకాంతి నవకాంచనవర్ణ ముఖంబుగల్గి నా
పాయసుఖస్థితిం జికిలిబంగరుదామర గద్దెనుండఁగా
నాయెడఁ గాంచె భూపతివిహంగవతంసము రాజహంసమున్ 57

వ. కనుంగొని యిట్లనియె 58

క. మానితగతిహంసపర, ధ్యానంబిటఁ గాననయ్యెఁ దలపోసినచో
భూనుతమగుహంసపర ధ్యానంబెట్లైననగుట తథ్యంబెకదా 59

క. ఇట్టివినోదపుఁబిట్టం బట్టితగనునుతుఁబసిండి పంజరమంది
ట్టుచననియ్యాకనిపత్తి చెట్టునఁగడుఁబొంచిమెల్ల నేచనిపట్టెన్ 60

గీ. పొంచిపట్టినజెంచునఁ బొడిచిపొడిచి గొనబుఱెక్కలఁ జటపటఁగొట్టికొట్టి
పెనఁగిమూచినవిడువమిభీతిపక్షి మనుజభాషలబలికె నమ్మనుజపతికి 61

గీ. పట్టితేటికినన్ను భూపాలచంద్ర యనపరాధులపై నూరకలుగజను నె
పొలుచుననిమిత్తదండనఁ గలుపమనెడు ధర్మశాస్త్రంబొకింతైనఁదలఁపరాదె 62

ఉ. పక్షులవంటివారమని పల్కినయంతనె ప్రీతురెందుసం
రక్షకవృత్తినార్తులను రాజులయో నలసార్వభౌమప్ర

త్యక్షము సేమునక్షులము హా! వధకర్హాలమే తలఁప నీ
పక్షము గాక పైకొను విపక్షులమే మము నిగ్రహింపఁగ౯ 63

మేలు వెన్నెలనిగ్గులౌ మా మైకళల్ పగవారికీర్తులే పార్థివేంద్ర
తళ్కు బంగరురవల్లికల్ మా ఱెక్కలు వైరుల ధనములే వసుమతీశ
చూపుఁదమ్ములకేపు చూపుమా వాలముల్ రిపులచామరములే నృపవతంస
మొనసన్న పైచాయలెనయు మా చంచువులరులచే కత్తులే ధరణినాథ

అందముగ మీఱిపొదలు మామందగతులు శత్రుజాయలనడపులే జనవరేణ్య
పట్టఁగారణమేమిచే పట్టఁదగిన నన్ను వైభవదేవేంద్ర నైషధేంద్ర 64
మొదలు మీ వంశమునకెల్ల మూలమైన రాజుజహంసశార్తిఁబడఁగాచు ప్రబలమిత్రు
పేరు మోచక తిరిగెడు వారమయ్య తేరవారము గాము మీ వారమయ్య 65

హంసచయంబు పేరు వినినంతనె వేయిదు రేగి శత్రువి
ధ్వంస బహూపచారముల వారలఁదృప్తియొనర్తు నీవు నే
హంసనకానె నన్నుఁగరుణామృతదృష్టినిజూడరాదె హా
హింసకులోను గాఁదగునె యించుకయుం దయలేదె నాయెడ౯ 66

మున్న హింసాపర మోధర్మయనిపల్కు చదువులుల్లెక్కె నాసార్వభౌమ
పరికింపఁబాపాయ పరిపీడనమ్మను వచనంబుమఱచితే వధమతీశ
భువి నాత్మవత్సర్వ భూతానియనెడు పురాణమ్ము చదువవే రాజవర్య
మహిత వైఖరినధర్మాః ప్రళయంయాంత్రియను శాస్త్రమరయవేయ సమశీల
హింస సేయక పరునొంప కెందుభూత తతులఁదనయట్ల తలఁచియ ధర్మముసల
యంబు నొందక విఖ్యాతినొందవలదె నిర్మలాద్భుత సల్లాపనిషధభూప 67
మాటలేమిటికిఁకనరయో మానవేంద్ర యిన్ని భంగుల మొఱవెట్టు నన్నుఁగాచి
ప్రాణదానంబు చేసెదో పట్టిగాక ప్రాణహానియు జేసెదో పలుకుమొకటి 68
అనుదీనాలాపమ్ములు వినిమనసుచుఱుక్కుమనిన విభుఁడయ్యోయే
మినిమిత్తముపట్టితినని తనచేతన్నెమ్ముపుణికి దానినివిడిచె౯ 69
విడిచి తనపట్టుకొనుతఱిం గొట్టుకొను నప్పటినొప్పి నెప్పగిది వెతపడునోయని
యప్పక్షినూరార్చుటకు మృదుమధురవచనంబుల నిట్లనియె 70

క. చేపట్టవగదునిను నే వేపట్టితి గాని వినుము విహగోత్తమ నే
నీపట్టున నేపట్టిన బాపము మదిఁదలఁపనట్ల భయపడఁదగునే 71

క. బ్రహ్మదేవుని తేజివై పరగినావు యతుల పేరిటి పేరున నలరినావు
పాలునీరేర్పరించు నేర్పరివి నీవు నిన్ను దండింపఁజేయాడునే ఖగేంద్ర 72

క. ఈపట్టునఁబట్టితి నని నాపట్టునఁ దలపవలదు నయమెన్న మికం
బోపొమ్ము భక్తి యుంచుము మీ పరిణామములు వ్రాయుము మీ యెప్పుడైనన్ 73

క. అని తేనెలొలుకఁబలుకఁగ విని విని హితవృత్తి జాల వేఁగందుచుఁ జ
య్యన ననుకంపోన్నతి నే మని కొనియాడంగనేర్తు నని పులుఁగనియెన్ 74

ఉ. దేవ భవత్కృపామహిమ దేవతలైనఁ గణింప శక్తులే
కావున నీవు నన్నుఁ గరుణం గైకొని గాచితి పో చిత్రింకని
ట్లావిధమానతీయఁదగు నాతఁగ నేలికవైన మీరసం
ధావన తేరకానివలె నాడుదు రే నను మీ నిజాశ్రితున్ 75

ఉ. సాత్త్వికవర్య నా మొదలి జన్మము నీవటు పొంచు వేళనే
సత్త్వరవృత్తిఁ లోఁబడిన జాడ నెపోయె నిజంబు నా ద్విజ
న్మత్వము సార్థమై వెలయు మళ్ళఁగఁ బ్రాణములిచ్చి నాఁడవీ
తత్త్వము చేతఁ జూచినను దల్లిం దండ్రివి నీవ భూవరా 76

గీ. నిన్ను నేదూఱిపల్కిన నిష్ఠురముల కహహ కోపంబు వచ్చు సన్మార్గసీకైన
నెంత దాక్షిణ్యమూర్తివో యిందుకైన నీకుఁ గోపంబు లేదు గా నిషధభూప 77

క. ఇచ్చట నీ యుండటనన నిచ్చకములనేరఁగాని యీ ముచ్చట నే
నచ్చతురాననుసభలో నిచ్చలుఁ గొనియాడ నేని నీదాసుఁడనే 78

క. నేనీ దాసుఁడనగుటకు స్వామీ మీ యాడిగంబు సలిపెద దయతో
నామనవి నవధరింపుఁడు మానవపతి పతత్త్రినాథునకనయెన్ 79

వ. ఖగేంద్రా సౌందర్య విశారదుండవగు నీ వెద్దిపంచినం జేయుదు వినిపింపుమనిన నన్నృపవతంసునకు హంసవతంసమిట్లనియె. 80

సీ. జగతీశ వినవయ్య సౌభాగ్యములకు నా దేశమౌ మవిదర్భదేశము వరు
నా దేశమున ధరణ్యంగన రత్న నూపురమైన కుండిన పురము వొల్చు
నా పురంబేలుమ నతిశౌర్యమున మహా సేనుఁడౌ యా భీమసేనుఁడలరు
వా భీమసేనున కరాంగవతిపుత్త్రి శీలసుశీల నాఁజాల వెలయు

గీ. నాసుశీలయుదాను నిందాత్రిణిదేవ, నాయకుఁడువోలెతనరు భూనాయకుండు
పుత్రకులులేమిమదిఁ బుకపురనుబొక్కుచున్న నాయవసరంబుననొక్కసాధు 81

సీ. నొసలఁద్రిపుండ్రంబు భసితాంగలేపంబు పటికంపుజపమాలపల్లజడలు
దండంపుగోల కమండలంబరిగిన పావాలురుద్రాక్ష తావళములు
వెడదగడ్డంబును బడలిన దేహంబునొఱపైన పులితోలుయోగపట్టె
కటిసూత్రిబంధంబు కావికాపీనఁబు గ్రంథరహస్యముల్ కక్షపాల

గీ. కలిగిబహుశిష్యగణములు గొలిచిరాగ దానుసకలేంద్రియాటోపదమనుఁడగుట
దమనుఁడను నామమునఁ బ్రసిద్ధతవహించి యమిపులోత్తముఁడచ్చోటికరుగుదెంచె

గీ. ఇట్లువచ్చినమహాత్మునికెదురునడచి యంగనయుఁదాను సాష్టాంగమాచరించి
పేర్మిఁబూజలొనర్చిన భీముగాంచి యతివరాగ్రణి యిట్లనియానతిచ్చె 83

క. భీమనృపమీకుశుభమే నీమంత్రులకెల్లముదమె నీయాప్తులకు
క్షేమమెనీవేలెడు ధాత్రీమండలి ప్రజసుఖస్థితింగనియున్నే 84

వ. అనిన భీమసేనుండిట్లనియె 85

చ. సదమలపుణ్యనీదుదయ సంతతభోగము లెందుఁజూచినం
గొదువయొకింతలేక హితకోటులతో సుఖమొందుచున్న నా
బ్రదుకు సుధామరీచిగనుపట్టిరాత్రినిఁబోలెఁ బుత్రసం
పద గనలేని నేను దొలుబాములనోఁచిన నోములెట్టివో 86

గీ. ప్రకటసామ్రాజ్యసంపద్విభవసమృద్ధి గలిగితనయులులేని నాకలిమిఁజూడఁ
పత్రకింజల్కకిసలయప్రసవమగుచుఁ గాపుగట్టనివృక్షంబు కరణిగాదె 87

క. నాపూర్వపుణ్యవశమున నీపాదాంభోరుహములు నేఁడిటుఁగంటిన్
బాపంబులబోఁదారిచి తాపసనాథాగ్రగణ్య దయఁదలఁపగదే 88

చ. అనవుడుతేతనవ్వు వదనాంబురుహంబున నంకురింపనా
యనకరుణామృతంబు దొలుకాడెడుచూపుల భీముఁజూచియి
ట్లనుమనుజేంద్ర నీవినయమాత్మఁ బ్రసన్నతపుట్టజేసెనం
దుననిను మెచ్చితిన్ బహుసుతుల్ గలుగన్ వరమిప్పుడిచ్చితిన్ 89

క. అనియొకమంత్రముగఱపిన జననాథునకట్టిమంత్రి సామర్థ్యమునన్
ఘనులిలమదాంతుండుద మనుఁడనసుతులిద్దఱొక్క మానినిపుట్టెన్ 90

వ. అంత 91

ఉ. కంతుసమానుఁ డక్షోణికాంతుఁడు సంతతికల్మికప్పుడ
త్యంతము నాత్మసంతసము నందుచు నంతలతాంతకుంతుపూ
గొంతము నింత మీఱు నళికుంతలికిం దమయంతి యంచుఁ బే
రెంతయు వేడ్కతో నిడి యహీనసుఖస్థితిఁ గాంచె నెంచఁగన్ 92

వ. ఆదమయంతి యపూర్వలావణ్యాగణ్యయు ననంగశరణ్యయు నై యలరు నయ్యలరు
బోఁణి సౌందర్యరేఖావిశేషంబు వర్ణింప శేషభాషాధిపుల కలవి గాదనిన నేనెన్న
దననిసనగరే యయినను నా నేర్చునట్లు వివరించెద నాకర్ణింపుము 93

చ. నెలనలయించు నెమ్మొగము నీడలఁ జూడఁగవచ్చు చెక్కులుం
గలువలు గుల్కుచూపులును గారు మెఱుంగుల నీను మేను వె
న్నెలఁ దులకించు లేనగవు నీలపురాల నదల్చు వేణి కో
కిలముల నేలు పల్కు కరిగేసు నడల్గను పట్టె బాలకున్ 94

ఉ. బిత్తరికూన రాఁజిలుక పిల్లమెఱుంగుల కుప్పలిద్దపుం
బుత్తడి నక్కవెన్నెలల పొంగలి చక్కెరబొమ్మ మేలిను
న్మత్తెపుఁగోవ కమ్మవిరిముల్కి యొయ్యారి యనంగ నొప్పన
మ్మత్తగజేంద్రయాన యసమానవిలాసవికాసవైఖరిన్ 95

చ. మదనుఁడు బాల్యమందె సుకుమారత మీఱిన దాని మేని చ
క్కఁదనము చూచి నాకుఁ ద్రిజగంబులు గెల్వఁగ దాపుగల్గెఁ బో
యిదిమదికింపు మీఱ వయ సెన్నఁడు పైకొను దీనికంచుఁ దా
నెదురెదురట్ల చూచుతతి నింతికి నంకురమయ్యెఁ బ్రాయమున్ 96

క. చిగురొత్తు వనుంగవ మెఱుఁ గిగురుచు చెక్కులు నెకించుకేర్పడు వళులున్
దగుసిగ్గు మొగము లేఁబిరు దొగిముడికందని కురుల్ తలోదరి కమరెన్ 97

చ. పరువము చూపునట్లుకను పట్టెను బాలకురోమరాజిపై
మురిపెము కెంతగప్పె కర మూలరుచుల్ జిగిమించెఁ దమ్మి క్రొ
వ్విరి నెఱిగమ్మదావి పరిభవించెఁ దనూలత క్రొత్త నిచ్చలుం
బెఱుఁగుచు నేపుచూపెఁ గటిబింబము సిబ్బెపుగప్పి చన్నులున్ 98

క. వలరాయఁడు దండువిడియొ గలపైఁ జననెత్తు నీలి గొల్లెనయానఁగాఁ
జెలికొప్పు కొప్పు దానం బొలిచిన బోదియలనంగ ముంగురులమరున్ 99

గీ. అంగజుఁడు పాంథతతి సేయు నర్ధచంద్ర బాణములు సింగిణికి డాయఁ బట్టెననఁగ
విలసితం బైన ఫాలంబు చెలువుమిగుల బొమలుగనుపట్టె నంత నాకమలముఖికి 100

ఉ. కొమ్మ చకోరకాలలిత కోమల నేత్రవిలాసరక్తి కిం
దమ్ములు గాను కంజములు తామరతంపర సుందరేఁ గాక యా
యమ్మకటాక్షమందు బగలైకలువల్కుముడంబులయ్యెనై
రమ్మదులుంజయించు నెథగన్ దముఁ బోల్పఁగ నక్షిక్రియన్ 101

గీ. అనుజుఁడు త్రిలోకములు గెల్చు నటు లకమల మొనరి చెలదేంట్లు సారంబుగొనక యుండ
ధాతసంపెంగపువ్వు పైఁ బాసెననఁగ వెలది నెమ్మోము నాసయొప్పు వింతమీఱ 102

క. లీలన్ మరువిజయయశశ్శ్రీలుందమచెలువుఁ జూడఁ జేర్చినశోభా
లాలితదర్పణయుగమన బాలికవీనులుగ పోలపాలికలమరున్ 103

గీ. అలరువిలుతుండు దనమావులైన కలికి చిలుకలను వజ్రములఁ గూడ నిలిపి దాని
దండ మేఁతకు నిడు దొండపండనంగ పలుకులను దంతములు మోవి బాలకమరె 104

గీ. అమరభోగ్యసుధోపమంబయిన మోవి కక్కటా యెట్లు పోటి సేయంగ వచ్చు
నీలమాలిన్యులైన చండాలులకును భోజనాస్పదమైనట్టి పుప్పగసము 105

క. పంకజదళలోచన మెడ పొంకమ్మును దేహగంధమును బొదలుచుని
శ్శంకగ త్రినపహసించును సంకుమదంబున్పసాళిసంకుమదంబున్ 106

క. తరుణికరమూలములతో బురుడనుచుఁ దమోభుజంగభోగోన్నతి నే
కరణిన్ బోల్పఁగవచ్చును ధరనదిరవికందుసూర్మి దవిలి మెలఁగునే 107

గీ. అంబుజములిందిరకు నెలవగుటఁ దద్బిసములు చెలిబాహువులతోడ సాటివచ్చు
గాక మధుయుక్తి జడజాతికునలతికలు పాటిగా నేర్చునే యెట్టిపగిదినైన 108

గీ. అనిశము భుజంగసంగతంబగుచునుండు మొగలిరేకులనీకుండు మున్నె రోసి
వాని నేరీతిఁ బోల్పంగవచ్చు విమల శీలయైనట్టిసతినఖశ్రేణితోడ 109

క. నీలకచ గబ్బిసిబ్బెపు బాలిఁ డ్గ్లసనోడి జాలిఁ బడి గడు దిరుగన్
జాలగతి మాలుచుండును పోలుపగను బొమ్మగములు భూధరతతియున్ 110

క. బంగారుబొమ్మ యగు న య్యంగన ముత్తరులకెగిరి యావనిదరంగల్
భంగపడి పోవఁగాగద భంగములని పేరువడుట పరికింపంగన్ 111

క. ఆనభమ్ము ఘనసహోయత బూనుట విష్ణుపదమగుటఁ బోల్చిన నయమౌ
కానను దిరిగెడు సింగము లానవలాకొనుసాటె యనఁదగవగునే 112

గీ. కలికిపొక్కిలిచెంగల్వకొలను వెడలి వలుదచనుఁగవతమ్మిమొగ్గలనుగదియ
లీలమైవచ్చుమొలదేఁటి చాలనంగ చామకెంతయుఁగనుపట్టె రోమరాజి 114

గీ. తరుణిగంభీరనాభివివరముతోడ ననిశపవమధ్యమపరివర్తనమొనర్చు
నట్టియావర్తమే యనయనివబరిత్య వాయుదోషంబుచేతను వరదబోదె 115

క. మారుఁడవశ్యంపితాంత్రి చారమనా దెలిసితండ్రి చందంబునఁదా
నారయ వేసుకఁబూనుట కైరూఢిఁగచించుచక్రి మనఁబిరుఁదమరున్ 115

* * * * * * * 116

గీ. పంచశరుఁడునిజాంత్రికప్రాంతభూమి విలసదుద్యానవాటికావీథులంచు
సరసగతిఁబెంచుకదళికాతరువులనఁగ నంబుజాననయూరువులతిశయిల్లె 117

మ. త్రిజగన్మోహినియైన యచ్చెలువయొంతేవింతనట్లుండది
గ్విజయార్థంబుగఁబోవువాఁడనుచుం గీర్వాణరాజైనయం
గజుఁడుంబల్లనగట్టి రెండుగడలుంగన్పట్టగానిల్వన
క్కజమొందన్నముకూర్చునట్టి శరధుల్ గాఁబోలుఁదజ్జంఘికల్ 118

గీ. భావజుఁడుతన్ను గెల్పించుదేవుఁడంచు బాలపాదమ్ములకుఁ గాన్కఁబెట్టెఁబెట్టి
బటుప్రమిూజీనపికిరిపూఁబంతులనఁగ మడిమలెంతయుఁగనుపట్టెమానవేంద్ర 119

చ. అనుజునిచేతఁబట్టువడునంచుఁ గుబేరునిపీడుమిత్రివ
ర్ధనమొకనాఁటి కేననిరసాతలముస్వీడనాఁడియుండమీ
ఘనకచదండనంచుఁ దజగచ్ఛపమాదిమకూర్మముంబలం
బునఁజెలువొందఁగములఁ బూనెననందగుబాదపీఠముల్ 120

క. కావున 121

ఉ. ఆదమయంతిసాటికిత రాంగనలెచ్చటనెన్న లేరునీ
పాదములానయిందులకు బాసలుసేయగవచ్చుశత్రురా
ట్సూదన నేమమున్ దిరిగి చూడనిలోకములెందులేవు బ్ర
హ్మాదులకైనదానిఁగనినంతనె యూటలూగుభాగ్యముల్ 122

గీ. దానిఁజూచినకన్నులుమానవేంద్ర యితరకాంతలఁజూడంగ నేవగించు
నట్టిసౌభాగ్యవతినిఁజేపట్టితేని నీకుసాటెన్నఁగలరె ముల్లోకములను 123

వ. అనిపల్కు రాఘవంబు పల్కులు వినినంతనంతని శాత్యుత్తిపచేకుఁదనంబు సాక్షాత్క
రించిన చందంబున దెందంబునఁ బొదుకొన విభ్రమంబునం జిత్తంబుఁ దదీయాత్తం
బుఁగావించి నిశ్చేష్టితుండై యూరకున్నం జూచి ఖేచరం బిట్లనియె 124

ఉ. వెన్నెలచందమామకును వెన్నెలకుం దగఁ జందమామయున్
సన్నుతలీలసంపమగు చందమునన్ ధరణీతలేశయ
కన్నియ నీకు వేడ్కనల కన్నియ కీవును జోడుగూడ నేఁ
గన్నులఁ జూతు నే మొయిని కాంతు యొనర్చెద నెమ్మనంబునన్ 126

వ. కావున మహాత్మా! నీయనుగ్రహంబు గలిగెనేని యక్కన్నియ నీవు దేవియగున
ట్లుగా నిక్కార్యంబు అనుసంధానంబు సేయు నావలన నేర్పుగలదు. మీతలంపు నాకు
దాఁచక తెలుపవలయు ననిన దేవఖగంబునకు నలుం డిట్లనియె 126

ఉ. హంసవతంసప్రాణపదమైత్రివి నీవిట నాకు నాధివి
ధ్వంసివి యైన నీ మొదను దాఁపరమేల తదంగనాకులో
త్తంసము నీవు పేరుకొనఁ దత్తణమాత్రిఁ గలంచెఁ బో జగ
త్త్రాసితమామకీనసుస్థైర్యపయోధిఁ బయోజబాణుఁడున్ 127

క. అతులప్రతాపమునుబొం దితినా దిగ్విజయమునకు దేవఖగేంద్రా
యతులప్రతాపమునుబొం దితినిత్తఱిఁ బంచశరుని దిగ్విజయమునన్ 128

చ. అతులవియోగసాగరము నందు మునుంగుచు నున్న నన్ను నే
గతి దరిఁజేర్చెదో శుభదకారణ నాకిపుడీవు చిక్కి నీ
చతురవచోవిలాసనయ సంపదచే విడిపించుకొంటివ
ట్లు తమని చేత జిక్కువడినట్టి ననన్ గుణించి కావవే 129

గీ. మానిజాన్వయమున కాధ్యుఁడైన చంద్ర మామ యేనూర్మిదో నాడి ముమ్మఁ బ్రేల్చ
బలము లేకున్న వేళల బంధుజనులు మిగులఁ బగవారలౌదురు ఖగవరేణ్య 130

సీ. తోఁబుట్టినతనిఁ గూఁతును జూచి కంతునకై మ్రొక్కించిన పాపిగాఁడె
పెదతండ్రి వలముని ప్రియకునయి ప్రతిభ్రష్టుఁ జేసినట్టి నష్టుండుగాఁడె
నైనరువోఁ దనుఁదపోనిష్ఠ మాలించిన బోటిమరుల్గొల్పు చేటిగాఁడె
మేనమామను జలంబాని పైకొని గురుద్రోహిగాఁ జేసిన దష్టుగాఁడె
గీ. భువనకర్తలు నెత్తుపుఁబొత్తువార లట్టివారలకెరోయఁ డట్టి మగుఁడు
నన్ను వెతఁబొందఁ జేయుచుండంగఁ గలఁడే యెట్లు గానున్నదో కార్యవిహారేశ్వరాఖ్య 132

గీ. ఏటికిచ్చెఁబడసెదో హేమపుత్త్రి యేమిగానున్న వాఁడనో కాముచేత
జగతి నాలస్యమమృతంబు విషంబనంగ నీతివిన్నాఁడవే కదా నీడజేంద్ర 132

వ. అనిన నమ్మానవేంద్రుని వచనంబులువిని 133

క. నెన్నఁగ వలవదు నృపనీ విన్నిధి నైన్యోక్తు లానతీయఁగ నేలా
సున్నవి నంతనె తెలియదె యివ్వేళ నడచి కార్యమే నీడేర్తున్ 134

వ. పోయివచ్చెదనని విహంగవతంసంబు సహచరులగు హంసలు తనవెంటనంట రాజ
నిమొనయ్యవసరంబున 135

సీ. కుడిభాగముననుండి యెడమదిక్కునకేగె పాలతోఁ జెనగూడి పక్షిరాజు
కసరుదోర్లగనీక కలకలమనినిల్చి పైనార్చి రెప్పను పయిఁడికఁటి
కనుపట్టి పక్షిణాంగవిచేష్టఁబోతు చెదరకింటికిని జేరసరిగముంగి
తనవునందుననుండి తగఁబెక్కుమునుగౌళి నక్కఁడెద్దుమువచ్చి నిక్కచూచె

గీ. నట్టిసంధశకునములతోఁ హంసమరిగి శైలములుదాటి సకలదేశములుగడచి
నడిచిమణిభర్మహర్మ్యవర్ణనలమేరు గిరిరుచులమీఱు కుండినపురముగాంచె 136

వ. ఆయ్యవసరంబున దమయంతి దమయంతికంబున జనకునిసన్నిధింగాయక సంవో
హంబులవలన నలరూపలావణ్య భోగభాగ్యాతిరేక వర్ణనాసమేతంబులగు గీతంబు
లువినివిని శితస్మరశర విషాదాయమానమానసయై యన్నిషధనాయకుండు దనకా
త్మనాయకుండుగా భావినాయకుండు దలంచునో యనుచు నెక్కింతచింతా
క్రాంతయయి గాంతలుండాను నుద్యానాంతంబునం జరింతమని యచ్చటంజేరి వి
హరించుచుండెనంత నమ్మానసౌకంబు మానసౌత్సుక్యంబునం గదియ నేతెంచి 137

మ. కనియెంగంబువిలాసభాసుర గళంగామాశుగశ్రీవిలో
కనగంజాతనిభాస్యఁగంధర కచన్నంతీర వేందావల
గ్న నుగాళిన్యకుచన్నరీంద్రగమన న్నరూపారగంధిన్నవ
త్కనకాంగిన్నలకంతకంతిఁ గద్యకాంతోరు కాంతామణిన్ 138

వ. ఇట్లుకాంచి 139

శా. ఆచ్ఛేఁబక్షిశతంబుతో నిలుచరాయంచన్నిరీక్షించియిం
పెచ్చన్భీమసుతాసఖీజనములా హేమాభ్రగవ్రాతము
న్నిచ్చంగేలినరఃక్షితిన్ని లుపుఁ బూన్కింబట్టఁగాఁబాలుచో
విచ్చెన్మెగ్గవిరారిమొగ్గయనుచున్ వేపాటినల్దిక్కులన్ 140

వ. ఇట్లు వియచ్చరంబుల దమవచ్చినకార్యంబున కనుకూలంబుగా నచ్చటనిచ్చటనా
నోఁటవారితో నద్దమయంత్రి గొంతదడవునెమకి కానలేకపోయెననుచుఁ బెనుచు
తమకంబున నచ్చెలులకిట్లనియె 141

క. సురఖగములిచ్చటికిభా సురగతివచ్చిననునుఱక చూడకయిపుడీ
కరణినిదరిమితిరయ్యో సిరిసింగనవత్తిఁజేయఁ జెల్లునె మీకున్ 142

వ. అనికనలి పల్కునక్కలికి పల్కులకుల్కి యచ్చరలుబోని యచ్చెలులెప్పటివలెనె
చ్చటివారలచ్చట నావియచ్చరంబులమీఁద మచ్చికలనెమకంజనిరి. అంతనద్దమ
యంతి యంతగొంతదడవు వనాంతంబున వెదకుచున్నంత నిక్కాంత నేకాంతం
బునకిడివెదనని భూకాంతదూతయగు విసేత దత్కాంతిసస్తనవినిర్జిత భిదురయెదెరం
గనుపట్టినం దొట్టినముదంబున నజ్జ్యనయ్యువతి పట్టినఁబట్టుపడి దిట్టయగు లవ్వే
లుపుం బిట్టుయిట్లనియె 143

శా. రామాత్రిమ్మటచేతడస్సితివి యీరామావనింజానవే
లామమ్మంటఁగమిమ్ముఁబోట్లను దరంబాయెట్లు నీముద్రికా
శ్రీమాహాత్మ్యముజూడ గావలయుఁ గోర్కెన్ జేరితింగాకనీ
కామేమభ్రపదప్రచారములు చిక్కంజూచుటల్ కోమలీ 144

ఉ. రాజనిభాస్య! ముద్విహగ రత్నము నెవ్వనిఁగాఁదలంచితో
యాజలరాశిభూమి వలయావనపాలనఖేలనోల్లస
ద్రాజకిరీటసంఘటితరత్న వినిర్గతదివ్యకాంతనీ
రాజితపాదుఁడైననలరాజు హితుండఁజుమీ తలంపఁగన్ 145

క. అనలునిమహిమలెన్నఁగ నానలువకుఁదరమె యమ్మహారాజుప్రతా
పానలుఁడేర్పఁగదాతన యానలుథరమీఱుశాత్రవాటవినెందున్ 146

ఉ. మించినభాగ్యవంతుఁడని మేరువుదారొకకొండఁజేసివ
ర్ణించుటగాక యాపలుకు నిక్కమె మోపగునట్టివేళనె
క్కించుకవమ్మ పాటొదవెనిస్సిరొయంచు వసించునిర్మలో
దంచితభాగ్యవంతుఁడు నవిక్రమవిక్రముఁడౌనలుండిలన్ 147

చ. పరులవడంకఁజేయుచు నపారసమున్నతభూతిసారబం
ధురతనగేశుఁడైమహిమతోఁ జెలువొందుచుసర్వమంగళా
కరనిజదివ్యదేహుఁడనఁ గారహిమించుచుగహ్వరస్థితిం
బరగుచునొప్పెభాగ్యగుణభాసురలీలహిమాద్రియోయనన్ 148

చ. అతులవిలాసరూపవిభ వాంచితు నన్నలుఁ జూచి సిగ్గుచే
నతనుఁడు మేనుపీడుకొనె నల్లజయంతుఁడు జాలిచేన నా
రతము నుగంటి కిన్నిదురరాక చరింపుచు నుండు నన్నచో
నితరులు నమ్మహాత్మునకు నీడని చెప్పఁగవచ్చునే సఖీ 149

చ. రమణులు చూచి వానిపయిఁ ద్రాలినచిత్తముఁ ద్రిప్పలేక వి
భ్రమముసు బొంద వారినిజభర్తలఁ బొందుచుఁ దద్విచేష్టవ
క్రమములనుబ్బుకొంచుఁ దమగాఢరతిక్రియ జాలపారవ
శ్యముగ నిరంతరంబు గాని నిజమవ్విధ మారయ నేరరేమనన్ 150

ఉ. మూఁడుజగంబులందు నవమోహనరాజకుమారులందు నేఁ
జూడని వాఁడు లేఁ డొకఁడు శుద్ధకళాపరిపూర్ణతం ద్రిలో
కేడితరూపసంపదల నెన్నఁగ నందొకఁ డైనఁ బోలఁడో
చేడియ! యా నృపాలకుల శేఖరుఁ డౌ నలు కాలిగోరునన్ 151

ఉ. అంచితరూపసంపదల నాయన కందగు పెండ్లికూతునుం
గాంచెదనంచు నేఁ జని జగత్త్రయమందుఁ జరించి చూచియో
కాంచనదేహ! సాటియగు కన్నియఁ గానక త్రిమ్మరంగ నేఁ
డించుక నిన్నుఁ జూడ మది నింపు ఘటించిన డాయవచ్చితిన్ 152

శా. ఆరాజోత్తము నొందలేని బ్రదుకేలా బాల! వేత్తావిచే
కూరంజాలని పువ్వునవ్వులలరం గోర్కెం దనుం జూచుచో
నూరించున్ సతి నెట్టిదైన నతఁడో హో! పోటి నీవంటి కాం
తారత్నంబున కిట్టిభర్త గలుగం దద్వ్యస్థితిం జెందదే 153

ఉ. ఓ దమయంతి సంతతసముజ్జ్వలసుందరుఁ డమ్మహీశుఁ డి
మ్మేదిని నిన్నుఁ జూచినను మెచ్చునె మెచ్చఁడొ కాని మెచ్చినా
నీదగు భాగ్యరేఖ కెన నేఁ డిక లేదని చెప్ప నేర్తు నా
హా! దివిజేంద్రరాణికి సుమా యుఘ దేవియా నీకు సాటియే 154

గీ. ఇంతపర్యంత మతఁడు నే నెన్ను మాట లాదరించుట కాని ఘోటనాథుఁ డెందు
మావలన నిట్టిపను లెన్ని కావు చెలియ నీమనఁ బెంపున కేమనిన్నయింతు 155

శా. వాచానర్గళచాతురీ విరచనావాచస్పతిం బుప్పనా
రాచగంధరహస్యమంత్రపఠనప్రావీణ్యుఁ డన్ సర్వలో

కాచార్యాధిక భారతీరమణ వాహశ్రేష్ఠుఁడన్ గావున
న్నా చేఁగానిది మెచ్చి పంచిపని గొన్నం జేయుఁడన్ గోమలీ॥ 156

ఎప్పుడు రాజపుత్త్రికల యిండ్లకు నే కాని మెలఁగ, వారలున్
జెప్పెడి గూఢకృత్యములఁ జేకుఱఁ జేయుదుఁ జేసి వారిచే
మెప్పులు గొందు, నెందునను మించఁగ మన్న నఁ గూర్చి గోప్యముల్
సెప్పవు కాని దాఁపరము సేయరు నా యెడఁ గూర్మి యెట్టిదో. 157

అనిపలికిన నచ్చిలుకలకొల్కి నలు పైఁగలుగు మరులు తనమురిపంబెఱుకపఱుప న
గ్గలికయగు సిగ్గునం బలుకకున్న నగ్గజగమనం గాంచి వెండియు నిట్లనియె. 158

మనసులో విచారము
గామిని నా యెడ నుడాఁచఁ గారణ మేమీ
మాట వెలియకుండిన
నో ముందరి కార్యమెట్లు చొప్పడు మాకున్. 159

అని చతుర్వదన వాహన శ్రేష్ఠంబు దన చతురవచన రచనాగరిష్ఠత్వంబునం బలు
ప పలుకులు, నచ్చిలుకలకొలికియగు కలికి మదనసూన శరాఘాత సంభూత సం
తాప నివారణ కారణంబులగు కప్పురంపుఁ బలుకులుగాఁ దన చెవులం గూడి కోరిక
రిక లెత్త న త్తపస్వి నామధేయున కిట్లనియె. 160

హంసా! సంతాపతమో
హంసా విమలప్రశంస యాత్మాపద్వి
ధ్వంసా శాంతగుణాకర
హంసా నినుఁ బొగడ నేర్తు నా వివతంసా. 161

సీ. నీకిపుడేమని చెప్పుదు మన్మథనిస్తులశస్త్రి పరంపరలన్
దూకొని పైకొని దుస్సహమైమది దొట్టిమహావ్యథ సేయఁగ నో
నాకఖగేంద్ర యిటుం జరియించఁగ నన్ను గృతార్థగఁ జేయుటకై
యీకడ నిత్తఱి నీవరుదెంచితి వేగతి బ్రోచెదవో యెఱుఁగన్. 162

య్య! మాయయ్యసజ్జగాయకులవలన
లునిచారిత్రములు విని నాఁటనుండి
న్న రానిమనోవ్యథ నున్నఁ జూచి
చ్చెలులు నన్నుఁ దోడ్కొని వచ్చిరిటకు. 163

గీ. నీవు నలునికడకు నేఁడేగి నీయుక్తి
ననుసరించు నేర్పుఁ గనుము వేగ
యకట ! నూఱుకల్లలాడైన నొక పెండ్లి
సేయవలయునని వచింపవినవె. 164

వ. అనిన విని. 165

క. సుకరముగ నాదుమది పూ
నిక దగ నీడేర నెనుచు నేర్పున నబ్బా
లిక మాట గట్టిపఱచుట
కొక బుద్ధిం దలఁచి ఖగకులోత్తముఁ డనియెన్. 166

మ. వనితా యిప్పుడిటాడినాఁడిటులు వోవంజూతువో యిట్టి పా
ట్లను నేఁబూనఁగ నీతియే మొగులు ముట్టన్ రాగముల్ చేసి యె
వ్వని నోపాడినయట్లు చేయుదుర వోవామాక్షులన్నమ్మఁ బో
లునె మాబోంట్లకు రాజకార్యఘటనా లోలాత్ములౌ వారికిన్. 167

శా. ఓబాలామణి దీనికెంతపనిగా నూహించితీ వంటివా
స్త్రీబుద్ధిః ప్రళయాంతకంబనఁగ సారెన్ వింటఁ బ్రేమన్మదీ
యాబోధక్రియ బూను రాజు నెడ కార్యభ్రష్టుఁడై పోయి న
న్నాబై సేమగుఁ జూడుమా సరులు విన్నన్ గన్నఁ జీకొట్టరే. 168

వ. కావున. 169

క. ఇటువంటి పనులకొడఁబడి
కుటిలాలక మాకు నడపఁ గూడునె వేఱొ
క్కటి చెప్పితేని నే నె
క్కటి నది సమకూర్తు నెట్టికార్యంబైనన్. 170

వ. అదియునుంగాక నీవు పితృసమాధీనవు స్వతంత్రవ్యవహారంబున మెలంగు విచారంబు నంపఁబంధంబుగా దిన్నియు నెఱిఁగి యిట్టి యెబ్బెట్టు కార్యంబునకే నెట్లొడంబడుదు ననిన నయ్యింతి చింతాకులస్వాంతయై యొక్కింతిదడవు తలపోసి యద్దిట్టపిట్ట కిట్లనియె. 171

చ. మనమున నీకులేని యనుమానము లేటికి మాటికిట్లు నే
ననిశము నైషధేంద్రు నెడ నాత్మదగుల్చితె కాని యన్యునె

వ్వనివరియింపఁగోరెఁ బెఱవారలు నాకు సహోదరుల్ సువ
ర్తనతఁ బ్రసిద్ధిగాంచు ననుధర్షిణి నాడిన యట్టులందురే. 172

క. మృషవలుక తల్లిదండ్రులు
నిషధేశునకీయ కన్యనికి నీదలఁపన్
విషముఁగొని యైనలేదా
విషమునఁబడి యైన మేను విడుతు ఖగేంద్రా 173

ఉ. పంచశిలీముఖుండు సమబాణపరంపర నించి మించి గా
రించఁగ మేనఁ బ్రాణము గుదించఁగ శక్యమె నీవు వేగ మే
లెంచి పరోపకారము వహించి మహీశ్వరు నైషధేంద్రు ర
ప్పించు శుభస్య శీఘ్రమని పెద్దలు చెప్పఁగ విందువే కదా. 174

క. జాలపదోత్తమ నీవా
గ్జాలస్థితి మీఱ నిషధ జననాథు మనం
బేలాగునఁ బురికొలిపెదొ
నాలాగె ఱెఁగితిగదా జనస్తుతమత్రియున్. 175

చ. భారతివాక్సుధారసము పైఁగలమీఁగడ నీదు దేహమా
వారిజగర్భ సన్మధుర వాక్యములందలి మేలి తేటలే
కూరిచి నేర్చిపాత్రిగతి గోరి మహిం జరియించు నీకునున్
నేయపు నేరముల్ గలవె నీడజవంశ పయోధిచంద్రమా. 176

వ. అనిన ఖగవరుండు చిఱునగవు మొగంబున నిగుడ నమ్ముగుదకిట్లనియె. 177

ఉ. ఇట్టనరాదుగాని విభుఁడెల్లిట నేఁడిట నీకుఁ దాళిదాఁ
గట్టుఁగదమ్మ యింతపనిగా నొనగూర్చితి నేని నన్నుఁ జే
పట్టుఁగదమ్మ యమ్మరుని పట్టిఁ కరట్టు గదమ్మ వానికిం
గట్టుఁగదమ్మ బొమ్మయిది గట్టిగ నమ్మఁగదమ్మ మానినీ. 178

చ. అక్కఱమీఱ నీరమణుఁ డర్మిలి గౌఁగిట చేర్చి చెక్కిటం
జెక్కిలి మోపి వేడుకలు చెందఁగఁ బొందఁగ నీవు భర్త మే
ల్చక్కెర మోవి విందుగొని సంతసమందిన నాఁటి కేనియుం
జక్కెర విందు మాకులము సాములకెల్లను జేయు మీ సతీ. 179

చేడియ నీవుపతిన్ రతి

గూడియుపరిసురతలీల గౌతుకాంబుధినో
లాడుచు వేడుకనుండెదు
నాఁడైనా నీదుమదిని ననుఁదలఁచెదవే. 180

వ. అని సరసోక్తులం బలుకునంత నయ్యింతి సానుచరులగు నరాళకుంతలాశతంబు మ
రాళశకుంత శతంబుగాని యింత నంతం జేరం జనుదేరవారలం జూచి ఖేచరశ్రే
ష్ఠుండో చెలువ నీచెలులు వచ్చిరింక నేఁబోయివచ్చెద నీవు సంకల్పసిద్ధియగునని
దీవించి కాంచనపత్త్రపుంగవుఁడు మరలినంగని తక్కినహంసంబులు కమలంబులఁ
బోని యప్పల్లవపాణుల పాణితలంబులు చంచుపుటంబులం బొడిచిన నప్పడతుకల
దరిపడుచు విడిచిన నవి నిజకులస్వామియగు నతనిం జేర నరుగుదేర హంసశత స
మావృతుండై హంసకులోత్తంసుండు నిషధ దేశాభిముఖుండై చనిచని యంతంద
టాకవనాంతంబునం గాంతావియోగ చింతాతురస్వాంతంబున నిశాకాంతాకాం
త కాంతాసనాసీనుండై తనరాక కెదురుచూచుచున్న భూకాంతునకు తన పో
యిన కార్యసిద్ధియగుట ముఖవిలాసలక్షణంబులం దెలుపుచు నక్కలికి కలికిపలు
కులను కపురంబు పలుకులు మదనతాపంబున శోషించుచున్న యతని శ్రవణపు
టంబులం బొరసూప నుద్యోగించునదియునుంబోలెఁ జయ్యన నయ్యవనీశ్వరుని భు
జంబుమీఁద వ్రాలి. 181

క. ఆచెలితోఁ దానాడిన
వాచాచాతుర్యములను వనితప్రీతినయుక్తిన్
మాచాదప్పక విభునకు
గోచరముగ దెల్పెఁబూస గ్రుచ్చినరీతిన్. 182

వ. ఇట్లు శకుంతవల్లభుండు దమయంతి వృత్తాంతంబంతయుఁ దెలిపిన సంతోషితస్వాం
తుండై భూకాంతుండిట్లనియె. 183

క. పులుఁగా నీవింతటి నే
ర్పులుగా మాకజుఁడొసఁగ బుద్ధులుకదు జా
పులుగా నీమాటలు తీ
పులుగా శర్కరలతీవి భువినింపులుగా. 184

గీ. దర్పకకృతాసమానని తాంతతాప
ఘనతరార్ణవమునఁ గూలి మునిఁగియున్న

నన్నుఁ దరిఁ జేర్చి దయఁ బ్రోవ నావ వైతి
వెంతవాఁడవు నీవు ప క్షీంద్ర చంద్ర. 185

క. ప్రేరణ చేసితి ప్రోచిత
కారణసుకృతివిగదా జగన్నుత తాపో
త్తారణ కారణ నీఋణ
మేరీతిం దీర్పనేర్తు నెన్నఁటికైనన్. 186

ఉ. ఏమనెనిన్నుఁ జూచు నపుడేమనె నాదు పరిచార మెన్నచో
నేమనె నీవు వచ్చుతఱి నేమనె నేమనె నంచునంచుతోఁ
గామవికారచేష్టలు పరికాశము గా నవివేకిరీతిన
భ్రాంతిధరుండు పల్కె మతిఁ బూని నతద్విరహార్తి యెట్టిదో 187

వ. ఇవ్విధంబునఁ బల్కు నలక్షితీశ్వరు డెందంబు తన యమందకచో బృంద నిష్యంద మధు బిందు సందోహంబులం బొందుపఱచి బృందారక విహంగమం బయ్యా! మదీయస్థానంబు నెడసి వచ్చి తద్దయుం బ్రొద్దయ్యె, వేలుపుం జెద్దయ్య యెద్దం దద్దయుం బ్రొద్దుపుచ్చు విద్యావిలాస సల్లాసంబు చూపుటకుఁ దరతీపయ్యెడుఁ జయ్యనం బోయెద నేనీవు నభీష్టఫలసిద్ధియు, నాయురభివృద్ధియు, నతులైశ్వర్య సమృద్ధియు నయ్యెడుం గాతమని దీవించి యవ్విరించి వాహనవతంసంబగు హంసంబు హంసానీకంబుతో బ్రహ్మలోకంబునకుం జనియె. నమ్మనుజనాథుండు నిజనగ రంబునుం జేర నరుగుదెంచిన 188

లయగ్రాహి- అంతఁగనుపట్టెను వసంతము విలాసిత వనాంతము సముద్ధిత లతాంతము దిగ్లోకా
క్రాంతము ప్రమోదిత శకుంతము వికాసిత దిగంతము వియోగి భయవంతము నగశ్రీ
మంతము మహోత్సవ నిశాంతము చరన్మనుపకాంతము లసత్సురభి కాంతము వినోదా
సంతము కనన్మదన సంతము మునివ్రతనికృంతము ప్రతిష్ఠితి నితాంతము లవింతన్

వ. అయ్యవసరంబున

గీ. తనదళంబుల శిశిరర్తు వనజమిత్రుఁ
జేక హేళిగ దులిచి చీకాకుపఱుప
కొమ్మలును దాను నిజవృత్తి గుఱుతుపఱచ

వృక్షరాజాళివనవాస విధివహించె — 191

క. అంతఁద్రుమమాధవుం డొ
క్కింతకటాక్షింపసిరుల నిగురొత్తుతఱిన్
వింతగఁ గొమ్మలుపూనిన
సంతతభూషాప్రవాళ జాలములనురెన్ — 192

క. చెలువగుకోరకములచే
నలవడిసాలంబులమరె నలమాధవురా
కలకలరి వనరమాసతి
దలముగముత్యాలసరులు దాల్చెననంగన్ — 193

గీ. తనదుకూర్మిసఖుండైన దర్పకునకు
నస్త్రములొనర్చు నసిధావకాళియనుచుఁ
గరము మెచ్చివసంతుండు గప్పినట్టి
పచ్చడంబులతో నొప్పెఁ బాదపములు — 194

సీ. చెలువుమైఁగనుపట్టు చిగురుటాకులతీరు హాలాహలానల జ్వాలగాఁగ
మన్వంపునెత్తావి పువ్వుగుత్తులసౌరు పంకజారాతి బింబంబుగాఁగ
జోరునఁగారెడు సోనతేనియజాలు పసమించునవసుధారసముగాఁగఁ
జూడనందములయిన సోగతీఁగలబారు సారసాలయవిలాసంబుగాఁగ

గీ. నపుడుగనిపించెవనరాశి హరిహయుండు
సర్వదానవఖేచర సమితితోడ
నచటవైశాఖమునుబూని యతులలీల
మాధవస్వామిదాపుగా మలసితరువ — 195

చ. చిగురులచాలుడాలు పెనుచిచ్చుఅకన్నుగఁ బువ్వురాశియు
త్తొగ చెలికానిబాగులుగఁ దోరపుఁదీవెలు పాఁపపేరులై
తగ నెలదేఁటిపిండు మెడదాల్చినకప్పుగ నీశుపోల్కెఁ బెం
పగువనరాశిమాధవ సమాగమలీల వహించెభూస్థలిన్ — 196

సీ. శుకమనోరంజిత శుభదవైఖరిచేత నీలకంఠప్రియ నియతిచేత
నసమానవనమాలికాద్యలంకృతిచేత విమలహంసావన విహృతిచేత
సకలఖేచరబృంద సన్నుతస్థితిచేత సర్వాగమవిహార సరణిచేత

సారంగరక్షణ సత్కృపారతిచేతఁ గమలాంబికామోద గరిమచేత

గీ. విహితగురుబుధసన్మాన మహిమచేత
సూరిజనగేయపల్లవ స్ఫురణచేత
ఘనశుభాకార వైభవోత్కంఠచేత
మాధవునిబోలి వెలసె నమ్మాధవుండు 197

వ. ఇట్లొప్పునందు విశాలరసాలసాల ప్రవాళజాలాఖాద సముత్కంఠ కలకంఠకంఠకుహూకారంబులవలన, ననారతసుగంధ బంధుర తాపహసితామృతాశనానోకహ ప్రసూనమల్లికాకుంద కుంజానికుంజ మంజుమంజరీ సంజనిత మరంద బిందు సందోహ పారణా పరాయణ విభ్రమభ్రమరీ ఝుంకారంబులవలన మాధుర్యతిరస్కృతామృతాతుల పరిపక్వ ఫలసార నిరంతరాహార కీర శారికా కోలాహలంబువలన బ్రహ్మాండభాండకరండ పరిపూర్ణ చంద్రాయమాన సాంద్రతరచంద్రికాపూరపూరితోదర చకోరికా సంచారంబువలన వినిర్మల సలిల విస్తార సరోవరోత్ఫుల్ల సల్లలిత కంజాత కింజల్క సంతతాహార మదవన్మరాళ క్రేంకారంబులవలన మలయ ధరణీధర పరిసరన్నివసిత చతుర విలాసభిల్ల సుందరీ కాఠిన్యస్తన విలిప్తమృగమదకర్దమ సౌరభ సంగత సమాగతనితాంత దక్షిణానిలాంకూరంబులవలన, వావులును నీవులును వదలు జారిణీజార సముదయంబును, జపంబులుం దపంబులు మఱచుతపస్విగణంబులును, శౌర్యధైర్యంబులుడుగు పురుషులును మేఁతలుఁబూఁలుఁ వెడలు విరహిణీజనంబులును, కోరిక గీరికలందిరుగు నభిసారికలును, నింపుఁబెంపులనెమ్మెలఁగు యువతీమిథునంబును, మురువులంబరువులందగు పక్షినిచయంబును, దావులుం బూవులుంగల శృంగారోద్యానంబులుం గలిగి చూడనద్భుతంబయ్యె నయ్యెడ 198

సీ. కమనీయబంధుర గంధప్రవర్ధన చందనాచలముపై జననమంది
ఘనసారసారసంకలితదక్షిణవధూ స్తన్యపానముసంతసమునఁ జేసి
హిమపూరకాసార సమితినిచ్చలుజల కంబులాడఁగమేని కసటువాసి
పుష్పితారామసంఫుల్ల ప్రసూనసముజ్ఝితమకరంద మగ్గఁద్రావి

గీ. బ్రోదిదైయెయించుకించుక బుద్ధియెఱిఁగిఁ
విహితమన్మథశాస్త్ర సంవేత్తలైన

సద్విజావలిలోఁ జేరి చదువఁగోరి
కదియనేతెంచెనప్పుడులేఁ గాడ్పుగట్టి 1

క. ఇది తన దిగ్విజయంబున
కదనని మదిఁదలఁచి మదనుఁ డత్యుత్సుకుఁడై
మదపతగధ్వజుల జగ
ద్విదితముగఁ బ్రయాణభేరి వేయించి వెసన్ 2(

సీ. తావిసంపఁగిదండ తగటుఁదిన్నెఁగఁ జుట్టి చాయకొంగులను దురాయి నిలిపి
తెలిమల్లె మొల్లి మొగ్గల పేరణముఁ బూని పైఁదలిరాకుకబ్బాయిఁ దొడిగి
బటువుగాగురువేరు పదుదళాళిగియించి మొగలిరేకడిదంబు దగులుపఱచి
కలిగొట్టువిరిబాఁకు మొల్లదారసిలజెక్కి సావిగన్నెరుల చెంగావిఁగట్టి

గీ. కలికి మొగ్గలు మెడహారములుగ వైచి
యనటిపూముచ్చెలడుగుల నలవరించి
చిగురువిలుకాని పేరివజీరుఁడహహా
పాంథతతిమీఁద దండెత్తఁ బయనమయ్యె 201

వ. ఇవ్విధంబునం గట్టాయితంబై 202

చ. అళిబలముల్ జకోరములు నంచగముల్ పికరాజి దెమ్మెర
ల్గొలువఁగ ముద్దురాచిలుక గోడిగ జివ్వన నెక్కి తేఁటిము
వ్వలతర పెత్తిధేయనిదువాళియొనర్చుచు దండువెళ్లె న
వ్వలపులరాజు వెంట దళవాయగు నామనిరా హుటాహుటిన్ 203

ఉ. చక్కఁగలప్పకాణపుఁ బిసాళిపటాణి దురీనఁబాతి న
ల్దిక్కులు వ్రొక్కఁగా బళిబళీయని మెచ్చుచుఁ బిట్టపోజులున్
లెక్కకు నెక్కుడైకొలువ లేజిగురా కడిదంబురాతు పే
రుక్కు మెయింజళించెను వియోగుల యుల్లము దల్లడిల్లఁగన్ 204

సీ. కప్పుగుప్పెడు గొప్పవిప్పఁగొప్పవనించు పువ్వులు నవ్వులు దవ్వులయ్యె
నల్పుఁగపల్లుపుఁబొల్పు మెల్పుదెల్పుసుగంధ సారము హారము దూరమయ్యె
బొద్దుపొద్దున దిద్దు ముద్దుటంచలయాట మెఱుపులుదిరుపులు మఱపులయ్యె
మించుబోఁడులనీతు లెంచిమించి వహించు గాథలుబోధలు బాధలయ్యె

గీ. సమరవరసూన సలకూబరాబ్జజలజ
సాయకశతోపమాన చంచత్స్వరూప
సారనైషధ ధారుణీశ్వరవియోగ
చింతితస్వాంతయగు దమయంతికపుడు. 205

వ. ఇవ్విధంబున నిరంతరదురంత విరహచింతాతురస్వాంతయగుచు నిరాహారయుని ర్వచనయునైయున్న యన్నాతింజూచి పొత్తుకత్తియలుభయాయత్తంబులగు చిత్తంబులందత్తరపడుచు నిత్తలోదరికదరిపాటున నిదియేమియొదవెనని యెదనదరులొదవఁదొక నెయ్యంపుఁదొయ్యలి యయ్యలివేణినెయ్యనొయ్యన డాయనేతెంచి యిట్లనియె.

చ. పలుకవిదేల నీచిలుకపల్కులఁగప్రిపుఁబల్కులొల్కఁగాఁ
జిలుకవిదేలనీకరుణ చెంతఁజరించుసఖీజనాలిపైఁ
దలఁకవిదేలనీచెలులు దల్లడమందుచునిన్ను దూఱఁగా
నలుకయిదేల తెల్పగదవమ్మ! నిజంబుగ నంబుజాననా. 206

చ. సెలఁతియనుంగుఁదొయ్యలులు నీకెదిరించిరో? నీదుమాటలో
మెలఁగకమించిరో నగుచుమేలపుఁబల్కులనెగ్గుజేసిరో
ములుచఁదనంబుగా మఱపుమోసములన్ గొఱగాములాడిరో
యలుకకుఁగారణంబువలదా? కలదానెపమెద్దియేనియున్. 207

ఉ. గందముపూతునో వలపుఁగప్రిపుతావులవీడ్యమిత్తునో
పొందుగమేనువట్టుగునో పువ్వులుగొప్పననింతునో సుధల్
చిందెడుపల్కులన్ గతలుసెప్పుదునో మధురస్వనంబులిం
పొందఁగవీణమీటుదును యూడిగమేమియొనర్తుఁగోమలీ. 208

ఉ. వెన్నెలకుప్పలాడుదమె? వేఁడుకబొమ్మలపెండ్లిసేతమే?
కిన్నెరమీటిపాడుదమె? గీరనగింజలఁబ్రొద్దుపుత్తమే?
వన్నెలఁగూర్చిచిత్తరులువ్రాతమె? కందుకలీలఁజూతమే?
నన్నలయించనేల? చెలినాకిదికోర్కెయటంచుఁదెల్పుమా. 209

సీ. చూడనిక్కపుఁగనడయాడివేఁడుకసేయు పోఁడిమరాయంచలఁజూడవలదె
మించుపల్కులవినోదించుకీరములకు నించుచక్కెరదినిపించవలదె
నిద్దంపుబెలుగులముద్దుగోయిలలకుఁ బ్రొద్దుప్రొద్దునపాటదిద్దవలదె

తిరుపుబాగులమీఱునోఱపునెమళ్ళకు మెఱుపుగానాటలుగఱపవలదె 210

గీ. కూడివేడుకనెపుడు నీతోడనాడు
చేడియలఁగూడి సయ్యాటలాడవలదె
మగువయిన్నింటిపైఁగల్గు మమతఁదలఁప
కిట్లురకయున్నదీన నీకేమిఫలము ? 211

ఉ. ఎన్నఁడునాదుమాట యొకయించుకయుంజవదాటకేదయన్
మన్ననలిచ్చియిప్పుడవమానముచేసెదు నాయదృష్టమె
ట్లున్నదొ నీవుగారవములొప్పఁగ దగ్గరఁబిల్వఁగాఁజెలుల్
నన్నుఘనంబుసేయుదురు నాకిక నాక్రియలేలకల్గెడున్. 212

గీ. అకట! నేమాటిపల్కఁగానెకటనైన
మాఱుమాటాడవిదియేమి మార్గమొక్కొ
చెలియ! నేమేమిదోసంబుచేసినానొ
యింతపగవారమైతిమే యిపుడునీకు. 213

వ. అని నిష్ఠురంబులువలుకు నక్కలికిపలుకులువినివిని శితలతాంతకంతుకుంతనిహతిం
జింతాభరక్రాంతయగు దమయంతి డగ్గుత్తికనత్తలోదరికిమెల్లన నిట్లనియె.

మ. నెలతా! యిత్తెఱనిష్ఠురంబువలుకన్ నీకెట్లునోరాడెదు
ర్బలనైనోరఁదడైవలేక పరితాపంబొందియున్నట్టిన
న్బలుపల్కుల్ పచరించి సారెకువృథాబాధించెదీవయ్యయో
చెలిమింబోవఁగనాడి నేఁడిటుల గాసింబెట్టఁగాఁబాడియే. 214

వ. అని మఱుమాటపలుకక యూరకుండినంగాంచి యొక్కించుకవిచారించి, యిమ్ముచుబోడి పుడమిగల్గునతిశౌర్యసారసుకుమార నిరసితకుమారులగు రాజకుమారుల యందు నెవ్వనిపొందు డెందంబునంబొందుపఱచినదియో, కాదేని యింతచింతవంత దురంతంబగు సంతాపంబుననలంతంబొందునే, యయ్యలికుంతలి కెంతయు నుద్యానాంతరంబునంగొంత ప్రొద్దుపుచ్చినంగాని కంతువలనివెఱపుమఱపు పుట్టవనితలపోసి యచ్చెలువందోకొని యశ్రాంతవసంతావసర విలాసధామంబును, సకలజన మనోభిరామంబును నగునారామంబుచేరంజనియందు.

ఉ. ఏచినరావులున్ననచి యింపులుమీఱినగంగరావులున్
బూచినమల్లెలున్ వలపుపొల్పులుదెల్పెడు బొడ్డుమల్లెలున్

గాచిననిమ్మలుఁ బసిమిగాఁగరుపండిన దాడినిమ్మలుఁ
జూచినసొంపు, చూపులకుజూపెదుగోగులు కొండగోగులుఁ. 215

క. ఇలమావులుమరులెక్కెడి
యలమావులుమిగులఁ బరువమగుమల్లియగుం
పులతావులుగపురంపుల
పులతావులు నేపుఁజూపు పూఁదోఁటవెసఁ. 216

వ. కదిసియందొక్కయింతి దమయంతిచింతయంతయుమఱపింతమని యక్కాంత
కిట్లనియె.

సీ. ఎలనాగ చూచితేయీాడలనీడల తేవమీాఱినసొంపుతావిమావి
బాలచూచితె తేనెబావులకెల్లవల నతివేడ్కరంజిల్లునల్లమొల్ల
గోలచూచితెవాలుఁగొమ్మలనిమ్మల పొంతనుప్పొదుమూలపూలరేల
కలకంఠిచూచితేగరుగులపొత్తున గురియుపువ్వులనొప్పుగొప్పయిప్ప. 217

గీ. చెలియచూచితెకడనున్న చిన్నిపొన్న
పొలఁతిచూచితివేవంక పోకమాఁక
లేమచూచితివేచాల లీలపాల
ముదితచూచితెయలి దొదల్బొదలుపొదలు. 218

క. సుదతియదెకోదమతుమ్మెద
కదుపులదెసనదరి పాటుగనుఁగొనినవవా
రిదపంక్తియనుచు మదిముద
మొదవఁగనాడెడు మయూరయూథముగంటే. 219

వ. అని తెల్పుచున్న సమయంబున.

సీ. ఇరుగుజొంపములైన యీాడలనీడల విప్పైనకురువేరుచప్పరముల
మనసారబండిన పనసలకెనసల రహిమించునెలరాలరచ్చలందు
నరుదైనకపురంపు టరఁగులమఱుఁగుల మేలైనపన్నీటికేళకుళుల
విరులతేనియనిండు చెరువులపొరువులఁ బూచినకురువిందపొదలపొంత. 220

గీ. సావిఁగనుపట్టుసురపొన్న చాలుమేలు
నింపుచోటులనీటులఁ బెంపుసొంపు
గొలుపుతీవెలకెల్లవల గలయ వెలయఁ

క్రీడసల్పిరి వేడ్క సఖీజనములు. 221

ఉ. తోరపుగుబ్బచన్నులటు దూఁగఁగఁ జాఱుచుఁ గేరుచొండొరుల్
గోరికనిక్షుదండములలోఁగనుపట్టెను మౌక్తికవ్రజం
బేరిచి తెచ్చి తేనలిడు చేరములందు నొయ్యారమొప్పఁగా
గీరనగింజలాడిరి సఖీజనముల్ మనముల్ జిగుర్పఁగన్. 222

ఉ. సూనృతమైన మోదమున మోదుగపుప్పొడితావిసుమ్మనం
గ్రొమ్మొగముగమ్మతేనియలు గల్పియనంటిగురాకుముట్టులన్
జిమ్మనగ్రోవులన్ లతలచేవడి నొండొరు మీఁదఁ జిమ్ముచున్
సమ్మదలీలఁ జాలఁగ వసంతములాడిరి కామినీమణుల్. 223

ఉ. గొప్పమిటారిగబ్బిచనుగొండలు సారెకుఁ జొక్కిలింపఁ బై
కప్పపయంటుజారనుఁ గౌనసియాడఁగ దూరిపాఱఁగ్రొం
బుప్పొడిమెట్టితమ్మివిరి బుట్టిననించివధూజనాళిపై
గుప్పచుగుప్పరాలుగొని కొవ్వున నార్చె నొకర్తు వేడుకన్. 224

వ. మఱియును.

సీ. అలరుఁ దేనియకాల్వలంతంతఁ జెరువుగాఁ గప్పురంబునఁ గట్టకట్టె నొకర్తు
చలువపన్నీటివంకలఁ గంతువలలోన నంచికేళాకుళుల్నించె నొకర్తు
కడువల్పుగొల్పుపుప్పొడిదుమ్ముదిన్నెల తిన్నెలు త్రిన్నఁ గాదిద్దె నొకర్తు
వలరాచదేవర కీలుఁగాఁగ నెలరాలఁ గూర్చి దర్పణముగఁ దార్చె నొకర్తు. 225

గీ. తీగయుయ్యెలపై నెక్కి యూఁగె నొకర్తు
లీలఁ బోదరింటిలోఁ బవ్వళించె నొకర్తు
చెలుల కెందెందు నుపములు దెలిపె నొకర్తు
తరుల వెంబడి చెలరేగి తిరిగె నొకర్తు. 226

సీ. అలభారతీదేవి నగుదు నేనని నలువలరువింతలు చూపెఁ జెలువయొకతె
యలరమాలలన నేనని హరిసన్నిధిఁ జేరి వర్తించె మిటారియొకతె
యలగట్టుపట్టి నేనని నవ్వుచు నశివాలింగనంబొనరించె లేమయొకతె
యలవహ్నికాంత నేనని బ్రహ్మసంగతి నలరి వినోదించె నతివయొకతె. 227

గీ. యలమృగాక్షిని నేనని యతిముదమున
మన్మథాలోకనము చేసె మగువయొకతె

యలరుచుఁ జంపకత్తి నేనని కేలనిమాని
గదిసి వేడుకఁ గరంజిల్లె ముదితయొకతె. 228

క. ఆకేతకివిహారస్థితి
నాకేతకిలకంబులలరి నగుమొగములతోఁ
గోకలికికలెత్తఁగఁ
నాకమిమునమింక విరులుగోయుదమనుచున్: 229

వ. పుష్పాపచయాసక్తలై యత్తలోదరులు తమలోన.

సీ. సేవంతిడియక్కొమ్మ చేమంతిమొగ్గలు ముదితనాకివె మేలుమొగలిపూలు
విరివాడివైనీవు బోరివాడవైపోక మగువపట్టఁగదమ్మ మాఁవిరెమ్మ
కలిగొట్టు మాచిచంకలుగొట్టుకొనుదమే పొలఁతిగైకొనుమల్లపొన్నరెల్ల
పొగడమాదిఁకసారెజగడమాడగరాకు మెలఁతవేచేకొమ్మి మొట్టపమ్మి. 230

గీ. యువిదయిదే లేవుగా చెల్ల యడవిమొల్ల
కోయకే చాలునో బాల గోగురెల్ల
వనితయిదె నీవెపుడుఁ గోరువట్టివేరు
నెలఁదికిత్తము విడరమ్మ విరులకొమ్మ. 231

సీ. మొల్ల మెచ్చవు నీవు మొల్లమెయిదియునే మొల్లమేయననేమికల్లచేసె
చిగురులేకోసి యేచిగురులే సెదవు చూచిగురులీలలనిట్లుతగవుకాదు
మరువమ్ము పైఁ బ్రేమ మరువమ్ము కొంటివే మరువమ్ము పాటునూతిరుగఁబడిన
నిమ్మ నేనడుగమి నిమ్మ నెవిలదాడి నిమ్మ నేమున్న దేనీకుఁజలువ. 232

గీ. చెలువమైనదిచూడవే కలికిపొగడ
పొగడఁదరమా నెనీచేతి పూలదండ
దండవాయక యుందమే తరుణిమనము
మనమునను గోరితివె లేఁత కొనలునసలు. 233

వ. అనుచు ననుచు వేడుకల వినోదించు నాసమయంబున.

చ. సకినగబొన్న లేమలుగ సంపెగపోఁజులమింతిదన్న సిం
ధుక మెలనాగయూర్చ ఘవితొయ్యలివాడలతాంగిపల్కుగో
గుకలికిగొట్టిమామిడియుఁ గొమ్మగనందిలకంపుమాద్రినుబా
లకియలుగన్ గుమారిసవలాయుమియు న్వకులంబుపూచినన్. 234

గీ. చూచియబ్బురపాటున సుందరాంగు
లప్పురాయాయితరువుల నలరు లేరి
యతులతరభవ్య నవ్యవిహారలీల
మించినయ్యాటముల మేర మీఱిమఱియు. 235

సీ. ననముట్టక నమానననితిరో చెలి మదిఁ బల్లవాకాంక్షమానవేల
చెంతనేదగిపిలిచి కెంతయూరెదు కాంత మొగలిఁ దప్పియ యేము దితనికిని
సింధువారము లేలకుందసుందర రదవాలిలేక చటికిఁ బోవఁజనునె
యలరుకంటకములనిలఁ బెనంగెద వింతగోరంటవలెననికోరఁదగునె 236

గీ. యనుచుఁ దమలోన నర్మోక్తులాడుకొనుచు
నలయఁ బోడితిన్నెలను బోరలాడుకొనుచుఁ
గూడియొండొరుఁ గూడఁ బయ్యాడుకొనుచు
నతివలొప్పిరి కదుఁ జెరలాడుకొనుచు. 237

క. వెండియుఁ గొండొక సరసంబులేర్పడఁ దమలోన.

గీ. తరుణి నేడంగి విరిదండ తావులరయఁ
గోరెదవె చూడు మల్లెవైపు కోడెనాగు
రమణియ చటుభుజంగాను రక్తి నాత్మఁ
జేర్చుటది నీకు దనుకని చెలులు నగిరి. 238

వ. ఇవ్విధంబున సరససల్లాపంబుల నప్పల్లవాధరలు ప్రొద్దులు గోయునంత.

చ. పొడమిన వేడ్కనొక్క చెలి పుష్పవిషన్న చెరంగుఁ గట్టియ
య్యెడఁ బాదఁ జొచ్చి పూజిదుమనిందు నిభాననయోర్తుడాసిలోఁ
బడతుకఁ గానకిట్లు సరిపాటున నారసి భీతిసద్దిరా
పొదల మొకంబు దీనని బొబ్బలిడుఁ జెలి సఖులెల్లనవ్వఁగన్. 239

చ. కురుసుచ తెల్లఁ జూడనొక కోమలి సంపెఁగఁ జూడఁ జూపుచున్
నెరసిన నల్లనయ్యెఁ జెలి నివ్వెరయైక నహాసచంద్రికం
గరముగఁ దెల్లనయ్యెనది గాంచితివే మియటంచుఁ బట్టెఁ ద
త్కరరుచి నెఱ్ఱనయ్యెనది గారడియంచుఁ దలంచిరందఱున్. 240

చ. మెలఁతయొకర్తు పొంత పొదమీఁద నల్లడు నిక్కి కోయఁ బో
కిక్కిలిగ నన్నైనఁ దేఁటికవగేరికమై సురపొన్న పూసవిం

జలమునఁగుట్టగా విరులుచాలెరయంచు విదుర్చుకొంచుబి
ట్టెలుఁగుననీబిజారఁబడవెత్తెను సంగడికత్తియల్ సగన్. 241

వ. ఇవ్విధంబునఁబుష్పాపచయ వినోదంబులందనివిసని.

క. ఆళీతతులంతటజల
కేళీలోలాత్మలగుచుఁ గేరుచు మృదుప
ద్మాళీమధుపాళీసుమ
రాళీయుతమగు సరోవరమునగనివేడ్కన్. 242

ఆ. వె. అబ్జసంయుతము సమాశ్రితభృంగియ
నంతకంకణంబు హంసరక్ష
ణంబువిహభరంబు నరసుతస్సైకోల
నలరెచూడరమ్య హరునిబోలి. 243

వ. అని కొనియాడిరప్పుడు.

సీ. నిండుతావులసోలు మెండుతుమ్మెదచాలు సిరులొప్పనీలంపుసరులుగాఁగ
మించువెన్నెలసౌరు నించునంచలబారు తీరైనపాపిటచేరుగాఁగ
బసనివల్పులుగప్పు పసిఁడిదమ్ములయొప్పు సొబగైనబంగారుసొమ్ముగాఁగ
నేపుమీఱఁగఁబొంగు నెఱ్ఱగల్వలరంగు జిలుఁగుఁజందురుకావిపలువగాఁగ 244

గీ. నారకనుపట్టైనపుడుకా సారలక్ష్మి
యతులితోత్సాహన వ్యవిహారలీల
విందులైతన్పుఁగనఁగోరి వేడ్కవచ్చు
సుపతులమనాత్మ విభవంబుచూపెననఁగ. 245

వ. తదనంతరంబ.

చ. చిలుకలతీరువాత్రిపని చేలలనూడ్చిజిసుంగు పావడల్
కలికి మెఱుంగులొఁదొడల కాంతులు పైటకిఁజిమ్మఁబూనిసొ
మ్ములుసడలించి మన్మథునిమోహనబాణములోయనంగన
మ్మలతెలుచాయగుందనపు మెట్టికలంగయిదండలామునుజ్. 246

వ. బయ్యెనెయ్యనడిగ్గి కొలంకుఁజొచ్చి యందు.

గీ. వింతయౌవనమునఁనొప్పి వెలఁదులప్పు
డసమశరకేళిసలుపంగ నలరిరంత

తే॥ బాల మాచితె ? పల్లవపాణి యోర్తు
కేలిమైఁ దెల్ల తామరఁ గేలఁ బట్టి
తత్కరచ్ఛవిఁ గప్పి కెంపమ్మిరయ్యెనఁ
బడతుకటఁ గాంచి యాశ్చర్యపడెడులాగు॥ 254

క॥ అని నేర్పు మెఱసి తెలుపఁగ
వినియున్ననటుల వైమి వెలఁదుక పల్కెన్
మనమున కసహ్యముగఁ గనెఁ
దనమది యానలునియందుఁ దగిలినకతనన్॥ 255

చ॥ నలునిదలంచుట న్నిషధనాథుని జూడఁగఁ గోరుచుంట న
జ్జలియుని గౌఁగిటం బొదివి పట్టఁగఁ జెంగట వాని మోవి తే
నెలు చవిచూతు నే మొయని నెమ్మది నెన్న యెకాని వైమి నె
చ్చెలి వినిపించు పల్కు చెవిఁ జేర్పఁగ నొల్లదొకించుకేనియున్॥ 256

ఉ॥ చూడదు కేలిమై మెలఁగు సుందరులం గనువిచ్చి, నూరుపూ
టాడదు కూర్మిబోటి వినయంబున సారెకుఁ బల్కరింపఁగా;
కీడను జింతవంత మది వ్రేతలతోడి విహారలీలకుం
గూడదు నైషధేంద్రుని దగుల్పడు మోహము హెచ్చుచుండుటన్॥ 257

వ॥ ఆసమయంబున.

సీ॥ ఔర నాకిది మంచియదను నా చేత్రిలోఁ జిక్కరాయిది యంచుఁ జేతులుపిండి
చోరపువ్వది వియగాఁ బరువెత్తి ఝూయని తన తేరుచెలి జేరఁ దరిమి కొఱ్ఱివ్వ
కొఱ్ఱివ్వన నార్చి పుల్గుల బారుఁ బైకొల్పి తెగనిండ విలునారిఁ దివిచి చక్కఁ
గాజంగ చాఁచి వెన్కకు నిక్కి గుఱిచూచి నన తూపులను గరుగ్గనను గాడె॥ 258

తే॥ వైవ ధైర్యంబు చెడి వకావకలు గాఁగ
నపుడు దమయంతి హా ! దైవమా ! యటంచు
నిలువ నేరక వేసవి నీరులేని
పుష్పలత పోల్కిఁ గడు సోలి పుడమివ్రాలి॥ 259

క॥ వడవడి వణఁకుచు నూరం
దడి వెడలక యొడలు గందితాపము మీఱం
బడిన చెలిఁ జూచి చెంగటి
పడతుక కడు నదరిపడుచు భయమొదవంగన్॥ 260

క॥ రారె చెలులార యేటికి
కారములిఁకఁ జాలునిలకచతాపము దు
ర్వారము గాఁబడె నేఁటి వి
హారము మానకింత చేసెనని పల్కుటయున్॥ 261

గీ॥ చెలులు భయమున రయమునఁ గొలను వెడలి
కాంతనిరీతిఁ గదియనో గాత్ర్యమనుచు
వెన్నుకొని మంగళప్రదమైనయట్లు
తాము సవరించుకొనఁగోరి తత్తరమున॥ 262

మ॥ తళుకుంబంగరు రంగుచేలలను ఫైత్తందాల్చి క్రొమ్మాని క
మ్ముల సొమ్ముల్ సవరించి మున్గురులకొప్పుల్ చక్కఁగాదిద్ది విం
తలుపూదండలునిండఁజుట్టి కనుచిత్రంబొప్పకస్తూరి గు
బ్బల పైఁబొబ్బిలమెత్తి మేల్ముసుఁగు లొప్పంగప్పి భామామణుల్॥ 263

చ॥ సకియలు జాగుమానుఁడిఁకఁ జాలును బోవుదమాటమాని యొ
ప్పుకొనబడెన్ నృపాత్మజ కపుస్సరితాపము నొందికుంద నేఁ
టికటయి దేలవచ్చితిమి యాడికలంబడనింక నొక్కనాఁ
టికి చెలి దేర నాయపసడింబడకుందు మెయంచు నెంచుచున్. 264

వ॥ అయ్యాలికుంతలులు దమయంతిఁ గదియ నేతెంచి కాంచిమించినభయంబునఁ దమలోన.

సీ॥ పడతులుగమ్మపుప్పొడి బూదిమంత్రించి పాలత్రికి మైనిండఁ బూయరమ్మ
సకియలుపసమించు సంపెంగలొనగూర్చి మించుబోఁడికి సురాళించరమ్మ
వనితలువిరిమొగ్గలనఁటియాకులనించి తోయజాక్షికి దిగదుడువరమ్మ
బాలికల్ గోరింటపూలుసాలఁగఁ దెచ్చి చామకుఁ బదదుగాఁ జల్లరమ్మ॥ 265

గీ॥ భామకంగజుకనుదృష్టిఁ బాపరమ్మ
దర్పకాహ్వయభూతంబుఁ దరుమరమ్మ
కుసుమశరుపేరిధూర్తుపోఁ గొట్టరమ్మ
యనుచు రక్షలు గావించి రబ్జముఖులు॥ 266

వ॥ అత్తఱంబ.

సీ॥ చెలువలుగలుకుచెంగలువ పూవులతావి బైకొల్పుకొలఁకులపజ్జవిరులు
జలజలరాలుచు తెలిమొల్ల తివియలు పైనల్లిబిల్లిగాఁ బారియింపు
కొననిరుల్గాలి పెడుగుజ్జుమామిడి నీడ నెనసిమిక్కిలి పెనగొనిన ద్రాక్ష
పందిటిలోఁ దేనెబావులచెంగటి కప్రంపుటనఁటులఁ గలయఁ జుట్టి॥ 267

గీ॥ రాఁగఁదీర్చిన పన్నీటివాగుదండ
నింపుగనుపట్టుసురపొన్న గుంపుక్రింద
చాయదట్టంపుకురువేరు చప్పరమ్ము
నందు నెలరాలఁగట్టిన యరఁగుమీఁద॥ 268

చ॥ కలువలు మెత్తఁగాఁ బఱచి కన్నెరుక్రొవ్విరులందు మీఁదటం
దలముగఁ బోసి యాపిదపదట్టము గాఁగలుగొల్లునించి పెం
దలిరులు వానిపై నెరపి తద్దనవాంబుజపత్రలోచనల్
జెలినటకెత్తి తెచ్చి పవళింపఁగఁజేసిరి తాపశాంతికిన్॥ 269

వ॥ అంత.

క॥ శుకవాణిహారములపై
సెకలన్నలసలనగ్రాఁగఁ జెమ్మటనీటన్
దుకతుకనుడుకుచు నెఱగ
ప్పకొనెన్గప్పురపుపూఁతఁ బూసినభంగిన్॥ 270

గీ॥ సెలఁతనిట్టూర్పుసెక జుట్టి పిలుపునేల
నిలువు గారామిఁ దనబలంబులికి పాఱెఁ
గానితరలకయుండెనక్కాంతుఁడీను
నక్షిశిఖ గ్రాగుననభ్యాసి యగుటఁ జేసి॥ 271

వ॥ అయ్యవసరంబున.

గీ॥ మంచుమలయజసారంబు నించినించి
చల్లఁగాఁ దేటపన్నీరు చల్లిచల్లి
కప్పురంపురవల్ నిండఁ గప్పికప్పి
సలిపిరింతులు శిశిరోపచారవిధులు॥ 272

వ॥ అప్పుడు.

గీ॥ తొయ్యలులుకొమ్మఁబన్నీటఁ దోఁగఁజేసి
రంగలతదర్పకకళాదుఁడసమబాణ
వహ్ని పుటమిడికాఁగిన వన్నెఁ దెలియఁ
గడిగిపరికించు పుత్తడికమ్మివోలె॥ 273

క॥ చెలువలుగుప్పిరి కప్పురము
తలపందగు భైమిపేరఁ దగుబందరువుల్
నలుఁడనుభూషణమున్ నన
విలుతుఁడెతుకఁ దలఁచి నించు వెలిగారమనన్॥ 274

చ॥ లలనవిదాహశాంతికి విలాసవతుల్ దగఁజల్లువేళ న
మ్మలయజసారమొప్పునల మాధవుపేరిటినూపకారి త
త్కలమ్మృదువాణిహారమణి తండులముల్ పరితాపవహ్నిపైఁ
బొలుపుగవండిమాఱెసరు వోసినచందముఁగానఁజేయుచున్॥ 275

ఉ॥ కాంతలుతాళవృంతములఁ గమ్మనితావులనీటఁదోఁచియ
య్యింతికివీచువేళనవియెన్నఁదగున్ రతిరాజుతాపసం
క్రాంతతదీయధైర్యలతి కాతతినేచిశరాగ్నిలేర్చుచో
నెంతయుమించుగావిసర నెత్తిన తామరపాకులోయనన్॥ 276

గీ॥ చెలువమైనిండ నించినకలువలమరెఁ
దల్లసద్రూపసంస్థిత ధవమనోను
రాగమెగయునోయని వలరాజుశస్త్ర
పంజరముగట్టనదిగను పట్టెననఁగ॥ 277

వ॥ ఇవ్విధంబున నవ్విధుబింబాననలు గుజ్జుగొజ్జంగినీట మజ్జనంబొనరించువారును, జలువ వలిపంబులంగన్నీరుదుడిచి ఱెప్పలనప్పరంపురవలుగొల్పువారును, జేటపన్నీట మాటికింబడిపిన మడుంగులువాటంబుగాఁగప్పువారును, మలయజంబున నలరుంబొ డిఁగలయంగలిపికరచరణతలంబుల దలంబుగా మెత్తువారును, తోరంబుగాఁగర్పూ రంబు శ్రవణపుటంబులంబొఅనూఁదువారును, కల్హారంబులుహారంబులుగావైచువా రును, మంజుకంజాతకింజల్క సంజనితమరందంబునం దద్విజోబృందంబు వేదిచి సిబ్బెంపుగుబ్బలపయిఁజొబ్బిల్లనలందువారును, మెత్తనినెత్తమ్ములతలగడలు నెత్తు గానెఱపువారును, మంచునించుకాసారమ్ములనీరమ్ములదంట యిగురుటాకులంగొని తెచ్చిచుట్టురాఁజల్లువారును, తజ్జలంబులజిలుంగుఁబావడలుదడిపి నీహారలవంబులు పయింబొఱవిసరువారును, నైబహువిధంబుల శైత్యకృత్యంబులుసేయంజేయనంతఁ గొంతదవ్వున నక్కాంతయొక్కింతదెప్పిఱిలి ఱెప్పవిప్పిచూచి చెంగటనిలువంబ డిన యంగనలకిట్లనియె.

మ॥ అకటా! చెచ్చెలులార! మారుఁడు ప్రసూనాస్త్రంబులేయన్ వకా
వకలై ధైర్యముదూలిపోలునను గావంజాలక స్వప్న సా
యక దౌత్యస్థితిదాయలై కదిసి యాహా చెల్లమీరెల్ల ని
ష్ఫలకంబోలెడు నెఱ్ఱఁగల్వఁ బయి నెవ్వర్లింపఁగాఁ బాడియే॥ 278

గీ॥ పిడుగుపడియున్న దానిపై బెడిదమైన
కొఱవిఁ జూపినరీతినో కొమ్మలార
దర్పకుని చేతఁబడినన్ దమ్మివసుల
పైఁ బొరల్చితిరిది యేమి ఫలము మీకు 279

క॥ చటుల తర తాపమున నలం
పటవడఁ బన్నీటి యుదుకు పైఁ జల్లుట య
క్కట, పగపాఁతఱఁ బడెనోఁ
కటఁగుమ్మదమనుచుఁ దలఁచు కైవడిగాదే॥ 280

వ॥ అనిపలికి విరహతాపంబునం బొరలుచున్నంత.

గీ॥ అపరదిశ చేరికను పట్టె నంబుజాప్తుఁ
డత్తి పతివ్రత దమయంతి నార్తిఁబెట్టు
సూనసాయకుఁ గనలుచుఁ జూచు సమయ
కాలకంఠుని జిచ్చుఱకన్న నంగ॥ 281

క॥ అలవైమి యార్తి చూడక
తలఁగిన చందమునఁ గ్రుంకెఁ దపనుఁడు ధరణీ
స్థలిసతుల యార్తి చూడమిఁ
దలఁపఁగ మిత్రులకు రాజధర్మం బెకదా॥ 282

చ॥ కమలహితుండు గ్రుంకుటయె కానఁగనయ్యె ధరిత్రి సాంధ్యరా
గమతఁడు దాఁ బ్రతీచియను కన్యకు బాసిక మొప్పఁగట్టు నా
సమయమునందుఁ జేరఁటము సల్పఁగఁబోవు దమంచు సర్వది
గ్రమణులు పైనపై యుదయరాగపుఁజీరెలు దాల్చిరో యనన్ 283

వ॥ అయ్యెడ

గీ॥ సాంద్రతరమైన తిమిరంబు సమయభూత
లాధిపత్యాపహార్యాభమగుట నిజము

నిన్నుఁగనెనేల తన నిల్వునీరుగాను 290

ఉ॥ హా! కమలారి! నీకరహుతాశనకీలలఁ గాలికాలి ము
న్నాకసమెల్ల బట్టబయలయ్యెను రుద్రుఁడు నిన్ను మౌళిపైఁ
గైకొనిమిక్కుటంబయిన కాకకుఁదాళఁదరంబుగాక మం
దాకిని దాఁపెదాఁపునను దక్కరులోర్తురె నీదువేఁడికిన్ 291

వ॥ అని చందమామనిందించి మున్ను దనుఁగాందించిన కందర్పుదిక్కు మొగంబై య
మ్మందగమనయిట్లనియె॥

మ॥ జలజాతాశుగ నీకునెవ్వరలాశక్తుల్ నినుఁబోరి ము
న్నిలమృత్యుంజయుఁడోడిపాతి సగమయ్యెంగాఁది యమ్మేనితో
మెలఁగన్ రోసి విషంబుద్రావె నటుగామిన్ జోగియైచేరెఁ బో
రొలుకొల్లాకిట రుద్రభూమియనఁ జేరం డెన్ జుమీ యందునన్ 292

గీ. కామరతిరాజ సుమనోవికాసధర్మ
గుణముగలి గుండియును దిట్టు గుడుతురనుచు
నరకనుటకాక మొదలనేయొడలు చెడిన
వానికెక్కుడి సద్ధర్మవర్తనంబు 293

ఉ. పుట్టుటకేమిమార! భువిఁబుట్టెడువారల సంఖ్యలేరికిన్
బుట్టిననాఁటియాగుణము పుల్లలతోడుతఁ బోవుఁగాని నీ
పుట్టిననాఁటిదుర్గుణము పోవకయున్నది గిట్టియున్న నీ
పుట్టినవేళనాకమలవోసిన యాపదశక్తియెట్టిదో 294

గీ. అవనిజడవృత్తివాఁడు మీయనుఁగుఁదాత
యాత్మతనయానువర్తి మీయన్నగారు
నీవనాథాంగనా హింసకెల్ల గురుఁడ
వేమిచెప్పుదుమదన! మీయింటివరుస 295

వ॥ అని జగత్ప్రాణునుద్దేశించి

చ॥ జనులుప్రభంజనుఁడనుట సత్యమెచేసితివోగవీర నీ
వనలునితోడి పొందుగొనుటాత్మసనాథ విముగ్ధకామినీ
జనముల్మీఁద వేఁడివెదఁజల్లుచుఁ బ్రేల్వనెకాదె నీకునిం
దునఫలమేమి? నీనడకదుమ్మయి పోవదె యిట్లు చేసినన్ 296

వ. అని తమ్ముఁగలుగువారింగూర్చి యిట్లనియె.

క॥ చిలుకా సామీఁదనె నీ
యలుకానినుఁబ్రోచి పెంచి నంతయు నే మిం
దులకా వేఁడుకొనెద నీ
వలకాముని గూడ నన్వర్థమగు సేయకటా 297

గీ॥ చిలుక నామీఁదనీ దయ సలుపవయ్య
పికమయిఁకమానుమీ నన్నుఁ బ్రేల్చు టెల్ల
మధుప మధుపానవర్తివై మమ్ము సారెఁ
గడఁగి బాధింపఁగా నేమి కారణంబు 298

వ. అని వెండియు

చ॥ మనసిజ సారసారి పవమాన పికంబ శుకంబ మీయన
న్న నిశముఁ బ్రేల్వ నాడికలకైన పరాక్రమ మెంత మేలు మీ
యనుపమపౌరుషంబు నిషధాధిపు పైపడిఁ జూపినన్నుఁ గూ
ర్చిన మదిమిమ్ము మెచ్చెదను జెచ్చెరఁ గోర్కులు మీకు నిచ్చెదన్॥ 299

క॥ అనిపలికి నెయ్యంపుఁదొయ్యలులం జూచి॥

సీ॥ మకరందరసమున మన్మథస్వామికిఁ బ్రేమమజ్జన మొనరించరమ్మ
వెలిదమ్మిరేకుల వలరాచవేలుపు మించువేడుకలఁ బూజించరమ్మ
పరిపక్వఫలములు సిరిపట్టిదేవర కింపుగానుపహార మియ్యరమ్మ
ననుఁగావుమనిగోరి ననవింటిజేజేకి నిలమీఁద సాష్టాంగ మెఱఁగరమ్మ॥ 300

గీ॥ అతనితోఁగూడి వచ్చినయట్టివైరి
చైత్రపవనుల సేవలు సలుపరమ్మ
కోర్కి నారాజు కడ బంతి గూళ్లు గుడుచు
పిట్టపోఁజూలకశనంబు పెట్టరమ్మ 301

క॥ అనిచెలికత్తెలు దాను ను
మునుకొని సకలోపచారముల మానసజ
న్మునిఁ జాలఁదనిపి తారా
యనవలనిప్రసాదమంది యాక్షణమందున్ 302

క॥ వేదండయానలిద్దఱు
కైదండ లొసంగ మందగతినిఁ సుమనః
కోదండ పూజకుంజనె
నీదండకె చేరవలవ దిఁక మనమనుచున్ 303

శా॥ ఖేలాంతర్విహారిద్ధ శుద్ధగుణయుగ్వేలాసముల్లాస జం
బాల ప్రోద్భవ సూనసౌధనివసద్బాలాయతోరస్క స
త్కీలాలస్థలచైత్య నిత్యబలవత్కీలాల ఫేనాపహ
క్ష్మాలీలా జనితప్రమోదముఖలక్ష్మాలీన దోషవ్రజా॥ 304

క॥ కసఖనయన సఖసఖలస
దస మస్త్రిమూర్తి మండలాంతర పదసే
వసధారిశయన వసుధా
విసరసదృశహాస రసితవిభ్రమ వసనా 305

తోటకము*వినతాసుతవాహన తాపసవ
ర్ధనతామస భంజన తాలవిభే
దనతాడిత దుర్జన తామరసా
క్షనతావన సజ్జనతాపహరా॥ 306

గద్య—ఇది శ్రీమదాచ్చివరద గురుచరణ స్మరణాభ్యసన రసనావిన్యాస తిరుమలగిరి వేంకటేశ్వర వరప్రసాదలబ్ధకవితావిలాస హరితసగోత్ర సిరిప్రగడ తిప్పనమనీషి పుత్రసుజనవిధేయ ధర్మయనామధేయ ప్రణీతంబయిన నలచరిత్రంబునందు తృతీయాశ్వాసము సంపూర్ణము.

---

Foot Note—*తోటకవృత్తకము "తగుఁ దోటకవృత్తము ధాత్ర్యతిఁన్" అని యప్పకవీయమునందుండఁగా నీకవి యేలయో ప్రాసయతి వేసియున్నాఁడు




# నలచరిత్రము

## చతుర్థాశ్వాసము.

శ్రీవత్సలాంఛ నాంచిత
భావిలసిత భవ్యకౌస్తు భమణివరదమా
దేవీసంగతపటువ
త్సోవిభవవిలాస శేషకుధరనివాసా॥

వ. అవధరింపుము

గీ॥ ఆగవ్రనిజాంతికంబున కరుగుదెంచి
చంద్రికాంత శిలామయ సౌధవీధిఁ
గదిసినిషధాధినాథుసంగతికి నాత్మ
నెదురుచూచుచునుండె నయ్యిందువదన॥

వ॥ అంత

గీ॥ సవితృఁడత్తఱిఁదాఁ గర్మసాక్షియైన
కతన నతనుండుచేయు నాఘాత్యమరయు
రీతిఁకై పొంచువంపిన దూతయనఁగ
వింటఁగనుపట్టెఁ దళుకెక్కువేగుచుక్క

క. చకితత్వంబుడుగుడుమది
నకటాయదెవచ్చె మిత్రుఁడని జక్కవక
న్యకలకు వినఁజెప్పిన పో
లికఁగుక్కుటనాదములులలిం గనుపట్టెన్॥

చ. చిరతరపుణ్యశీల తనజీవితనాథుఁడు వచ్చుభానుఁడం
చరయఁగఁబ్రాగ్దిశారమణియంబుజరాగమణీస మంచితా

భరణము లెల్లఁబూనుటయుభాసిలు దజ్జనితప్రభాసము
త్కరమటనిండఁ బర్వెననఁగానరుణోదయ మయ్యెనెంతయున్

గీ॥ ధరణివరనందనీస్వయంవర సమాగ
తాఖిలోర్వీతలాధినాయక సమాజ
కలకలంబింకనగునని తెలుపుకరణి
పతగములు మేలుకాంచి యార్భటులు చేసె॥ 8

క. అలశశిపీడనమున బి
ట్టలయికఁగను మోడ్చియున్న యబ్జాంగనమే
ల్కొలిపెడు గాయకగానం
బులగతి భృంగినినాదముల చెలువమరెన్॥ 9

గీ. తెలివిడిగ జారి దీపముల్ తెల్లనయ్యె
సతులమెడముత్తెములసరుల్ చల్లనయ్యె
మించినచకోరములగతుల్ మెల్లనయ్యె
నెల్లకలువలమోములు వెల్లనయ్యె॥ 10

సీ. కేలఁబ్రాగ్దిగ్రమాలోలాక్షి కేలిమైఁ బట్టినపికిలి పూబంతియనఁగ
లీలఁబ్రత్యూషకాళికతలఁదాల్చిన పటు సువర్ణసహస్రపత్రమనఁగ
సమయసర్వంసహాజానిపైఁ గనఁబట్టు సిరులుమీఱిన గచ్చుటరిగయనఁగఁ
గాంతిమై చెలువొందు గగనాబ్జనాభునురస్థలికౌస్తుభరత్నమనఁగఁ

గీ. కమలములపాలి సంజీవికరణియనఁగఁ
జక్రసంతతి జీవనౌషధమనంగఁ
దొంగలకెల్లనుమదిలోని దిగులనంగ
భానుఁడుదయించె మహితాభిధానుఁడగుచు॥ 11

వ. ఆసమయంబున శయనాంతికప్రాంతమణిమయాలంకృతాసనంబున శాంతజనపరి
వృతుండై కూర్చున్న భీమభూకాంతుసన్నిధికి దమయంతి ప్రాణసఖులిరువురే
తెంచి తదీయవృత్తాంతంబంతయు నెఱింగించిన మించిన సంతసంబున నతండు కు
లకాంతతో నొక్కింత తడవాలోచనంబుఁజేసి నిజనందన వివాహోద్యోగంబున
కనురాగంబొదవఁ దత్స్వయంవరంబు నిఖిలజన ప్రమోదకరంబుగాఁ జాటించిన 12

గీ. భువనమోహనతర భీమపుత్రికాస్వ

యంవరార్థోంణ ప్రేరణాతిశపిత
దర్పదంతురకంతు దంతావళంబు
రాజకావార్య ధైర్యపత్రములుగూల్చె॥ 13

వ. ఆసమయంబున॥ 14

సీ. విపులాజిసంపాత వీరోపగూహనం బపురూపమై పోయె నచ్చరలకు
అశ్రాంతపథికనిరాయాతమై స్వర్గఘంటాపథంబున గడ్డిమొలిచెఁ
బటుశూరసంకీర్ణ పాకశాసనసభా భవనమొక్కించుక పాడువోఁచె
నవనిరాడతిథిసమారోహణములేక ద్యుచరవిమానముల్ తుప్పుఁబట్టె॥

గీ. నయనవిభ్రమకృద్భీమనందనీస్వ
యంవరాలోకనాపేక్షనఖిలనృపులు
సంతతమునిఖిలోద్యోగసమితితోన
యుద్ధములుమాని విస్మయంబొందుకతన॥ 15

వ. అయ్యవసరంబున 16

ఉ. వాదులదిండి జాలపదవాహను గూరిమిపట్టిమోక్షసం
పాదనఁజేయునేర్పరియుఁ బర్వతసంయమిజోడుకోడె ప
ద్మోదరుజొక్కఁబాడెడుసమున్నతగాయక చక్రవర్తి బ్ర
హ్మోమలనైన లోఁగొనుసమర్థవశీకర మంత్రవేదియున్ 17

సీ. ఏమానిపాటకహిస్వామిఫణులెత్తు శౌరికిగొడుగులతీరుగాఁగ
నేదివ్యమునిబుద్ధి బాదరాయణుఁడు భాగవతంబుఁజేసె జగద్ధితముగ
నేషాంతివిద్ధిచేత దక్షుండుదగఁబ్రజాపాలనంబొనరించు ప్రౌఢినేర్చె
నేతపోధనుఁడుచేయించెవాల్మీకిచే రామాయణము బుధప్రస్తుతముగ

గీ. నట్టినారదుఁడవని భీమావనీశ
నందనీస్వయంవరకారణమునఁగలహ
మబ్బకుండుటఁ సేసి తానపుడునాక
మందుదొరకునోయనునాసనచటిక్షరిగె 18

గీ. నారదుఁడువచ్చెనని వినినాకభర్త
యెదురుగానేగి సాష్టాంగమెఱఁగియతని
శ్రీమఁదోతెంచి నవరత్నపీఠమున వి
శేషతరభక్తిఁ గూర్చుండఁజేసి మఱియు॥ 19

వ॥ అర్ఘ్యపాద్యాదివిధులం బరితృప్తుం గావించి సముచితసంభాషణంబులం గొంత ప్రొద్దు
గడపి యమ్మునీంద్రునకు సురేంద్రుం డిట్లనియె. 20

క॥ ఏలోకాని మునీంద్ర మ
హీలోకంబందునుండి యిన్నాళ్లవలెన్
మాలోకంబునఁ జేరరు
హాళిన్ ఘను లైన సంగరాంగణవీరుల్॥ 21

సీ॥ మహనీయ గాంగేయమయవిమానవ్రాత మకట యెవ్వరికెదురంపువాఁడ
నందనోపవనసన్మందారదామంబు లెవ్వారలకుఁ బంచియిచ్చువాఁడ
రత్నపాత్రిలసుధారసము నిండఁగఁ బోసి విందు లెవ్వరికి గావించువాఁడ
లలితాప్సరోజనంబుల నృత్యవేళలఁ గొలువున కెవ్వారిఁ గూర్చువాఁడ॥

గీ॥ బహువిధంబులఁ బరఁగిన పరిమళములు
వేడ్క నెవ్వారలకు మేళవించువాఁడ
నేమియో కాని రణవీరు లిచటికిపుడు
చేరకున్నారలే నేమి సేయువాఁడ॥ 22

క॥ ఎక్కడఁ జూచినఁ దామై
మక్కువ విహరింపుచుండ్రు మానగరమునన్
గ్రిక్కిరిసి వీరశేఖరు
లక్కట యిఁక నేల కల్గునా చందంబుల్॥ 23

సీ॥ మునియెవ్వఁడైనను దనమంత్రసంశక్తి గనుపట్టు మార్గంబుఁ గట్టెనొక్కొ
ఘనుఁడొక్కరుఁడు మున్ను గాధినందనుబోలి యిలఁ బ్రతిస్వర్గంబు నిలిపెనొక్కొ
నరనాథులెల్ల సన్న్యాసులై క్రోధముల్ విడిచి రణాపేక్ష యుడిగిరొక్కొ
యరయ నిచ్చోటనిద్రాహారములు లేమిఁ జేసి వారలు దీనిఁ జేసిరొక్కొ॥

గీ॥ యాలములనెల్లు తటి సరోజాక్షుఁ జింతఁ
జేసి సారూప్యభావంబుఁ జెందిరొక్కొ
సంగరాంగణవీరు లిచ్చటికి రాని
దేమి కారణమయ్య మౌనీంద్రచంద్ర॥ 24

గీ॥ లోకములవార్తలెల్లను మీకుఁ గరత
లామలకమట్లఁ గనుపట్టు యతికులాబ్ధి

చంద్రనామత్రిలోని సంశయముదీరఁ
దెలుపఁగదవయ్య కారుణ్యదృష్టిఁజూచి॥ 25

వ॥ అనిననింద్రునకు మునీంద్రుఁడిట్లనియె. 26

చ॥ సురవర యేమిచెప్పుదు వసుంధరభీమనృపాలునింట సుం
దరిదమయంతి నాఁ జెలువునన్ ఫలమందినరీతిఁ బుట్టి పె
క్కురుచిమీఱి భూరమణకోటుల నువ్విళులూరఁ జేయుచున్
బోరిసరసప్రవృత్తివలపుల్ పచరింపుచునున్న దెంతయున్॥ 27

వ॥ దానిసౌందర్యాతిరేకం బాకర్ణింపుము. 28

సీ॥ గొప్పనీలపుకప్పుచొప్పుగాదని దెప్పు మెప్పుమీఱఁగ నిరుల్ గప్పుకొప్పు
వాలుమించులచాలు నేలుబంగరువాలు మేలులోఁగొనఁజాలు మేనిడాలు
అంబుజంబునయంబువంబుజేసి ముదంబునంబొసంగదు నెమ్మొగంబుడంబు
కళ్కుఁగప్రిపుఁబల్కునుల్కుఁజేయుచుఁ దేనెలొల్కుతీవినిగుల్కుకల్కిపల్కు॥

గీ॥ నిక్కుసంపెఁగ టెక్కువఁద్రొక్కుముక్కు
చెన్నుగలబంతులను దలఁదన్నుచున్న
లేపుగలమీలకవరూపుమాపుచూపు
దానివర్ణింపఁదరమె యెవ్వానికైన॥ 29

ఉ॥ పుత్తడినీరుగాఁగరఁగి పున్నమవెన్నెలతేటదానిలో
నెత్తుసునెత్తుగాఁగలిపి యేర్పడఁగాంచనగర్భహేమకా
రోత్తముఁ డెంతొ వింతఁ గరమొప్పఁగఁ బోసినబొమ్మగాని య
మ్మత్తగజేంద్రయానసతిమాత్రముగాదు సురాధినాయకా॥ 30

గీ॥ చిలుకపలుకులఁగ పురంబు చిలుకఁబలుకు
మెఱుపుఁజూపులఁదొలకరి మెఱుపుఁజూపు
చాయగప్పులఁబూఁగొప్పు చాయఁగప్పు
మించుపోఁడిమిఁదనరునమ్మించుఁబోఁడి॥ 31

సీ॥ కమలనాభుఁడు దానికంఠంబుఁజూచినఁ బాంచజన్యంబును బాయకున్నె
నగజాధిపతి దానినగుమోముఁజూచిన నవతంసశశినిసీయనకయున్నె
భారతీశుఁడు దానిపదములుజూచిన విమలాంబుజస్థితివిడువకున్నె
యలవంపురుఁడుదానిహాసంబుఁజూచిన నాత్మచంద్రికలఁబోనాడకున్నె॥

గీ॥ మాటలిఁక నేలనీవయాబోటిమోవిఁ
జూతువాసుధరోయంగఁజూచెదెపుడుఁ
దక్కొరులఁజెప్పఁగానెంతదానిఁగనినఁ
దపసులకునైనడెందముల్ తరలఁబోలు॥ 32

క॥ ఆకాంతామణినలుఁడను
భూకాంతునిమీఁదమనసుఁ బూనినదిత్రిలో
కైకవిభవాభిరతిచే
నీకెనయనవచ్చునతని నిర్జరనాథా॥ 33

క॥ వివిధాకృతినీగతిన
య్యువతీమణి విభ్రమములనొందింపఁగ భూ
ధవులెల్లదానియాసం
దవిలినమతినున్న వారుదైవతవర్యా॥ 34

క॥ అదికారణముగనృపతులు
కదనంబులుమఱచియున్న కతననిపుడు దు
ర్మదదానవసంహర నీ
సదనంబునకరుగుదేరు సంగరవీరుల్॥ 35

క॥ ఇచ్చటదనుజులతోడ వి
యచ్చరులకురణముగలుగునను నాసలచే
వచ్చితిననవుడువినిదా
నచ్చతురాస్యాత్మజునకు నమరపుఁడనియెన్॥ 36

ఉ॥ నారదసంయమీంద్రవినునాకు సహోదరుఁడయ్యుపేంద్రుఁడం
భోరుహపత్రలోచనుఁడు భూరికృపాళుఁడుశౌరిచిన్మయా
కారుఁడుభక్తవత్సలుఁడ కారణబాంధవుఁడాదిమూర్తి పం
కేరుహగర్భవందితుఁడు కృష్ణుఁడుమమ్ములఁబ్రోచునిచ్చలున్॥ 37

సీ॥ శ్రీధరాకాంతలఁజెలువుమై మేనధరించువాఁడరులగారించువాఁడు
జిలుఁగువన్నెలడాలు గొలిపెడుకెంగేలిదరమువాఁడ సురులదరమువాఁడు
సకలలోకమ్ములు సత్కృపామహిమఁబాలించువాఁ డఘముదూలించువాఁడు
శరణార్థిజనవశానివరసముత్కర్షము మన్నించువాఁడిలఁగీర్తినించువాఁడు॥

గీ॥ డంబుగలకుందనము పచ్చడంబువాఁడు
మించుదయభక్తతతులనమ్మించువాఁడు
పడగఁగలవానిమెసఁగెడు పడగవాఁడు
తీరుగలనీలమేఘంబుతీరువాఁడు॥ 38

ఉ॥ అట్టిరమామనోహరుఁడ నంతగుణాకరుఁడాదిమూర్తి చే
పట్టిమమున్ దయామహిమఁ బాలనసేయుచుదానవా వలిం
గొట్టిసమస్తలోకములకున్ ననుఁబెద్దగఁజేసినాఁడు మా
కిట్టిసుఖంబుగల్గనిఁక నేమిటికెవ్వరితోడికయ్యముల్॥ 39

గీ॥ కావునరమేశుకృపనేముకడుపుచల్ల
కదలకెల్లప్పుడును నెండకన్న నీడ
కన్నెఱుంగకయుందుము గాననిపుడు
జగడములుపుట్టవిచ్చటసంయమీంద్ర॥ 40

మ॥ అనినన్ వానిసురేంద్రుతోననియె నాకాధీశమీపాలఁబా
వనచారిత్రుఁడనంతశాయి నతదేవజ్యేష్ఠుఁడుద్యత్కృపా
ఖనినారాయణుఁడెప్పుడుంగలఁడు భక్తత్రాణపారీణుఁడా
యనలీలన్ వివిధావతారములు మీకైకాదెతాఁబూనుటల్॥ 41

గీ॥ ఆమహాత్మునిపైభక్తి యేమరకుఁడు
భక్తపరతంత్రుఁడతఁడు మీపాలఁగలిగి
యీప్సితార్థంబుఁ జేకూర్చునేముబోయి
వత్తుమేయనిముదముభావమునఁబొదల॥ 42

చ॥ పులుఁగురవాలుపాల్కడలిఁ బుట్టినయాలువిరాళిహాళిఁబై
కొలిపెడుచాలు రేదిరుగుగొంటరిమెక్కుడువాలుమింటిజా
ల్దొలఁకెడుకాలు పొద్దువగలోఁగొను పేరెదకెంపుడాలు రం
జిలునలవేల్పువేల్పుమదిఁజేర్చిచనెన్ జగడాలదిండియున్॥ 4

గీ॥ అపుడతివిలాసనవవిభ్రమాభిరామ
యైనదమయంతిరూపసాహాయ్యమునను
గుండలీకృతచాపుఁడై కుసుమశరుఁడు
జిష్ణుమీఁదహాళాహాళిసేయఁదొడఁగె॥ 4

ఉ॥ నారదసంయమీంద్రవచనస్ఫుటహార్మ్యకవల్లిభీమక
న్యారమణీయరూపసుమాశుగసంతతిఁదాల్చి పూనియు
మ్మారుఁడహంకరించి పలుమాఱుఁగరుక్కునఁగాఁడనేయ జం
బారితదాహవృత్తిన్ హృదయమంతయువ్రక్కలుగాఁగనెంతయున్॥ 45

సీ॥ నవసుధాసారంబుచవులఁదేలెడుజిహ్వ దమయంతియధరామృతంబుఁగోరు
చారుదంతివరకుంభసంగతంబగుకేలు భైమివక్షోజకుంభములుఁగోరు
సంతానసూనవాసనఁగ్రోలునాస విదర్భరాట్తనయమైతావిఁగోరు
నలశచీసంశ్లిష్టమగురొమ్ము క్రథకైశికేంద్రనందనఁగవియించఁగోరు॥

గీ॥ నారబలభేది, యతనిమోహాతిశయమొ
కాక నారదవచనప్రగల్భవిధియొ
కాక మన్మథశరపరిపాకగుణమొ
కాక యక్కాంతవిభ్రమాకారగతియొ॥ 46

వ॥ ఇవ్విధంబున నతిమోహాతిరేకంబున నాకలోకపాలకుండు తద్దమయంతీస్వయం
వరోత్సవాలోకనాపేక్ష నవనీతలంబునకుంజనఁగట్టాయితంబగునట్టియెడ ననలాం
తకాధిపతులరుగుదెంచిననతండు తద్వృత్తాంతంబంతయు సవిస్తరంబుగాఁజెప్పిన
విని ప్రముదితస్వాంతులైవారలిట్లనిరి॥ 47

తరల॥ అవనిలో దమయంతి యింతటిదైన నిర్జరనాథునిన్
దవిలితచ్చెదమేము మాకటఁదప్ప నేమిపనుల్ మహో
త్సవమునన్ మనలోన నొక్కనిఁదద్వధూటివరించి మ
క్కువదలిర్పనుపాయమున్ గనుఁగొందమచ్చటఁజేరినన్॥ 48

వ॥ అనియాలోచనంబుఁజేసి. 49

క॥ హరిపావకయమవరుణులు
కరిమేషలులాయమకరగమనులు పవితో
మరదండపాశహస్తులు
నరుదెంచిరి భైమిమీఁదియభిలాషమెయిన్॥ 50

వ॥ ఇట్లుదిక్పాలకచతుష్టయంబు భూలోకంబునకనతిదూరంబుగాఁ జేరవచ్చియచ్చ
టఁదమలోన॥ 51

క॥ ఎవ్వారలఁబనుపుదమిటు
జవ్వని నొడబాటు సేయ సరసుఁడగువాఁ
డెవ్వఁడు గలుగునొకోమల
కివ్వేళననడచికోర్కెలీడేర్పంగన్॥ 52

వ॥ అనువిచారంబులం బొంద నందు బృందారకేంద్రుం డందఱ కునిట్లనియె. 53

ఉ॥ ఎంచఁగ దూతకృత్యమున కెవ్వరినైనను బంపఁజూచినన్
వంచన నీవిచారము ధ్రువంబుగ విఘ్నముఁ జెందుఁగాన నె
క్కించుక నాకుఁ జూడ నిషధేశుని బ్రార్థనఁ జేసి పంచినన్
మంచిదిదొంగ వాకిటనె మంచము వేయుట కార్యమెచ్చుటన్॥ 54

ఉ॥ ఏనొకనాఁడు వేడిన మహీశ్వరుఁ డొక్కరుఁ డెమ్మెలీఁడె భూ
జానినిజాంగఖండము లొసంగఁడె యొక్కఁడు రాజకోటికీ
రానిపదార్థముల్గలవె ప్రాణముకంటెఁ దలంచి చూడ నేఁ
డీనలుఁ డిట్టికార్యమున నెన్నివిధంబులఁ జేయకుండు నే॥ 55

వ॥ అని తలపోయుచున్న సమయంబున వారలకనతిదూరంబున శుంభదంభోధరగంభీర
రావంబునుం బోని యొక్కసంరావంబు వినంబడిన లోకపాలకులీకలకలం బేమియొ
కో యని యాలకించునంత న్నదియ నేతేరనందు. 56

సీ॥ బెళుకుచూపులవాని యెలనిండు నెలమెండు నిలబెండువడఁజేయు కళలవాని
పసిఁడిచాయలవాని పరువమ్ము విరియమ్ము దొరవమ్ము పఱచు సుందరతవాని
తళుకుచెక్కులవాని బలుమించులొలయించు నలువంచు జిలుగు దువ్వలువవాని
సొగసుమీఱినవాని జిగిగ్రిమ్ము పగడమ్ము జగడమ్ము గలమోవి చిగురువాని॥
గీ॥ నెనరుగలవాని చాయకుందనపుఁ దిమ్మె
నెమ్మిగాదను ముద్దుమొగమ్మువాని
చెలువలరు నవ్వువెన్నెలపొలుపువానిఁ
గాంచిరల్లంత నలునిదిక్పాలవరులు॥ 57

వ॥ కనియతని తేజోధైర్యస్థైర్య గాంభీర్య శౌర్యచాతుర్యగుణవిశేషంబులరసి యాతఁడ
నలుండగుట నిశ్చయించి కాదేని యట్టి సర్వలక్షణసంపన్నత్వంబు మనుష్యులకుఁగ
లుగనేయని నిజవాహపరిచారకాదుల నంతరిక్షంబున నునిచి నేలకుడిగ్గి యాస్న
పురోభాగంబునం గనుపట్టి యారాచపట్టి కిట్లనిరి.

సీ॥ విక్రమగుణసాంద్ర వీరసేనకుమార యనిశంబు మీకు దీర్ఘాయురస్తు
మీ వంగడమునకు మేటియై తగు చందమామ గ్రసంబిడి మమ్ముఁ బ్రోచు
ననఘుండు మీ తండ్రి యొనరించు యాగభాగములు భుజింతుము కరవుదీర
నతని వంశంబున నతని గర్భంబున జనన మొందిన యట్టి ఘనుఁడవీవు॥

గీ॥ గావున నుమిమ్ము స్త్రీఁ జూచు నాకాంక్షఁ జేర
వచ్చి కంటిమి కన్నులవాడ దేర
నొక్క కార్యంబు మాకు నిన్నుండి కాఁగ
వలసి యున్నది చేపట్టవలయు ననఘ॥ 59

ఉ॥ అర్థిఫలప్రదాయి యగుణాకర నైషధసార్వభౌమకా
ర్యార్థులమైన మమ్ములఁ గృతార్థులఁ జేయఁగదయ్య సర్వశా
స్త్రార్థములెందు నీ వెఱుఁగనట్టివి లేవుగదా పరోపకా
రార్థమిదంశరీరమనుటాత్మఁ దలంపఁగదయ్య ధీనిధీ॥ 60

వ॥ అనిన విని నలుండు ఓయయ్యా మీ రెవ్వరెందుండి వచ్చితిరయ్య విని జాభిధానంబులు మీ తేజోవిశేషంబుల రసి చూడ సకలలోకరక్షాచణులైన నారాయణుని కళాంశసంభవులని తోఁచుచున్నయది. మీ యట్టి మహానుభావులు తలంచిన కార్యం జేత నా మాత్రంబు కానేర్చునే నైనను ప్రాణప్రముఖంబులుగా నెయ్యది యభిలాషంబులయ్యెడు మీకు నేనియ్యఁగలవాఁడ నానతిండనిన నందఱయనుమతి నిబ్బృందారకేంద్రుం డిట్లనియె. 61

క॥ మనుజాధినాథ యీతం
డనలుఁడు జముఁడితఁడర్ణవాధ్యక్షుఁడే
ననిమిషపతి నే మింక వ
చ్చిన పని తెఱఁగెల్ల నెఱుఁగఁ జెప్పెద నింకన్॥ 62

ఉ॥ ఏనిటఁ బ్రాణమైన వెసనిచ్చెదనంటివి మేలుమేలు భూ
జానులతొల్లి ప్రాణములొసంగరె యాశిబిముఖ్యులట్లనే
దానము సర్వలోకవిదితంబయియున్నది నీకునింక నీ
రానిది కల్గునే దినరాజసమానపరాక్రమక్రమా॥ 63

క॥ పూనికఁ బ్రాణము లీవల
దోన్నపవెలలేని రత్నమొక్కటి నీకున్

రానున్న దినీవను సం
ధానము సేయంగవలయుఁ దానిన్నాకున్॥ 64

క॥ రత్నము నావినుకాంతా
రత్నము దమయంతి యట్టిప్రియ దామణి నీ
యత్నము చేనిందొకరికిఁ
బత్నిగ నౌనఁగూర్పవలయుఁ బార్థివముఖ్యా॥ 65

గీ॥ అనిననుల్లంబు ఝల్లనమనుజనాథుఁ
డేమిదలఁచంగ దైవమిట్లేమిదలఁచెఁ
బూనియేమైననీవచ్చుఁగాని దాని
నీయవచ్చునెయిచ్చినేనెట్టులోర్తు॥ 66

చ॥ అనితలపోసిపోసినృపుఁడంతనె ధైర్యవివేకసంపదన్
బెనఁగొనుబుద్ధిమైఁదలఁచెఁ బేర్చినదీనత దేవముఖ్యులే
పనివడివచ్చినన్ను నరుఁబ్రార్థనఁజేయఁగఁగాంతనీయలే
ననుకొనుటెంతపౌరుషము హావెడబుద్ధులుదోఁచెనేలొకో॥ 67

సీ॥ తనమేనితోఁగూడ ధరణియాద్యంతంబు వైరోచనికపటవటునకీఁడె
యాలిబిడ్డలనిదన్ను నమ్మివాంఛితముఁ ద్రిశంకసూనుఁడుమునీశ్వరునకీఁడె
తనశరీరమెనిపాదునకునిశ్చలయుక్తి సాహారముగనీఁడెయలకపోతి
తనవెన్నెముకకాంక్షితము సేయునంత నే యాదేవపతికీఁడెయాదధీచి॥

గీ॥ ఇంతచెప్పినచో దమయంతినిచ్చు
టెంతఘనమిఁకఁజెప్పఁగానేల నీతి
కుశలతనుజూడఁగోటలోఁ గొల్లవంక
దారలోఁబోయినట్టివిధంబుగాదె॥ 68

వ॥ కావునవీరలయభిలాషంబునకే ననుకూలుండనగుదునని మనంబుననిశ్చయించి బా
హ్యాంబుజపుటకు సురపతికినరపతియిట్లనియె. 69

చ॥ అనఘుసురేంద్రభీమ తనయన్మదిఁగోరిటవచ్చునేను కుం
టెనచననేర్తునే చనికడిండిమిరక్షితమైనతన్నికే
తనమదిచొత్తునే యొకవిధంబునఁజొచ్చితిబోఁదలంపన
వ్వనజదళాయతాక్షి మగవారలతోఁబలుకంగనేర్చునే॥ 70

వ॥ అదియునుంగాక వివిధాయుధీయరక్షితంబును ససాధ్వ[illegible]బును [illegible] నగు రాజనివేశంబును దుటునంజొరంబారినఁ బ్రాణంబా్రి[illegible] గావున నికార్యంబునకే నర్హుండ సేయనినఁ బ్రీ[illegible]. 71

గీ॥ అటులతప్పించుకొనఁదగవగునెసకల
జనమనోభీష్టదాయికా చరణశాలి
విట్టిసునునిను వేడంగ నిటకువచ్చి
తిత్తపోవుదు మేధరిత్రీత్రతలేందర॥ 72

ఆ॥ వె॥ చటులఖడ్గహస్తసంరక్షితావనీ
భృద్గృహంబుదరియ భీతివలవ
దొరులునిన్నుఁగానకుండంగ శాంబరీ
విద్యగలదు పెదము పవిత్రచరిత॥ 74

వ॥ అనియొడంబఱచి యత్తిరస్కరణీవిద్య యతనికుపదేశించి [illegible] నికి నర్మభావంబునందనకు తనకనియెటింగిందుటుకు [illegible] సకిలించె తరణిసుతుండునగియె వరుణదేవ[illegible] క్పాలకచతుష్టయంబుచేష్టలను లోలోననగుచు [illegible] కృత్యంబునకొడంబడి చనిచనియొక్క[illegible] హితామాత్యభృత్యవర్గముల [illegible] వుచుఁ గుండినపురంబుఁజొచ్చి తద్రాజనికేతనంబుదరిసి [illegible] తరంబులతిక్రమించిన యప్పుడత్యుగ్రశాసనుండగు భీమభూకాంతు [illegible] దేవతాదత్తంబగు విద్యామహిమవలన నతని నెఱుంగకయుండిరి. [illegible] నెడదిక్పాలకులభూభుకాంతునంతరంగంబుఁ దెలియు[illegible] బడక యోగమాయాబలంబుల వెనుసనిరి. అతండట్లు చని. 74

చ॥ జలజముఁజందమామ నెకసక్కెములాడెడుమోముదాని గ
ల్వలమరుదూపులం గిలకిలన్నగుమాపులదాని [illegible]
గులకుఁబసిండినిగ్గులకుఁ గూరిమి మామెడు మేనుదాని గో
మలిదమ్మయింత్రిఁ గన్గొనియెమానవనాథునిఁదను సంభ్రమంబునన్॥ 75

వ॥ కనియక్కాంతహావభావ విలాసవిభ్రమాలి రేకంబుఁ దప్పక [illegible] విస్మ
యంబునందనమనంబున. 76

చ॥ పసిఁడిసలాకయో చిగురుబంతియొ వెన్నెలసోగయో సుధా
రసపరిపాకమో మరునిరాజ్యరమాసత్రియో సువర్ణసా
రసములదండయో మెఱుఁగురత్నపుబొమ్మయొ కాక యీలస
ద్బిసరుహనేత్రియందము మదిందలపోసిన నెందుచందమే॥
సీ॥ నలువపెండుకళఁ జెందు నెలఁ జెందు జెలువందు దిరముకొల్పెసుగీము దీనిమోము
సిరిగ్రిమ్మవిరిజిమ్మదొరయమ్మ గరువమ్మదిగుడుసేయఁగనోపు దీనిచూపు
అలికప్పబలుగప్పకలచొప్పవెలిగుప్ప తీరుమీరుచు నొప్పు దీనికొప్పు
వలనించు దెలివెంచఁగలమించు నెలయించు దీనారివగఁబూను దీనిమేను॥
గీ॥ గిండ్లసరిబోలు దీనిపాలిండ్లతీరు
తేటపానకముల బావి దీనిమోవి
తేనెసోనల చవిగుల్కు దీనిపల్కు
దీనిఁ గొనియాడఁదరమె యెవ్వానికైన॥
ఉ॥ మేలిసుధారసంబు పయిమీఁగడ నేర్పునఁ దీసిటానిలో
వాలుమెఱుంగుబంగరురవల్ సరిపాలుగ నించి కొముదీ
జాలములందు పైమెదిచి సంపెఁగపుప్పొడి మేళవించి యా
బాలకిఁ జేయఁబోలు బళిపంకజగర్భుఁ డపూర్వవైఖరిన్॥
చ॥ అని కొనియాడియాడి మదనాశుగసంహతిఁ గుందినుంది యం
తనెనిగ ధీశకార్య పరతంత్రమనః స్థితిఁ దాల్మిఁ బూని యా
కనకలతాంగి డెందమునఁ గల్గు నిజస్థితి మాటలాడి వే
కనిమొదనంచు నయ్యభిముఖంబున కేగుచునుండునంతటన్॥
చ॥ మెలఁతయొకర్తు చొక్కమగు మేనిమెఱుంగుపసిండిగద్దెపైఁ
గొలువఁగనున్న భీమసుతకున్ బరితోషము పుట్టునట్లుగా
నలుఁడె దెవచ్చెనన్న నరనాథుఁడు దానికి కాంతయేగతిన్
దెలిసెనొకాక నన్న నిమదిం గడుసంశయమందె నెంతయున్॥
వ॥ అంత.
గీ॥ నరవరుఁడు శాంబరీవిద్య పరిహరించి
పావృడబ్దంబు నెడసిన భానుగరిమ
దివ్యతేజోవిశేషముల్ దిశలు నిండఁ
గమలలోచన దృష్టిమార్గమున నిలిచె॥

వ॥ ఇట్లుకనుపట్టిన. 84

ఉత్సాహము॥ ఇంతులెల్లలేచినిలిచి యిమ్మహాత్ముఁడెవ్వఁడో
కంతుఁడో జయంతుఁడో క్రొ కంజమిత్రుఁడో నిశా
కాంతుఁడో ధనేంద్రసుతుఁడో కాకటంచుఁగాంచి ర
త్యంతమోహపరవశాత్మలై ససంభ్రమంబునన్॥ 85

వ॥ అప్పుడద్దమయంతి ధీరోదాత్తకావ్యనందరలక యప్పటియట్లగాంభీర్యంబుగనుపట్ట నుండి యప్పుడమితేనిం దప్పకచూచి యతనియందుఁగందర్పసౌందర్యంబును జంద్రికళావిలాసంబును సూర్యతేజోవిభవంబును నంభోధిగాంభీర్యంబును గలిగి సర్వగుణపరిపూర్ణుండైన నీలవర్ణునిచందంబునం జెలువొందు డెందంబున నమందకామోత్సాహోద్భుతంబులు ముప్పిరిగొనఁదనచెంగటనున్న యనుంగుఁదొయ్యలికి సొయ్యనయిట్లనియె. 86

క॥ చెలియాయీతనినెమ్మొగ
మలపూర్వసుధాంశుబింబమగుఁగాకున్నన్
దలపోసిచూడనీగతి
నలరునెమనదృక్చకోరికావలులెందున్॥ 87

గీ॥ తరుణియితనిముఖేందుసందర్శనమున
వినుమ యభిలాషజలరాశివేలమీఱె
వితతచింతాతమిస్రంబువిరియఁబాఱె
వరవిలోకనకుముదములాఁవుదేఱె॥ 88

గీ॥ వెలఁదికరుణాసముద్రంబువెల్లివిరిసె
నతనిచూపులఁదనయందమల్లఁజూపెఁ
గంటివెలితామరలఁబోలుకన్నుఁగొనల
నెఱ్ఱజీరలుకనుపట్టుచెలుకగాదె॥ 89

గీ॥ శ్మశ్రుమధుపములితనినాసమనుచంప
కమునకునలంగమికినేమికారణంబొ!
యహహతెలిసెఁదదీయాననాబ్జబింబ
గళితహాసామృతావాప్తివలనఁగాదె॥ 90

క॥ విప్పుగలఱొమ్ముకటితటి
యొప్పునసన్నంపుఁగొనునూఁగులసొబగున్

దప్పకకనుఁగొను మొప్పుల
కుప్పయనందగియెనితఁడు కోకిలవాణీ॥

గీ॥ ఇతఁడు కౌఁగిటఁబొదువు సేయిందువదన
నదిహరియురస్థలస్థితయగును కాదె
యితనియధరసుధాపానమెపుడు సేయు
నదియె దేవాంగనలకెల్ల మొదలిగురువు॥

క॥ ఏమితపమాచరించెను
కా! ముకురత్నాంశచయముకనదాకల్ప
స్తోమస్థగితముపైమో
శ్యామామణియితనియంగసంగతిఁగనఁగన్॥

క॥ తరుణీయీతఁడు నైషధ
ధరణీశ్వరుఁడగుటనిజముతప్పదు కాదే
నరయంగ నాకు మోహము
తిరమగు నేయేను నలపతివ్రితఁగానే॥

సీ॥ విరివింటిదొరయనిపరికించి చూతమాతను సుందరత్వమాతనికిఁగలదె
యలజయంతుండనితలపోసి చూతమాయతనికి నొప్పులప్పార్పుగలదె
కలువలఱేఁడనిగణుతించి చూతమాయకలంకయోగమాయనకుఁగలదె
ధనదపుత్రుండనిగొనకొని చూతమాయవనిసంచారమాయనకుఁగలదె॥

గీ॥ ఈతనూవిలాసమిానయనోల్లాస
మాకళావిశేషమీావిహార
మెన్ని చూడనరులకెక్కుడిదీతఁడు
నిషధనాథుఁడగుటనిశ్చయంబు॥

క॥ నెలఁతయనుమాన మేటికిఁ
దెలియుదమేయనుచునతనిదిక్కు మొగంబై
చిలుకలపలుకులఁదేనియ
చిలుకంగ పురంబులొలుక చెలియిట్లనియెన్॥

సీ॥ నవరూపమన్మథనయకళాపరిపూర్ణ రెందుండివచ్చితిరిటకుమీారు
మాతండ్రియాజ్ఞచేఁబోతుటీఁగకునైన నుడియంగరానిదిచ్చోటికెట్లు

రావాటపడెమీకునీవంకకరుదేరఁ బనికర్తైనోకాక పైనగతిని
బోవుమన్నా రొమాపుణ్యవశమ్మున మిముఁజూడఁగాఁగల్గె మీనిజాఖ్య॥

గీ॥ వైనవర్ణంబులేతపంబాచరించె
నయ్యనీవుజనించినయన్వయంబు
సెరయభాగ్యంబుచేసెగానిన్నుఁగనిన
తల్లిదండ్రులవారెంతధన్యులొకొ॥ 97

వ॥ కావునమహాత్మ మీసౌందర్యచాతుర్యసౌకుమార్యంబులు విలోకనంబులకానంద పరిపాకంబుఁజేకూర్చె నీవచనరచనాసుధామాధుర్యంబులు చవులుగొనచెవులుదివుర్చుచున్నయవి. సుధామయూఖునకు సుధాసారంబునుంబోని మీయన్వయంబును హరిచందనంబునకు నందనంబునుంబోని మీజనకునామంబును కుందనంబునకుంబరిమళంబుంబోని మీయతులాభిధానంబును పంగుపుపయిన న్గంగయుంబోని మీరిటకు సేగుదెంచినకార్యంబును గరుణామృతదృష్టిచేమమ్ముఁదనియించి యానతిండని సఖీమణులచే మణిమయాసనంబునివేదింపఁజేసిన నతండాసీనుండై గంభీరభాషణంబుల నయ్యంభోజగంధికిట్లనియె. 98

గీ॥ తోయజాననదిగధీశదూతఁజామ్మ
చెప్పఁదలఁచినపనిగుట్టుసేయఁదగదు
చల్లకనివచ్చిముంతదాచంగనేల
నేనువచ్చినకార్యంబునిజమువినుము॥ 99

క॥ వారిపావకయమవరుణులు
తరుణీనీమీఁదఁగల్గుతాత్పర్యముచే
నరుదారఁగఁబుత్తెంచిరి
హరిచందనకుసుమముఖ్యమగుకానుకలన్॥ 100

గీ॥ అహహనీభాగ్యమహిమకేమనఁగవచ్చు
సర్వదివ్యాంగనాపరిష్వంగసంగ
సౌఖ్యవారాశిదోలాడుజంభవైరి
కొమ్మనీకౌఁగిటకుఁజేరఁగోరినాఁడు॥ 101

ఉ॥ సరసిజనేత్రిహేమమణిసౌధములన్ బవళించియుండుచో
సురపతిరాత్రియామములఁ జూడఁగనోడుఁదదీయకుడ్యముల్

వరనవరత్న నిర్మితగవాక్ష సమాగతపూర్ణిమాక్షపా
కరకరదర్శనంబు తనుఁ గారియ వెట్టెడు శంక నొందుచున్॥ 102

గీ॥ అనలదేవుండు తనుఁ జెందినట్టి విరహ
తాపరోగంబు మాన్పఁ గోఁదలఁచి వచ్చె
వినుము చెప్పెద నెట్లన్న విమలగాత్రి
తావకీనాధర సుధౌషధమ్ముఁ ద్రావి॥ 103

చ॥ వినుమిపుడంగజాతశరవేదన బైఁజరింప మేడలో
ననయము జాలకాంతరములందున నొయ్యనఁ దొంగిచూచు జా
యను మొగమెత్తి చూడఁడ సమాంబుజశోభఁ దనర్చు తద్విలో
కనముల భావభూప్రసవకాండములో యని భీతినొందుచున్॥ 104

గీ॥ దండధరుఁ డింతి కంతుని దాడికోడి
యతని గెలువంగ నొకయుపాయంబుఁ దలఁచి
నీపయోధర దుర్గముల్ దాఁపుకొనఁగ
నాసఁ జను దెంచె నీవు సాహాయ్యమిడుమ॥ 105

ఉ॥ ఓతరలాక్షి! మన్మథుని కోడిటువచ్చినదాదిగాఁగఁ బ్ర
ద్యోతననందనుండు తనయూరి మొగంబటు చూడ నెంతయున్
భీతిలియున్న వాఁడిపుడు బిట్టుగఁ బైకొని తద్దిశాసము
ద్భూతసమీరవారములు దుస్తరమౌ బలువేఁడిఁ జల్లఁగన్॥ 106

గీ॥ చటులకలహావసరముల శత్రువరుల
బాహుపాశంబు చేఁ గట్టు పాశధరుఁడు
ప్రణయకలహావసరమున బాల నీదు
బాహుపాశంబులను గట్టువడఁగఁ దలఁచె॥ 107

చ॥ అతఁడు నిజాంగనా సముదయంబులతో జలకేళిసల్ప నం
చితకమలాకరంబులను జేరఁగ భీతిలినాఁడు మీనసం
తతి మకరాంక కేతన వితానముగా విలసత్పయోరుహ
ప్రతతియుఁ గల్వలమ్మరుని బాణపరంపరగాఁ దలంచుచున్॥ 108

క॥ ఈరీతి విరహవేదన
నారీమణి నిన్నుఁ గోరి నారుదిగీశుల్

తోరమగు తృష్ణఁబడువా
రారయ నమృతంబుఁగోరు నాచందమునన్॥ 109

క॥ ఇలలోనఁ జల్లోకపాలుర
తలఁపున నీపొందుఁ గలయఁదలఁచుట యెల్లన్
గలకంఠి పెన్నిధానము
లలపేదను జేరఁగోరునట్టిదకాదే॥ 110

గీ॥ కాంత నీ భాగ్యమహిమ సాక్షాత్కరించు
విధమునఁ దిగీశ్వరులు నీకు వివశులైరి
వారి నలపురిలోన నెవ్వారిఁ గదియ
నీకుఁబ్రియ మయ్యె దాఁచక నిజము చెపుమ॥ 111

వ॥ అనిన మృదుమధుర వచన రచనా చాతుర్యసీమ యగు నబ్బామయతని కిట్లనియె. 112

మ॥ హరికిన్వందన మాచరించి శిఖికిన్ సాష్టాంగముల్ చేసి భా
స్కరసూనునకు గొనియాడి పాశికి నమస్కారంబు లర్పించి భా
సురపుణ్యోదయ విన్నవించెద దిగీశుల్ దేవతాసుందరీ
వరులై నన్ మనుజాంగనన్ జలమతిన్ వాంఛింపఁగాఁబాడియే॥ 113

గీ॥ రత్నహారావళులు దాల్చు రాజవరులు
పూనఁగాఁజూతు రే గాజుపూసపేరు
దివ్యకాంతామణులు కోరు దిగ్వరేణ్యు
లితరకాంతలఁ గోరుదు రే మహాత్మ॥ 114

వ॥ అదియునుంగాక. 115

క॥ నరవినుత నేను నలుఁడను
ధరణీశున కీయఁబడిన దానఁ దలంపన్
నరభోగ్యమైన వస్తువు
సురలకు సర్హంబె యెన్ని చూడుము మదిలోన్॥ 116

వ॥ మఱియు. 117

క॥ అరయంగ లోకపాలుర
గురుభావ్యులు లోకములకు గూఁతుంగవయం
గరమాసపడుట ధర్మమె
స్మరసన్నిభ తెలిసి చూడు మాతత్త్వమునన్॥ 118

వ॥ అదికారణంబుగా నాయభీష్టంబువారలయందుం జేరకుండుటనిజంబు; నీవుకేవల
పరమకారుణ్యనిధివి. నావిన్నపములద్దేవతాసార్వభౌములకుఁ జతురవచనారచ
నాసమర్థుండవై విన్నవించి వారలునాయెడసరోషహృదయులు సదయులునగున
ట్లుగావింపవలయుననిన నమ్మానిని నమ్మానవేంద్రుండిట్లనియె. 119

ఆ॥ వె॥ మెలఁతపిచ్చుగుంటమీఁదభాగీరథి
వచ్చినట్లుదివిజవరులునిన్ను
నాత్మఁగోరిడాయనరుదేరవారలఁ
జిన్నబాటుపొందఁజేయనగునె॥ 120

క॥ అనిమిషముఖ్యులనొల్లక
మనుజుండగునరునిమీఁద మనసూనితయో
వినుమమృతసారమొల్లక
వనజేక్షణనీరుఁగోరువారుంగలరే॥ 121

క॥ ఆరయఁగూఁతుఁగవయుట
వారలకదియొప్పవచ్చువసుమతిని నజుం
డేరీతిఁజేసెఁబూర్వము
శారదనీపాటిచదువుచదవదె చెపుమా॥ 122

వ॥ కావున. 123

చ॥ పొలతుకయొండుబుద్ధి తలపోతవివేకముకాదునాదు బు
ద్ధులుమనిఁబూనుకొమ్ము విబుధుల్ బలుమాయలవారలెన్ని భం
గులనినుమోసపుచ్చి తమకోరికఁజేకుఱఁజేసికొందు్రు ము
న్నలమునిపత్నిఁజేసిన సురాధిపుసేతయొఱుంగుదేకదా॥ 124

వ॥ అనునతనిపలుకులు ములుకులచెలువున హృదయతాపంబాపాదింప భూపాలతనయ
తనయతులపతివ్రతాశీలంబు కనుపట్టనిట్లనియె. 125

క॥ వినుపెక్కుమాటలేటికి
ననఘాదిగధీశులింతయన్యాయమెనె
మ్మనములఁదలంతురేనియుఁ
దనువేవిడుతుఁబతివ్రతాధర్మమునన్। 126

క॥ హరిపదపద్మాతవినుమిఁక
ధర వెలవఁబనేమియేను దైవతతతికిన్
"మరణే సతికిం భయము" న
సరసమతిన్ గనవె నీతిశాస్త్రములందున్॥ 127

వ॥ అనవుడు. 128

క॥ తగవా మగువా యీగతి
తెగువా మగవారికంటె తెలివలేతలఁపన్
మిగులన్ సాహసులేకధ
పగదాయ లె సర్వలోకపాలురు నీకున్॥ 129

వ॥ అదియునుంగాక లోకపాలుర నెల్లక హల్లకగంధి నీవు శరీరత్యాగంబు చేసినఁ దత్సంయోగంబు తప్పదు. తెంపున నాయోధముఖంబునం బడిన స్వర్గలోకనివాసిని వగుటం జేసి సునాసీరుండు సమ్మోదంబునం జెందు, ననలపతనంబు సేయం దలంచిన నతనిహితంబుతోడనె చేకూఱు, జలంబునం గూలిన జలధీశుచలంబీడేఱు, నితరదుర్మరణాదులవలన నలినహితసుతపురప్రవేశంబువలన నతని యభిలాషంబు సిద్ధించుఁగావున నీవితరంబుజ్జగించి వారలయందొకనిఁ బొందుఁగోరుమనిన; 130

క॥ ఆమాటకుఁ బ్రతివచనము
లేమిన్ గుచచక్రచిహ్న లింగంబులకెం
తేమజ్జనముగ నేడిచె
వామక నుంగొనలనీరు వరదలు వాఱన్॥ 131

వ॥ అప్పుడప్పుడమి ఱేఁడిట్లనియె. 132

ఉ॥ కోడె మెఱుంగు గబ్బిచనుగుబ్బలపై వెడనీరు జారఁగా
నేడువ నేటికో సరసిజేక్షణ నీనిడువాలుఁజూపులన్
జూడుము వీరసేనసుతు సోమకులాగ్రణి నన్ను నైషధున్
బాడిమెయిన్ దిగీశహితపద్ధతి నీమనసాత్తి చూచితిన్॥ 133

వ॥ కావున మగువా వగవనేల, యనిన నగ్గలికయగు సిగ్గునదిగ్గన లేచి యగ్గజగమన తెలమఱుఁగునకరిగి హరిగిరీశసమానసాత్త్వికైశ్వర్యగుణ సముజ్జ్వలుండగు నలునకిట్లనియె. నీవు కరుణాసముద్రుండవు. కామితార్థజనామరతరువగునట్టి నీయందు నభిలషించు నామనోరథంబు విఫలంబు సేయం జూచుట దాతృత్వంబునకుం గొఱంతయ కాదే, యథాదేవోక్తములవలని భయంబుఁ దలంచితేని స్వయంవరోత్సవనిరీక్షాపేక్ష

నే తెంచి తేని యాదిగధీశులం బార్థించి తదనుమతి నేనిన్ను వరియింపఁ గలదాననని విని యయ్యుత్పలాంగుపలయవిభుం డొక్కింత యాశ్చర్యంబు నొంది యారార్చిచనియె నంతకమున్న నిసూధామరవరులరిగి యథాస్థానాసీనులై యుండిరట్లు నలుండు వారలంగదియ నేతెంచి సాష్టాంగదండప్రణామంబులాచరించి యప్పుడేతుక నెడఁజడంబలికిన తె అంగును నక్కురంగనయన తనమాటలంగరంగక ప్రత్యుత్తరంబుఁ జెప్పుటయుఁ జెప్పినవిని యతనిసూనృతంబును, సతిపతివ్రతాగుణంబునుం దలంచి, మనంబుల మోదఖేదంబులు బాదుకొల్పి యందఱుం దమలోనాలోచనంబుఁ జేసి. 134

క॥ ఆలోకపాలురంతట
పాళింగపటనలభూవరాకృతులను దా
రాలోలాక్షీసంవర
ణాలోకనవాంఛఁ జేరనరిగిర చటుకన్॥ 135

క॥ నలధరణీపతియును నిజ
బలములతో నరద మెక్కి పటువాద్యరవం
బులు చెలఁగ వారియానం
బుల వెనుకొనిచనియె నతివిభూతి తలిర్పన్॥ 136

వ॥ అంత. 137

క॥ అకలంకులు రేఖానవ
మకరాంకులు దేవతాసమానులు పటుశౌ
ర్యకుమారులునగు భువిరా
జకుమారులు వచ్చిరటను సంభ్రమపరులై 138

వ॥ మఱియును. 139

గీ॥ దివ్యరత్న విభూషణదీప్తి మెఱయ
భవ్యతరగంధమాల్యసంపదలు బెరయ
సురగరుడసిద్ధసాధ్యకిన్నరవరేణ్యు
లరుగుదెంచిరి తత్స్వయంవరముకడకు॥ 140

గీ॥ పటుఫణామణిజనితప్రభావిభాస
మానదిక్తటులగుచు రమ్యగ్వి శేష
మహిమఁగనుపట్టవచ్చిరమ్మహిమచూడ
వాంఛఁగర్కోటకుండును వాసుకియును॥ 141

సీ॥ కులుకుపుత్తడిచీర చిలుకతత్తడిగౌర ఘట్టిగాఁబట్టి గాఁదనరువాఁడు
సిరులుగుల్కెడుబోటి గఱులనుల్కెడుమేటి యాలుగాడాలుగా నమరువాఁడు
నీటుమీటులచుట్టు పాటుపోటులపట్టు పోటుగాఁబాటుగాఁబొసఁగువాఁడు
పసులుమూఁగెడుచిన్నె మొయిలుఁబోఁగెడువన్నె పేరుగా సౌరుగా బెరయువాఁడు
గీ॥ తొఁగలమారిగిరులుప్పొనువగలనారి
చూపుగా మోపుగాఁబూను నేపువాఁడు
రాజితజ్ఞానభక్తసంతానగుణప
రాయణుండైనయాదినారాయణుండు॥ 142

క॥ వనజాతాలయతోడన్
సనకాదిమునీంద్రులమరసంతతిగొలువన్
వినువీథినిలిచెనప్పుడు
జననాథతనూజఁజూచుసంభ్రమ మెసఁగన్॥ 143

చ॥ చలిమలపుట్టినాలు, నెరిచాయలముమ్మొనవాలు, మౌళిపైఁ
జెలువగువంక, క్రొవ్విరిగఁజేర్చినక్రొన్నెలవంక, పాపముల్
తలఁగఁగఁజేయుపేరు, నెదఁదాల్చినపున్కలపేరు, గబ్బిరం
జిలుబలువేల్పునిల్చె వినుచేరికఁ బారిషదాళికొల్వఁగన్॥ 144

గీ॥ భీముఁడత్తఱిఁదద్రిజబృందవంశ
నామ చారిత్రములునందనకును దెలియఁ
బలుకనితరులుకారని భక్తిఁదలఁచి
శారదాదేవినిట్లనిసన్నుతించె॥ 145

సీ॥ జయనిత్యకళ్యాణి చతురపుస్తకపాణి నీరజాసనురాణి నీలవేణి
జయభద్రచారిత్ర చంద్రసన్నిభగాత్ర మునిజననుతపాత్ర వనజనేత్ర
జయపుణ్యగుణజాలసజ్జనావనఖేల సతతధర్మవిలోలసత్యశీల
జయకరుణోపేతజగదేకవిఖ్యాత పటుశుభవ్రాతశోభాసమేత॥
గీ॥ జయమహాభీకరాఘసంచయవిదార
ఆగమార్థవిహారసమ్యక్ప్రచార
జయసదాసేవితామరజనకదంబ
సరసమానసముఖబింబశారదాంబ॥ 146

క॥ అనివినుతించినభారతి
జననాథుని మెచ్చి యెదుట సాక్షాత్కారం
బుననిలిచినసాష్టాంగము
లొనరిచి సుతఁ బిలువఁగా నియోగించుటయున్॥ 147

సీ॥ కలువరేకులమీఁదుఁ గలికికన్నులతీరు తలచుట్టివచ్చుచందంబుఁ దెలుప
జోడుజక్కవ నేలుకోడెగుబ్బలమేలు తళుకులుపయ్యెద వెలికిఁ జిమ్మ
వింతనీలపుకప్పు వెడజారునునుకొప్పు మిగులనొయ్యారంపువగలుచూప
పసిఁడితామరవన్నెపఱచుముద్దుమొగమ్ము జిలుఁగువెన్నెలనవ్వు మొలకలెత్త॥
గీ॥ నడుమ వెన్నడుమల్లలనాడు నటనఁ
గొలుపునడముద్దురాయంచ చెలువు మెఱయ
రతిమనోహరుసామ్రాజ్యరమయనంగ
జనవరతనూజ వచ్చె నాస్థానమునకు॥ 148

క॥ వరపుష్పదామశోభిత
కరయై యే తేరఁ బుత్రికామణిఁ గనిభూ
వరుఁడు సరస్వతిపాదాం
బురుహములకు మొక్కఁ జేసి ముదము దలిర్పన్॥ 149

వ॥ ఇట్లు రాజలోకంబుల నెఱింగించుటకు జనవరుండు తనయ నప్పగించినఁ గరుణావిశా
రదయగు శారద, కంతునిమదదంతియుం బోని దమయంతి నిష్టదేవతాప్రార్థనంబు సే
యుమని యానతిచ్చిన నచ్చెలువ తన మనంబున. 150

చ॥ తనువునఁ గాండపాళి ఘనితండముఁ గాచిన బాళి చుట్టు చ
క్కని జముదాళి చూపుచెవికాణము మెక్కువయాళివల్ల వీ
జనములపైవిరాళి జలజాతనివాసినితోడికేళి క
ల్గినజగదేకనాయకుని గీర్తనసేయుదు నెమ్మనంబునన్॥ 151

సీ॥ సిరులీను చెలువఁ జేర్చినబొమ్మఁ గలవాని కలవానిసఖుఁ డాత్మఁ దలఁచువిభుని
ఫసమించు పేదబాపనితోడిచెలికాని చెలికాని కెదగందమలఁదినతని
మునులమానసములు మనికిగాఁ గలమేటి గలమేటికడఁ బూనుఘనునిహితుని
పాలఁదిండిమూఁకలఁ బోరాడుచలపాది చలపాదియింతి గా మెలఁగుప్రభుని॥
గీ॥ బొజ్జలోముజ్జగంబులుఁ బొసఁగుబలియు
బలియుచితదానమిడఁ గొన్నపరమపుణ్యు

నాదినారాయణస్వామి నఖిలగురుని
జింత సేయుదు నిష్టార్థసిద్ధికొఱకు॥ 152

వ॥ అని యిష్టదేవతాప్రార్థనంబుఁ జేసిన బలుకుందొయ్యలి యయ్యలివేణి యయ్యా నయ్యావనీశ్వరసముదయంబుఁ గదియఁ జేరి కొనిచని యె నప్పుడ సమానరూపరేఖావిలాసవిభ్రమాతిరేకంబుల నగ్గనుపట్టు దమయంతిం గని నరపుంగవులు తమలోన.

సీ॥ ఇంతి గాదుర పూలబంతియో వలరాజు దంతియో జాబిల్లి కాంతియొక్కొ
కొమ్మ గాదుర పైడిబొమ్మయో యలమావి రెమ్మయో ముద్దులగుమ్మ యొక్కొ
కలికి గాదుర బోదచిలుకయో మరువంపు మొలకయో వెన్నెలగోలకయొక్కొ
నారి గాదుర పూఁగటారియో తళుకుదీనారియో లలితమయూరియొక్కొ॥

గీ॥ ప్రబలబిబ్బోక సౌభాగ్య పాళగణని
రుద్ధభువనత్రయీ యీ సుప్రసిద్ధ తద్ధ
రాధినాథకుమారకాపాంగ హారిణ
శాబక శ్రేణి యీ నీలజలదవేణి॥ 154

చ॥ కమలయుగంబుపై ననఁటికంబములా కదళీద్వయంబుపై
నమరిన సైకతంబు వెస నాపులినస్థలిపైన నంతమా
యమరపథంబుపై నగములా కుధరంబులపై శశాంకుఁడా
హిమకరుపై నలుల్ నిలిపి యీ సతిఁ జేయఁగఁ బోలు ధాత తాఁ॥ 155

సీ॥ అలివేణి నెఱివేణి యసితాహి యందమా బర్హి యొప్పిదము నెప్పగిదిఁ జాల్చె
నెలనాగ నెమ్మోము జలజాతమందమా కమలారి మేలెవ్విధమునఁ బూనె
దొయ్యలి కెమ్మోవి దొండపండందమా చిలుకతుండము పెంపు గొలుపు టెట్లు
కాంత యూరులనంటికంబంబులందమా కరికరస్ఫూర్తి నే కరణిఁ గొనియె॥

గీ॥ నను చుఁదమలోన నొండొరుల దుప్భతాతి
రేకమున వీఁకఁ గాంచి వర్ణించి రప్పు
డసమకుసుమాశుగాశుగ విసరనిహత
మానమానసులగుచు నమ్మనుజవరులు॥ 156

గీ॥ ఇవ్విధంబునఁ జెలువొందు నిందువదన
కమ్మహాస్థానమధ్యలోకాన్వయప్ర
భావములు తేటపఱచి చెప్పంగఁ దొడఁగె
వందితాఖిలగీర్వాణి వాణి యపుడు॥ 157

గీ॥ సకియ చూడుము దేవతాసముదయములు
నిత్యయౌవను లఖిలసంస్తుత్యవరులు
చతురదివ్యాంగనాపరిష్వంగసంగ
సుఖవిలోలురు వైభవస్ఫూర్తికరులు॥ 158

ఉ॥ ఈవిబుధాళియందొకరి నేలి మనోభవకేళి నీవు పుం
భావము చూప వేణిఘనపఙ్క్తి నిదాఘము వాప రాలు పూ
లావడగళ్లు గాఁగఁ బులకాంకురసస్యము లేపు చూపఁగా
భావ మెలర్పఁ గోరికల పంటలు పండుఁగదే తలోదరీ॥ 159

చ॥ కనుఁగొను కాద్రవేయులను గంజవిలాసవికాసనేత్ర వీ
రనిశము శంభుభూషణము లైన మహాత్ములు తద్రసాతలం
బునకు నధీశ్వరుల్ భుజగముఖ్యులు సంతతభోగికన్యకా
జనకుచలిప్తసంకుమద చర్చితవక్షులు దక్షులెందునన్॥ 160

సీ॥ ధరణీభరముఁ దాల్చు నురగేంద్రుసలకాంత యేరాలుగా నిన్ను గారవించు
బత్రికి భూషణమైన ఫణిపత్ని యని నిచ్చలంబికాదేవి నిన్నాదరించు
మా రాజు గారాబుమగువని పన్నగీజనములు నినుఁ గొల్తు రనుదినంబు
బాతాళమున నెల్లప్రజలు కాన్కలువట్టి నినుఁ బెద్దగఁ బొగడఁగను దురెపుడు॥

గీ॥ కొమ్మ యిందొక్క సునుని జేకొంటివేని
యతఁడు తోట్లసుధారసం బబ్బునన్న
యట్టి నైజమనఃఖేద మపనయించుఁ
దనివిదైయెయ్యుమ్మదధరామృతంబుఁ ద్రావి॥ 161

గీ॥ వెలఁది చూడుము శాల్మలీద్వీపభూప
సముదయము వీరికరఖడ్గసారసహిత
చటులజాలమరీచికాజాలము హహా
దారుణారాతిసైన్యసంతమసమణఁచు॥ 162

ఉ॥ కోరిక నిందులో నొకరిఁ గూడితివేని యతండు కేళినై
సారెకు నీకుచంబులను సంగడు లెత్తుచు నీమృదూరులం
దొరపు నున్న కంబములతోడఁ బెనంగుచు నీనితంబమ
న్వారనిరంగభూమిఁ బరవల్లొగిఁ ద్రొక్కుచుఁ బుష్పచాపవి
ద్యాగతి నీవు మెచ్చఁ బ్రియయంబగు సాధన సేయుఁ గోమలీ॥ 163

శా॥ చాపభ్రూయుగళీకనుంగొనుము కాంతున్వీరలాపుష్కర
ద్వీపక్ష్మాపతు లేతదీయనవకీర్తి శ్రీముఖాబ్జప్రభ
ల్వ్యాపించున్ ద్రుహిణాండభాండపరిపూర్ణాకారరేఖన్సమ
ద్గోపాలాధిపజాలపాదనగరాద్దుగ్ధాబ్ధిసంకాశమై॥ 164

చ॥ సటలకయిందులో సొకరి సావరనందను గోరి నీవు నీ
చిటికెనవ్రేలిగోటికొనఁ జెక్కిలినొక్కితి వేనివాఁడు కోఁ
గిటనిను బిగ్గఁబట్టికొని కేళిని గాఢరతిప్రయోగలం
పటచలితాత్ముఁడై పరఁగఁ బల్మఱుఁ గూడక యున్నె కోమలీ॥ 165

క॥ వీక్షింపుము శాకద్వీ
పక్షోణీతలాధిపతుల బాడబకులసం
రక్షణరక్షినిరీక్షా
బ్జాక్షుపదాంభోజబంభరాయతమతులన్॥ 166

ఉ॥ నీరజగంధియిందొకరి నీవు వరించితి వేనివాఁడు నీ
తోరపుగబ్బిగుబ్బలను దుర్గము లెంతయు బాఁపుగాఁగ న
మ్మారుని గెల్చి నిజఘనమండలరాజ్యరమావిభూతికిన్
గారణకర్తయై కడుసుఖంబుగ నేలుఁగ దేతలోదరీ॥ 167

శా॥ చంచత్పల్లవకోమలాధర యథేచ్ఛాదృష్టిమైఁ గాంచితే
క్రౌంచద్వీపధరాతలాధిపుల వీరల్ హవ్యముల్ ప్రేమన
ర్పించన్ దానవదేవతావితతి తృప్తింబొందు నాతిండిచే
ఖించున్ గ్రొవ్వనఁ జేసి గాదె హరినీమీఁదన్ బ్రియంబూనుటల్॥ 168

ఉ॥ ఈనృపచంద్రులందొకరి నేలితి వేని యతండు నిచ్చ నీ
కానను సింహరాశి తెలిగన్నులనందగు మీనరాశి పెం
పూనఁగ భ్రూసచంబులన సొప్పుధనుర్వరకుంభరాసులన్
స్థానము గావిహారగతి సల్పుగ దేయలి నీలకుంతలా॥ 169

క॥ ఓపడతి మాడుముకుశ
ద్వీపావళి నేలునృపులవిక్రమలీలా
టోపజితరిపుల దైర్య
వ్యాపారాధరితవిషధరాచలనృపులన్॥ 170

చ॥ అరమరలేక యిందొక ధరాధిపనందను బ్రేమ నేలి నీ
సురతవిచిత్రతంత్రములు చూపుచు మన్మథశాస్త్రవైఖరిన్
బరిపరిలాగులం గలిసి పాయక నిచ్చలు వానికౌఁగిటన్
దిరమగువేడ్క నీతని విడీరఁగ నుండుఁగదమ్మ నెమ్మదిన్॥ 171

శా॥ ప్లక్షద్వీపధరాతలాధిపుల బాలా కాంచితే వీరిదోః
కాక్షేయప్రభవాగ్ని నిర్గత మహోల్కాజాలముల్ ద్విద్విష
త్కక్షీదంతిరథాశ్వసైనిక చమూఘోరాటవీదాహకా
పేక్షన్వర్తిలు నిట్టిశౌర్యములు రూపింపన్ మహైశ్వర్యముల్॥ 172

చ॥ మఱుఁడను వేఁటకాఁడు వినుమానిని నీమదిగోరు రాజకుం
జరునొకనందు నీజఘనచక్రము పేరిటిపంగిడిన్ వడిన్
బఱపుచు నీదుబాహులను పాశములం దవిలించి పట్టి నీ
చిఱుతొడకంబమున్ గదియఁ జేరిచి కట్టుఁగదే విలాసినీ॥ 173

ఉ॥ నేరెడుదీవి యేలు ధరణీవరవర్గముఁ గోరి చూచితే
వీరలు సేయునట్టి ఘనవిశ్రుతదానజలంబు ధాత్రినిం
డారఁగఁ బాఱఁగాదె జటిలాగ్రణి మ్రింగుటఁ జేసి తత్తయా
నీరధి క్రమ్మఱన్ జలమునించికొనన్ గనుఁగొంటె కోమలీ॥ 174

ఉ॥ వీరలలోన నొక్క పృథివీవరనందను బ్రేమ నేలఁగాఁ
గోరెద వేని వాఁడు కొనగోరున గస్తురినించి నించి నీ
తోరపుగబ్బిగుబ్బచనుదోయి పయిన్ మకరాంకపద్ధతుల్
నీరజగంధి చిత్తరుల నిచ్చలు వ్రాయు విచిత్రవైఖరిన్॥ 175

గీ॥ అనుచుఁ దెలుప నెకింతైన మనసులేమి
భైమి తలవాంచి మఱుమాట పలుకకున్న
వారి నెల్లమిఁ దెలిసియా వాగ్వధూటి
యమ్మగువఁ దెచ్చె నలపంచకమ్ముఁ గదియ॥ 176

వ॥ తోతెంచి వారలం జూపి నర్మగర్భంబుగా నిట్లనియె॥ 177

గీ॥ వైభవస్ఫూర్తి దేవతావరులు హేతి
వహ్నిభస్మీకృతారాతివరులు ధర్మ
శీలురుగభీరగుణముల సింధువిభులు
నైషధులు వీరిఁ జూడుమా నలిననయన॥ 178

వ॥ అని వజ్రివహ్ని వైవస్వతవరుణ వైరసేనులంగ్రమంబునఁ దెలియునట్లు భావగర్భోక్తులంబలికిన విని యవ్వనితవారలఁజేరంజని విస్మయంబున నెఱుంగలేక క్రమ్మఱి శారదోపదేశంబున దిశాపతులకిట్లనియె. 179

చ॥ సురవరులార ధర్మగుణశోభితమానసులార సత్కృపా
శరనిధులార చారుతరసాత్త్వికభూషణులార యిచ్చవిూ
చరణసరోరుహంబులకుఁ జాగిలి మ్రొక్కెద తావకీనభా
సురతరరూప భావములుచూపి దయామతినన్నుఁ బ్రోవరే॥ 180

వ॥ అని పెక్కుభంగులంబ్రార్థించిన దిశాపాలకులయ్యంగన యెడంగలుగు నాశాపాశనిబద్ధులగుటంజేసి యంగీకరింపకున్న, యన్నాతిపరిదేవనంబొనర్పందొడంగిన॥ 181

క॥ దైవతవర్యులు తత్పరి
దేవనమునఁగరఁగి తమ్ముఁదెలియువిధంబా
భూవరసుతకేర్పఱచిరి
భావంబునఁ బొడమసత్కృపావిస్ఫూర్తిన్॥ 182

గీ॥ అంతనస్వేదపటుగాత్రులంతరిక్ష
సుస్థితులుపారిజాత ప్రసూనగంధ
బంధురవిలాసులగు దిశాపతులఁగడచి
మగువనలుమెడఁ బుష్పదామంబువైచె॥ 183

వ॥ అప్పుడు. 184

క॥ దుందుభులుమొరసె మిక్కిలిఁ
గ్రిందుకొనెన్ వందిజనులకైవారంబుల్
బృందారకాధిపతులా
నందంబుననిడిరి దీవనలునలునకిలన్॥ 185

వ॥ మఱియు: 186

చ॥ వరములొసంగిరా నిషధవల్లభుసూనృతవృత్తిమెచ్చి ప్రా
గ్వరుఁడు నిజస్వరూపమునవాని మఖంబులనిల్వనగ్నియున్
వరుణుఁడతండుగోరు నెడవహ్ని జలంబులుగల్గఁజేయనా
తరణిసుతుండు తద్విహితధర్మవుఁదప్పక యుండునట్లుగన్॥ 187

వ॥ తదనంతరంబ, 188

క॥ తరుణీసువ్రతసిద్ధిన్
బరఁడెఱుఁగక కవయునట్టిపాపముచేఁ దా
ధరభస్మంబైపడునని
పరమంబగువరమొసంగె భారతికరుణన్॥ 18

గీ॥ పార్వతీదేవియును శూలపాణిఁబోలి
వనజగేహిని గరుడకేతనునిబోలి
యీరమణిఁగూడి మనుమని వైరసేనిఁ
జాలదీవించె జగదంబశారదాంబ॥ 190

గీ॥ ఇట్లుదీవించి వాణిదిగీశులరిగి
రాత్మసదనంబులకునంత నతిరయమున
భీమసేనుండుహితబంధు భృత్యసహితుఁ
డగుచునలునినెదుర్కొని హర్షమెసఁగ॥ 191

వ॥ తోడ్తెంచి రమ్యహర్మ్యప్రదేశంబున విడియనియమించె, నటమున్నె దమయంతి హితకన్యకాసహస్రపరివృతయై నిజస్థానంబునకరిగె, నంతనబ్భీమసేనుండు నందని వివాహోద్యోగంబున కనురాగంబొదవఁ బట్టణంబలంకరణంబొనరించి సంభ్రమాయత్తచిత్తంబుననుండు నవసరంబున. 192

ఉ॥ మోదముమీఱఁజిత్తరువు ముత్తెములందగముగ్గఁబెట్టితో
రాదమయంతిసన్మణిమయాసనసంస్థితఁజేసి పెద్ద ము
త్తైదువలెల్లదీవనల నక్షతముల్ తలనించికోరికల్
బాదుకొనంగ సంభ్రమమెసంగఁ బొసంగ నొసంగిరారతుల్॥ 193

వ॥ మఱియును. 194

క॥ జలరుహనయనలు మనముల
నలరుచుఁదలయంటి జలకమార్చినపిదపన్
బులుకడిగిన ముత్తెమువలె
జలజాతసుగంధగంధి చాలఁగనొప్పెన్॥ 195

చ॥ రమణికివేడ్కతోను దయరాగముచేలయొకర్తుగట్టె యం
దము చెలువొందుతెంగులు ఘనంబుగఁజూడఁగనప్పుడొప్పనా
రమణిమృదూరుయుగ్మమున రంగులెసంగ మెఱుంగునంటె కం
బములిల నేచిపూచి కనుపట్టఁగఁజేసిన మొగ్గలోయనన్॥ 196

వ॥ వెండియు. 197

చ॥ పవడపువన్నె దువ్వలువ పయ్యెద గావ లెవాటు వైచినన్
గువలయపత్రనేత్ర జిగిగుత్తపుసిబ్బెపుగబ్బిగుబ్బ జ
క్కవలను మోము చందురుఁడు గాయని గారపునవ్వు వెన్నెలల్
కవిసికలంచు నోయనుచుఁ గామిని మాటొనరించు కైవడిన్॥ 198

చ॥ నెలఁతకుఁ జూడఁగా నమరెనిద్దపుఁబాపిటచేరుముత్తియం
బులునగు మోము జందురునిబోంచిన తజ్జలముగ్వినీల ని
ర్మలకచసంహికేయుఁగని మావిభుఁగావుమటంచు నాత్మవ
ర్తిలుపతిభక్తి చేననుసరించఁగ డాసినతారలోయనన్॥ 199

గీ॥ వజ్రకీలితమగు నెలవంకబొట్టు
సుందరాయతగాత్రికిఁ జూడనమరెఁ
గదిసితత్ఫాలపట్టిక కెదురబెదరి
శరణుఁబొందిన యలయర్థచంద్రుఁడనఁగ॥ 200

గీ॥ ముత్తియమ్ములబవిరలమ్మగుదదాల్చె
బెళుకుచూపుమెకమ్ములు బెదరియదరి
పాటుననుడాసియేమటి పడునెయనుచు
కర్ణపుటకూపములఁగాపు కప్పెననఁగ॥ 201

చ॥ కనఁబడెఁగర్ణికామణులు కామినిమోముకెలంకులన్, మఱుం
డనుముని పాంథధైర్యవిపులాంబుధిఁగ్రోలఁ, దదంతరస్థర
త్న నికరమంబుజాహితుని దండకుఁజేరెననంగ, నట్లయౌ;
తనయునిఁజేరుఁగాక యిలతండ్రిధనంబొరుఁజేరనేర్చునే॥ 202

గీ॥ జిగిమిగులుతమ్మిపొగరెల్ల దిగుదుపఱచు
ముగుదమోమునముంగర ముత్తియంబు
తనదుపత్నిని దిరుగనిమ్మనుచునిందుఁ
బ్రార్థనలుసేయఁగదియు గీష్పతియుబోలె॥ 203

క॥ బలుమానిక్యములనమరిన
తళుకులుగలతీఁగఁ గలికితాల్చెనదియున్
గళమనెడిపోకబోదియ
కలవఱచిన యాలవాలమైకనుపట్టెన్॥ 204

గీ॥ నిబ్బరంబైన సిబ్బెంపుగుబ్బచన్ను
గవలనడుచక్కఁదగు పతకంబుబిళ్ల
సలలితోదయశైలాస్త శైలమధ్య
వర్తియగుభానుబింబ రూపంబుఁదెలిపె॥ 20

క॥ అలుతనుగంఠాభరణము
మఱినెదపతకమున దేవమణి కన్పడెనే
డ్తెఱఁబటుశుభలక్షణములఁ
చెలువిలుతు తేజియనఁగఁ జెలికనుపట్టెన్॥ 20

వ॥ మఱియును. 20

చ॥ ఘనకచ గారుడాశ్మపరి కల్పితమేఖలఁదాల్చెఁ జేర్మిచే
ననిశముమారుఁడయ్యబల యౌవనరాజ్యముచేకొనంగవీఁ
కనువ్పుదులోరుకాండపటు కాంచనదండవిరాజమానత
ద్వినుతనితంబమన్ గవనివింతగఁగట్టినతోరణంబనన్॥ 20

గీ॥ మెండుకెంపులతొడవులు నిండనలరు
లలనకోమలపాణి పల్లవములమరు
బాలకమలాప్తబింబ ప్రిభావిలాస
కలితమైయొప్పు కెందమ్మి కవయనంగ॥ 20

క॥ ఈలీలభూషణముల
బ్బాలామణిదాల్చియొప్పెఁ బటుతరగరిమన్
బోలింపఁజైత్రసంగతి
లాలితమైయొప్పుపుష్పలత యోయనఁగన్॥ 21

వ॥ ఇద్విధంబున వివిధాలంకృతయగు దమయంతి లక్ష్మీపదధ్యానాయత్తచిత్తంబు
నుండునంత, భీమభూకాంతుంగనుంగొని. 21

గీ॥ జనవరాగ్రిణి సుముహూర్తసమయమయ్యెఁ
బెండ్లికొడుకునుదోడి తెప్పింపుఁడనుచు
వితతసిద్ధాంతవేత్తలు విన్నవింప
నలునిరానంపెనధిక సన్నాహమెసఁగ॥ 21

వ॥ అటనలుండును సంభ్రిమాక్రాంతస్వాంతుండై యుండునప్పుడు. 21

సీ॥ కంకణమ్ములుగల్లుగల్లన సంపెఁగనూనె చేఁదలయంటెఁ జానయోర్తు
పలుతెఱంగులవాసనలు చిందుగందంపుటటకలి పెట్టెఁ బద్మాస్యయోర్తు
కౌతూహలంబుతోఁ గాఁగినపన్నీట నింతిమజ్జనము చేయించె నోర్తు
నునుచేలఁ దడియొత్తి జినుఁగుఁజందురుకావి వలువఁగట్టగనిచ్చె వనితయోర్తు॥

గీ॥ తీర్చెఁ గస్తూరితిలకంబుఁ దెఱవయోర్తు
సికయు నెయ్యారముగ దిద్దెఁ జెలువయోర్తు
అగరుధూపంబు వాసించె ముగుదయోర్తు
తళుకు మైఁ జందనములందెఁ దరుణియోర్తు॥ 214

వ॥ వెండియు నొక్కవికచకమలనయన సకలప్రకటంబగు మకుటంబు శిరోభాగంబు సంబొందుపఱిచె, నొక్కమత్తకాశిని చిత్రమ్ములగు ముత్తియమ్ముల చౌకట్లు చెవులందవ్వులుపఱిచె, నొక్కకలకంఠకంఠి సముత్కంఠకంఠంబునఁ గంఠమాలికలు కీల్కొలిపె, నొక్కకరభోరు సరభసంబున కంగర భూషణంబులను వుపఱిచె, నొక్కశృంగారవతి మానికంపురంగులఁ గరము మీఱు నుంగరంబు లంగుళంబులందొడివె; నొక్క కుటిలాలక పటురత్నసంఘటితంబగు మొలకట్టు వెట్టె, నొక్కబోటి హాటకమణిమయశాటీనికరంబు వలెనాటుగా నీటుకొలిపె, నిట్లు నిఖిలభూషణభూషితుండై నైషధేశ్వరుండు, హితపురోహితామాత్యసహితుండై, చిరత్నరత్నమయాందోళికారోహణంబు సేసి హృద్యానవద్యవివిధవాద్యసంరావంబును గాయకవితానమంగళగానస్వరంబును మేదినీసురాశీర్వచోనినాదంబును మేరమీఱి భోరుకలుగంజని బహువిధపరిమళనమృగమదకర్దమ విలిప్తమార్గప్రదేశంబును ప్రభాకరవిభావకీవర విభాప్రతిమాన నలినమణిగణస్థగితోత్తుంగరంగవైమానిక నికరంబును నైరావణవారణ మనోహర కరసురుచిరహీరహార కనత్కనకకంఠీరవ సముజ్జృంభమాణ ద్వారోపాంతస్థలంబును, నిరంతరప్రశస్త సమస్త జననయన విభ్రమకృన్నిజ సౌందర్యపహసిత పిశితభుగరి నగకుచానిచయోదార వారకలకంఠకంఠీపటు నటనావిలాస భాసురాంగణప్రదేశంబును, సముచితముక్తాఫలవినిర్మిత విచిత్రరంగవల్లికాలంకారబలభిన్నీలకీలితలాలిత వేదికాసముదయంబును, గలిగి గ్రహమండలంబునుంబోలె బుధగురుకవిరాజవిరాజమానంబై, సదాశివునాకారంబునుంబోలె సర్వమంగళాన్వితంబై, సుగ్రీవునాస్థానంబునుంబోలె నీలాంగదకలితపరిజనసమగ్రంబై, యయోధ్యానగరంబునుంబోలె రామలక్ష్మణశోభితంబై, వర్షాగమంబునుంబోలె ఘనవిచిత్రాంబరాలంకృతంబై, యేపుమాపు భీమభూపాలునికేతనంబు సొత్తెంచెనప్పుడు.

క॥ అల్లంత నెదురుసని రా
జిల్లెను మోదమున భీమసేనుఁడు వెసఁ దా
నల్లునిఁ దోకొని వచ్చి స
ముల్లాసితపీఠమిడ నియోగించుటయున్॥ 216

క॥ ఇభయానయోర్తురత్న
ప్రభలీనెడుపీఠమిడిన రాజేంద్రుఁడు ప్రా
గభిముఖముగఁ గూర్చుండెను
సభికులు ప్రాసీనులైరి సముచితలీలన్॥ 217

వ॥ అంతనవ్విదర్భాధీశ్వరుండర్ఘ్యపాద్యంబులిచ్చి మధుపర్కంబులొసంగి పదంపడిస
మంచిత ప్రకారంబున నతనిం బశ్చిమాభిముఖుంగావించి పుత్రికారత్నంబునుంగది
యందోడ్త్రేరనియమించునప్పుడు. 218

గీ॥ తెరయొసర్చిరి యవ్వధూవరులనడుమఁ
దత్తదాస్యేందుబింబ సందర్శనమున
నొండొరులధైర్య చంద్రకాంతోపలములు
కరఁగుననుశంకమాటుగాఁ గట్టిరనఁగ॥ 219

వ॥ అంత. 220

క॥ మానవపతి భీముఁడు వి
ప్రానుమతిం లగ్నసమయమగుటయుఁ గన్యా
దానంబొసఁగెనుదుగ్ధాం
భోనిధియిందిరను హరికిఁ బోలెనలునకున్॥ 221

వ॥ తదనంతరంబ. 222

క॥ ధరణీవరమణియును ద
త్తరుణీమణియుత్తియముల తలబ్రాలపుడొం
డొరులసిరంబులనిడఁ జూ
పరులకు నవ్వేళ నేత్రపర్వంబయ్యెన్॥ 223

వ॥ మఱియును. 224

గీ॥ భూతలేంద్రుండు నలుఁడంత గౌతమాను
మతిని సతితోడ నుచితహోమములొనర్చి

సమరవరుఁడు బృహస్పతియనుమతమున
నలశ్రీయుతుఁడై సల్పునవ్విధమున॥ 225

వ॥ వెండియుంగ్రమక్రమంబునఁ దత్తదుచితక్రియలునిర్వర్తించి పరిమితదినంబులుగడపి యుండునంత. 226

సీ॥ అత్యున్నతంబులై యసమదానస్ఫూర్తిఁ దనరారుభద్రమాతంగఘటలు
విమలలక్షణసమన్వితములై వాయురయంబునఁ దగునుత్తమాశ్వతతులు
బహుళతరోపాయపారీణులై మహోదారశౌర్యతఁ బేర్చుదాసజనులు
రూపనైపుణవయోరూఢలై పటువిలాసములనొప్పెడు సఖీసముదయములు॥

గీ॥ హైమరథసంచయంబుల నర్ఘ్యమణిమ
యాంగరాగంబు లతివిచిత్రాంబరములు
మొదలుగాఁగల్గువస్తు సంపదలసంఖ్య
లరణములొసంగెభీముఁ డత్యాదరమున॥ 227

వ॥ అంత నిషధక్షితీశ్వరుండు ప్రయాణప్రమోదాయత్తచిత్తంబున నుండునప్పుడు దమయంతిప్రాణవల్లభుననుగమనంబున నిషధనగరంబునకుంజనుటకు నాయితంబై పరిచితజనవర్గంబులంగనుంగొని. 228

సీ॥ అనిశంబునామీఁది నెనరువోవిడకుఁడీ పోయివచ్చెదదాదిప్రోడలార
పాటిల్లునామీఁది భక్తియేమరకుఁడీ పోయివచ్చెదకూర్మిపాలఁతులార
తలఁపుననామీఁది తాత్పర్యముంచుఁడీ పోయివచ్చెదఁదోడఁబుట్టులార
మదిలోననామీఁది మమతచేనుండుఁడీ పోయివచ్చెదఁజొట్టపుఁజెలులార॥

గీ॥ అయ్యనేఁబోయివచ్చెద నమ్మనేను
పోయివచ్చెదననితమ్ముఁ బాయలేని
నిజమనస్తాపమునఁ గంటనీరుదేరఁ
దనయనక్కునఁగదియించి తండ్రివలికె॥ 229

క॥ నీవుంబతియును దేవియు
దేవరవలెఁజనుఁడు మూఁడుదినములపిదపన్
నే వెంటనెపిలిపించెద
నీవిధమున బెగడుగుడువనేటికితల్లీ॥ 230

వ॥ అనిపలికివెండియు. 231

క॥ పతియే దైవము గురుఁడును
పతిహితమై యొప్పు ప్రాణబంధుఁడు తలఁపన్
సతతంబు నేడుగడ యా
పతియె సుమీ సతుల కెల్లఁ బంకజవదనా॥ 232

గీ॥ తామరసనేత్రి పతిసేవ యేమఱకుము
ప్రోడవై యత్తమామల బుద్ధి మెలఁగు
మతిథిసంతతిఁ బోషింపు మంబకరణి
వినయములు సేయుమీ బంధుజనుల కెపుడు॥ 233

చ॥ అనుచు హితోక్తు లెల్లఁ దనయామణికిం బ్రియమారఁ జెప్పి య
ల్లునిఁ గదియంగ వచ్చి మదిలో నెనరుప్పతిలంగఁ బల్కె నో
యనఘగుణాఢ్య నీవు దగ నల్లుఁడ వైతివి మాకు, శౌరిమున్
వననిధి కైనచందమున నాదగు భాగ్యవిశేష మెట్టిదో॥ 234

క॥ వినయము పలికెడు నామా
మను సవినయలీల నిలిపి మగువయుఁ దానున్
జనియె పురోహిత బాంధవ
జనభృత్యామాత్యవర్గ సహితుఁడగుచున్॥ 235

వ॥ ఇవ్విధంబున నోషధీశకులభూషణుం డైన నైషధేశ్వరుండు యోషామణీసహితుం డై నిజనగరంబునకుం జనుచుండె, నంతకు మున్న స్వయంవరోత్సవానంతరంబున నలుని వీక్షించి వీడ్కొని దిక్పాలకచతుష్టయం బమరగణసహితు లై చనునప్పుడు మార్గంబున.

సీ॥ కల్మషంబులమంద కపటంబులకునిక్క రాగతనమ్ములరచ్చపట్టు
నయమార్గములకెల్ల నట్టింటిపగదాయ పాతకాహులకును బట్టుకొమ్మ
విజ్ఞానములవేరు పిత్తుజాడ్యమ్ములకిరవు ధర్మంబులఁబఱపుమందు
శుభకర్మములపుట్టుమాఱ కోపము టెంకి కట్టడితడకలపుట్టినిల్లు॥

గీ॥ మలయుబలుమత్సరమ్ముల మనికిచోటు
చెడుగుబుద్ధులకనుపట్టుఁ జేయుచట్టు
భూరిదారిద్ర్యగణముల పూటకాపు
వచ్చెఁ గలిరాజు దేవతావరులఁ గదియ॥ 237

వ॥ ద్వాపారసహితుండై యేతెంచు నతనిం గని సురపుంగవు లిట్లనిరి. 238

క॥ మీరెవ్వరకలిగారో
దూరంబీరీతి నన్నుతో నిటు చనఁగాఁ
గారణ మెయ్యది కలిగెను
భూరితరక్రోధరూప బొంకక చెప్పుమా॥ 239

చ॥ అనవుడు దేవతావరుల కక్కలి వల్కె దిగీశులార మే
దినిపటురూపసంపదను తింగనఁ జాలు విదర్భభూమి రా
ట్తనయ యటంచు నెన్న విని దానిస్వయంవర కాలమందుఁ గై
కొనియెదనంచుఁ గోరి విరిగొన్న తమింజను దెంచితిన్ వడిన్॥ 240

క॥ అయ్యారే నీయంతటి
యొయ్యారికిసట్టి చెలువ యొగిలేకున్నన్
వెయ్యైనాకాదుసుమీ
నియ్యానతలంప ధర్మనియతివిఘాతీ॥ 241

క॥ ఈపొంక మీ యొయారం
బీపటువీసద్విలాస మీ యందంబీ
రూపంబీ చతురత యీ
యోపిక నీకతగుఁ గాక యొరులకుఁ గలదే॥ 242

క॥ నీ చక్కఁదనముఁ గ్రక్కునఁ
జూచినమాత్రమున భీమసుత మన్మథ నా
రాచంబులయాలజడిఁబడి
నీచెలిమికిఁ బెనఁగకున్నె నిజము దలంపన్॥ 243

వ॥ అని కేరడంబుమాటల నోరంత ప్రొద్దుగడపి దేవేంద్రుండిట్లనియె. 244

ఉ॥ ఆతరుణీశిరోమణి శుభాకృతిఁ జూచి మనోజబాణ ని
ర్ఘాతమనస్కులైక దియు రాజకుమారులపారసంఖ్యలెం
తేతమినుండవారలమదింద్రుణ మాత్రముగాఁగఁ జూచు నా
నాతిని నుంగనుంగొనిన నవ్వక యున్నె తలంచిచూడఁగన్॥ 245

క॥ అవనితామణి యెక్కడ
నీవెక్కడ యిటులు పలుక నేర్పెక్కడ చా
లీవిధము మాని వచ్చిన
త్రోవ నెమరలంగఁ జనుము దుర్జనమిత్రా॥ 246

సీ॥ తళుకుకుందనమునైదాపించఁదగిన కెంపునుమునైనిడఁగనూహించినటుల
మేడపైఁగనుపట్టు మెఱయుబంగరుకుండ గుడిసెపైనిలుపఁగాఁగోరినటుల
నెలఁతలపాలిండ్లనించుకస్తురిమేక మెడచన్నులనుబూయఁదొడరునటుల
తజ్ఞభోజనమైనయజ్ఞశేషాన్నంబు శునకంబునకుఁబెట్టఁజూచునటుల॥
గీ॥ వీరశేఖరుఁడైన యవ్వైరిసేనిఁ
గూర్పఁగాయోగ్యమైన యక్కోమలాంగి
నీచునొకనిఁగూర్ప నేరీతి నేర్పు చెపుమ
ధాతయీరీతి వెంగలియేతలంప॥ 247

క॥ ఆలోలనయననలభూ
పాలునిమదిఁగోరివేడ్కఁ బరిణయమయ్యెం
గాళిక పురశాసను నా
శ్రీలలన మురాంతకుని వరించినరీతిన్॥ 248

వ॥ అనినఁ గోపోద్రేకుండును, దిరస్కృతసమస్తలోకుండును, గంపమానగాత్రుండును, నరుణీకృతనేత్రుండును నైకలియిట్లనియె. 249

మ॥ వినుఁడీవేల్పులునాప్రతిజ్ఞనల పృథ్వీజానిన్ జీకిన్
గొనకాభీమతనూజఁజేకొనియె దిక్కుల్ భూమితారల్ దివం
బుసర్వంబునెఱుంగనందునతనిన్ బూమేటులం బెట్టియా
లినిరాజ్యంబును బాపి నొంచెదను జాలింబెట్టి గారించెదన్॥ 250

ఉ॥ మాయలఁబెట్టి ఘోషమగుమర్మములంజలపట్టి లేనియ
న్యాయములైనఁజుట్టి సిరినాశిలిపోవఁగవట్టి యాలితో
వేయిలు వెళ్లఁగొట్టి పదివేలవిధంబుల నేతునింతగాఁ
జేయకయున్న నేఁగలినె సీ! చలపాదులచక్రవర్తినే॥ 251

సీ॥ చలపట్టియులనెట్టిసంపన్నునైనను దిరిపంబుగాఁజేయుబిరుదు నాది
వెనుద్రొక్కియెంతపుణ్యునినైన నొకవేళ దురితముల్పొందించుబిరుదు నాది
కనలుచునెంతటిఘనునైన చీకాకుపఱచిమాయలఁజుట్టు బిరుదు నాది
పసగుంచిమేటిసాహసినైన లోఁబూనిపిఱికిపందఁగఁజేయుబిరుదు నాది॥
గీ॥ ఇట్టిచలపాదినాట నన్నెఱిఁగియెఱిఁగి
యెట్టులు కైకొనె దమయంతినీనలుండు
కొఱవిచేఁబూనితలగోఁకు కొనఁదలంచె
కటకటా గర్వమున మీఁదుగానఁడయ్యె॥ 252

క॥ చలములకు నెలవు మత్సర
ములనిలకడ కార్శ్యములకు మూలము కోపం
బుల పెంకి కలహములగనిఁ
గలి నెఱుఁగరె నన్ను లోకకంటకమూర్తిన్॥ 253

వ॥ ఇట్టి రేను మత్సరంబునం దొట్టియు, మాయలం జుట్టుముట్టియు, సంపదలు నివారించియు, సతి నెడగావించియు, దుఃఖంబునం బొరలించియు, దురితంబులం దొరలించియు, నొంచియు, వంచియు, వేధించియు, బాధించియు, నొడించియు, పీడించియు, పెక్కుభంగులఁ జెఱుచువాఁడనని పల్లదంబులాడిన నాత్కుల్లసునివచనంబులు విని దిక్పాలురు కరంబులన్ గర్ణంబులు మూయుచు నారాయణస్మరణంబు సేయుచు నతని నుద్దేశించి యిట్లనిరి॥ 254

క॥ ఓకలి నిషధేశునకున్
నీకున్ బనికలదె యిదియు నీతితలంపన్
లోకులు నిన్నానందురె
కాకధ్వజ దీన నేమి కలిగెడుఁ జెప్పుమా॥ 255

చ॥ అమలచరిత్రుఁడైన నిషధాధిపుఁ జేరి ల్చెదనంచు నేలక
య్యమునకుఁ గాలుఁద్రొవ్వె దిపుడక్కట యెక్కుడనైన నిట్టిపా
పముగలదే యతండు నినుఁ బైకొనవచ్చెనె నీవు లేనివై
రము మదిఁబూన నేమిటికి రాయిడికింతటికాతఁ డోర్చునే॥ 256

సీ॥ అతులితాకారవర్ణితపంచబాణుండు మండితసత్కీర్తిమండనుండు
చిరతరౌదార్యనిర్జితకల్పభూరుహుండు సమానకరుణాపయఃపయోధి
వరహితగుణశాలి వరదానశీలుండు సత్యసంపన్నుఁడు శాంతమూర్తి
కలుషదూరుఁడు పుణ్యకలితుఁడాశ్రితలోక సంరక్షణుండార్యజనసుతుండు॥

గీ॥ నీరజోదర దివ్యపాదారవింద
మధురమధురసపరిపూర్ణమానసుండు
వీరసేనతనూజుండు విభుఁడు నైష
ధేశ్వరుండిట్టి వెతఁ జెంద నెట్టులోర్చు॥ 257

క॥ లోకస్తుత్యుని నైషధ
భూకాంతుని నిట్టి వెతలఁ బొందింపంగా
నీకు ఫలమేమి చేకుఱు
నీ కలుషపుబుద్ధి మాను మీ మదిలోనన్॥ 258

వ॥ అనిన నక్కలిమిక్కిలి కోపాటోపంబుచూప నీపాపకర్ముండు విననేరండేమిసే
యుదుమని నిట్టూర్పునిగుడించుచు నాఖండలప్రముఖులు వెండియునిట్లనిరి. 259

క॥ వలదనినమాననేరవు
కలి ! శోకలియెక్కువెట్టగాఁదివిరెదు న
ట్లలనలునివమ్ముపఱుపం
దలఁచెదవీబుద్ధినీకుఁదగునెతలంపన్॥ 260

ఉ॥ భూరిగుణాఢ్యుఁడైన నలభూతలనాథుననాథురీతులన్
వారకఘోరకాతురతవందురఁ జేయుదునంచునెంచునీ
పౌరుషమెల్లడుల్లఁగ నపారకృపామతిచక్రపాణి తా
భోరనవచ్చియానలునిబ్రోచుఁ జుమీసదయాంతరంగుఁడై॥ 261

సీ॥ బహుజలాన్వితజలగ్రహనిగ్రహముఁ జేసిదంతిఁబోషించినశాంతమూర్తి
దుర్వాసుఘనగర్వనిర్వాపణమొనర్చి యంబరీషునిబ్రోచినట్టిశౌరి
రక్షఃకులాధ్యక్షుశిక్షించి ప్రహ్లాదుఁజేపట్టుకొనినకృపాపయోధి
యరిఁబూనిమధుకైటభాదుల నిర్జించిసురలఁబాలించినపరమపుణ్యుఁ

గీ॥ డేపుమైజాతరూపాక్షురూపుమాపి
యవనిఁగాచిన యాదినారాయణుండు
నిన్ను నీమత్సరముఁగూడ నేలఁగలిపి
నిషధనాథునిరక్షింపనేరకున్నె॥ 262

వ॥ ఇదియెఱింగి నీవుమేలుగ్రహించుటమేలు. ఇంకంజాలుఁబదమనిచెప్పిన నప్పాప
మూర్ఖుడువిననేరకుండిన. 263

క॥ ఇటనెన్ని చెప్పినను మ
ర్కటముష్టివిధంబెకాని క్రౌర్యస్థితినె
ప్పటిపూన్కివదలఁడేమన
గటకటనలుడింకనేమిగానున్నఁడో॥ 264

క॥ దురితాత్ముఁడు వీఁడేమిటి
కరుదెంచెను వచ్చియట్లులాడఁగనేలా
హరిహరియొక్కడిచూపర
దరికొనెమనకిప్పుడనుచుఁ దమమదిలోనన్ 265

వ॥ వెతపడుచున్నంత నాఖలునితోఁబలుపలుకులేల పోవుదమనువారును, సురవరుం

డూరక కెరలించెననువారును గారణార్థంబుఁదప్పింప నేరకిఁ దరంబు కాదనువారు ను నలుఁడగణ్యపుణ్యగుణశాలి యతనిదురితంబులుపొంద నేరవనువారును దమ యంతి పరమపతివ్రతాతిలకంబు తన్మాహాత్మ్యంబున నతనికేమిగావచ్చునను వారు ను నైసెక్కండ్రు పెక్కువిధంబుల నాడుచు మఱియు నాపన్నశరణ్యుండును ననాథనాథుండును దీనజనసంరక్షణుండును జగదాధారుండును భక్తవత్సలుండును నకారణసుకృతియు నపారకృపానిధియు సర్వజీవదయాపరుండును సర్వాత్మకుం డును సర్వాంతర్యామియు శరణాగతవజ్రపంజరుండును నార్తత్రాణపరాయణుం డును నగు శ్రీమన్నారాయణుండు నలునిరక్షించుఁగావుతమని దీవించివారలు యథాస్థానంబులకుంజనిరి. అంత పాపసముత్కర్షుండగు కలిపురుషుండితరంబు మఱచి పరమపుణ్యుండగు నిషధమహీపాలుం జెఱుచుటయే తనకుఁబరమలాభంబని తలంచి కామక్రోధాదిపరివారంబులు తనవెంటనంటిరా నిషధనగరంబున కభిము ఖుండై చనియెనంత. 266

లయగ్రాహి॥ దుందుభినినాదములు గ్రిందుకొన వేత్రిసలు
సందడులుతీర్పభట బృందములుకొల్వన్
వందిజనవారములు ముందరఁదురాయిజన
గందరలలోచనలు పొందుగ నటింపన్
గుందనపు టెక్కెము లొగిందగ శచీయుతపు
రందరునిచందమున సుందరియుఁదానా
నందముల డెందములఁ జిందులుకొనంగ నలుఁ
డిందుకులవార్ధి నగరిం దరియవచ్చెన్॥ 267

క॥ దశవాయులుంబ్రధానులు
తలవరులుం బౌరజనులు దక్కినభటులో
టులువచ్చి తనకు నిరువం
కలసందడిమీఱనడువఁగా ముదమొదవన్॥ 268

ఉ॥ భూసురవేదనాదములు భోరుకలంగఁగఁ బేరటాండ్రొగిన్
సేసలుచల్లఁ బౌరసరసీరుహనేత్రలు మంగళారతుల్
భాసురలీలతో నొసఁగ బాలకసంతతి వాడ భీమక
న్యాసహితంబుగా నిషధనాథుఁడొనర్చె గృహప్రవేశమున్॥ 269

చ॥ భవహరభావ్యభిన్నగుణ భద్రకృపావనభీష్మవందితా
భువనధృతల్పభూరిగుణభూషణ శేషదినేశనేత్ర భై
మివరదభోగిమస్తక సమిద్ధనటత్పదపద్మభౌమద
ర్పవనదవానలాక్షి భరభండనభైరవ భర్గసన్నుతా॥ 270

క॥ పరహితరహితాఘసము
త్కరకరధృతశంఖచక్రఖడ్గగదాభా
సుర సురవందిత హతభీ
కరనికషాత్మజనికాయకాయజజనకా॥ 271

ఉత్సాహ॥ దూరితారిభూరిదర్పదోరపారశూరసం
సారదోషభంజన ప్రచారదారణావనా
నారదాదిమౌనివంద్య నాకలోకవైరిసం
హారహారహీరవాగనంతకీర్తివర్ధనా॥ 272

గద్య॥ ఇది శ్రీమదాచ్చివరద గురుచరణస్మరణాభ్యసన రసనావికాస తిరుమలగిరి వేంకటేశ్వర వరప్రసాదలబ్ధకవితావిలాస హరితసగోత్ర సిరిప్రగడ తిప్పన మనీషిపుత్ర సుజనవిధేయ ధర్మయనామధేయ ప్రణీతంబైన నలచరిత్రము నందు.

చతుర్థాశ్వాసము
సమాప్తము.






# నలచరిత్రము.

## పంచమాశ్వాసము.

క॥ శ్రీయలమేల్మంగాముఖ
తోయరుహభ్రమర భూవధూకరనఖరాం
కాయుతగండస్థల గాం
గేయాచలధీర శేషగిరిసంచారా॥ 1

వ॥ అవధరింపు మట్లు గృహప్రవేశంబయి గౌతమమునీంద్రానుమతంబున గృహదేవతారాధనంబును సమయసముచితకృత్యంబులుం జరిపి బాంధవామాత్యాదిజనంబుల యథోచితసంభావన సంభాషణాదుల సంతుష్టాంతరంగులం గావించిపంచి యంత యొక్కనాఁడు. 2

సీ॥ చతుఃప్రమోదకృచ్చతురక్రమంబులఁ జెలువొందఁ గోడఁచిత్తరువులు
తపనీయమాంజిష్ఠతతవిచిత్రస్ఫూర్తి మించినచెంగావి మేలుకట్లు
చుట్టురా వెలినొప్పుసోరణగండ్లలోఁ బఱచుబల్కులఁగుల్కుపారువములు
పాసీతిబంధలక్షణము లేర్పఱపించు బంగారుప్రతిమలపట్టుతెరలు॥
గీ॥ పరిమళద్రవ్యసంపూర్ణధర్మపీఠి
కానికరముగ వాతువితానములును
గలిగికనుపట్టునవకేళికాగృహంబు
డాయ నేతెంచె నలమహీనాయకుండు॥ 3

వ॥ అందు. 4

సీ॥ పవనసంగతిరాగపద్ధతిఁ దము తామె యొగిఁ బల్కు వీణె లొక్కొక్కచోట
మలయానిలాంకురావలులు పైఁ గొనివీచు నురువీజనంబు లొక్కొక్కచోట
కరదీపికలఁ బూని కదిసి వెంబడిఁ జాగ నొప్పఁగీల్ప్రతిమ లొక్కొక్కచోట
సంతతార్థదరత్నచయకీలితములైన యున్నతాసనము లొక్కొక్కచోట॥
గీ॥ ఒక్కచో దోమతెరమంచ మొక్కచోట
సొరపుటుయ్యెలమంచము లొక్కచోటఁ

బలుకుసకినలమంచముల్ గలిగితనరు
తద్విలాసంబుగని ప్రమోదమునఁబొంగె॥ 5

గీ॥ ఆవిధంబునఁ జెలువొందు నతివిచిత్ర
మణిమయంబైనయట్టి హర్మ్యప్రదేశ
మందువసియించియద్దమయంతిరాక
కెదురుచూచుచునుండె నయ్యిందుకులుఁడు॥ 6

వ॥ అంతఁగళావతి ప్రముఖులగు సఖులుకోరికలీరికలొత్త, నెత్తమ్మిపగతునగు మొగంబుల నగవుచిగురొత్త భీమపుత్రింగనుంగొని. 7

చ॥ తనమదిఁగోరినట్టి నిసుదైవతనాధులఁగూడుమంచు వ
చ్చినయపరాధినీకిపుడు చేతికిఁజిక్కెమృగాక్షినీవువే
గనతనిగ్రిందుగాఁబెనఁగి గంపపురొంపినిదొ్రసిలోమ్మపై
పెనుజనుగొండలెత్తికళు బింకముఁజూపఁగదమ్మకోమలీ॥ 8

సీ॥ ఆదినవ్విభుగాయకావళిచేసిని సనుపుసేయగఁగోరు నాఁటితలఁపు
రాయంచరాయబారమువచ్చి పోయినపిదపనీమదిలోనియెదురుచూపు
పరుఁడింద్రమూర్తియైయరుగుదెంచినఁ జూచిమరులుకొన్నట్టినీమనసుకోర్కె
నిరుపమంబైనసంవరణకాలమున సంకల్పించునీమనఃకాంక్షితంబు॥

గీ॥ లహహ నేఁటికి సమకూరెనంబుజాక్షి
మగడునీవును జెలరేఁగి పగలురేయు
సురతతంత్రక్రమమ్ములఁ జొక్కిచొక్కి
యతులితానందజలధినోలాడరమ్మ॥ 9

గీ॥ విపులసంగ్రామకేళిమైరిపులఁగ్రిందు
పఱచికేరెడియానిజప్రాణనాధుఁ
గడిపిబిగియారఁగౌఁగిటఁబొదివిపట్టి
భావభవకేళిమైఁగ్రిందుపఱుపవమ్మ॥ 10

వ॥ అని మేలంపుమాటలాడుచుఁ దత్సతీరత్నంబునతిప్రయత్నంబునందోకొని చనునప్పుడు॥ 11

గీ॥ ఇంతిలజ్జాంబునిధి వెళ్లనీఁదలేక
యలసినిల్చినగతినిల్చునచటనచట
సఖులపుడుయానపాత్రలచందమునను
బ్రోలత్రినడిపింతురొయ్యనబుజ్జగించి॥ 12

క॥ ఎనసినలజ్జాభయములు
పెనఁగొనినలేఁత్రుకితి పిఱిచికిఁదిగువన్
వనితామణియీడ్గిలఁబడు
వెనుకకుఁబోనీనిరాగవిభవప్రౌఢిన్॥ 13

ఉ॥ పాడిగనంచతోఁ గదిసిపల్కనదిట్టతనంబు దూతయా
నాఁడువచోప్రగల్భనిధి నాథునితో నెదిరించినిల్చునా
ప్రౌఢతనంబు నెచ్చటికిఁబోయెనొ కాని యెఱుంగదప్పదా
చేడియఁగప్పినట్టి బలుసిగ్గు గణింపఁగ నబ్రమయ్యెడన్॥ 14

గీ॥ బాహ్యమునఁజూడ నప్పుడప్పద్మనయన
కొదవులజ్జాభరంబటులుండుఁగాని
యంతరంగస్థలంబున నరసిచూడఁ
బ్రియునిఁగదియంగఁ దమకంబుపిక్కటిల్లు॥ 15

చ॥ ఎనసినలజ్జచేత నొకయించుకస్రుక్కుచునిల్చునిల్చియం
తనెపయిఁగొన్న రాగమునఁ దానొకయించుకసాగు వెంటనే
పెనఁగొనుసాధ్వసంబునను బిమ్మిటపాటునుబొందుఁగ్రమ్మరం
మునుకొనుతత్తరంబునను ముద్దియకోరుహృదీశుఁడాయఁగన్॥ 16

వ॥ మఱియును, 17

గీ॥ చెలులుసరసంపుబలుకులు పలుకనొదవు
నగవుఁగనుపడనీయక మొగమువాంచు
నదియెఱిఁగివారు గుజగుజలాడనోర
చూపులనుజూచి మదిలోఁగుందరాఁగి॥ 18

వ॥ ఇవ్విధంబున. 19

క॥ చెలులతోఁదోపులాడుచు
బలిమినినడిపింపనిలువఁ బడుచునడుచుచున్
నిలుచుచునడచుచుఁదొయ్యలి
పలరాయని మదగజంబు వైఖరినొప్పెన్॥ 20

వ॥ ఆసమయంబున. 21

సీ॥ తడవాయె నేలొకోతరుణిఁదోడ్తెరని మదిలోనితహతహ నెదురుచూచు
నెమ్మొగ్గుచూచినమీఁదనెంతనిర్దయులని బదరిశాపులమీఁదఁబగలుచాటు

పగలుపాటినమీఁదఁబోనుపుడిగివచ్చి యల్లనడచపవ్వడాలకించు
నాలకించినమీఁదనటనిల్వనత్తుకో గ్రక్కుననని శయ్యకడననిల్చు॥

సీ॥ నిలిచినిమిషార్ధమేను గాఁదలఁచితలఁచి
లేమఁబవళించుఁగ్రమ్మఱలేచు గాఢ
శౌర్యతరదర్పకోన్మాదజనితమోహ
పరవశుండైననిషధభూపాలవిభుఁడు॥ 22

వ॥ అంతటఁగళావతి యువతిముందటంబను దెంచినం గాంచి. 23

ఉ॥ ఏమె వధూలలామ పనియేమి నృపోత్తమ నేఁడు చీకటిం
తేమితిమీరెఁబోదరమె దీపముఁదెచ్చినఁగాని పోవఁదా
నేమటి దీప మెప్పటికి నీవిటు తెచ్చెదో యిట్టె తెచ్చెదన్
బోమదిరాక్షి జాగుడిగి భూవర పోయెదనంచు నన్నెడన్॥ 24

వ॥ వెండియు. 24

చ॥ హరినిభమధ్య నే నడిగినప్పటిమాటల నాత్మనుంచు క్రొ
వ్విరిపనియేమిపట్టినను వేడుకతావులొసంగుఁగాని యే
మఱబిగబట్టఁగంనువిసుమానిని యేమఱ నింతమాత్రమే
నరయనె యెట్టివారిమఱుఁడాగతిఁజేయఁగవిన్నవించితిన్॥ 26

వ॥ అనిపలికి యక్కలికి దమయంతికెదురుచని సమయసముచితవచనంబులు కొన్ని ప
లికి యయ్యలికులవేణిం దోకొని కేళీగృహాభ్యంతరంబు సొత్తెంచి. 27

సీ॥ చెంబుదేమఱచివచ్చిరదేమి చెలియన్న తరుణి తెచ్చెదనని తారెనోర్తు
విరులేమఱియవచ్చితిరదే మగువయన్నఁ గాంత తెచ్చెదననిక సికెనోర్తు
సునటిఁదేకయవచ్చితిరదే కలికియన్న సుదతి తెచ్చెదననిసుడిగెనోర్తు
కురు వేమఱచివచ్చితిరదే ముగుదయన్న వతివ తెచ్చెదననియరిగెనోర్తు॥

గీ॥ నెచ్చెలులనివ్విధమునఁ బనిచి కళావ
తీరమణి వెన్క వెన్కకు జారెనపుడు
చెలువలందఱుఁబోవుటఁదెలిసి భైమి
బెగడుచును నల్గడలు చూచి మగుడుఁటపుడు॥ 28

క॥ శయ్యడిగివచ్చి నాథుఁడు
చయ్యనఁ జెయ్యొడిసిపట్టిచన్మనలెదపై
యొయ్యంగనలమి మొచటికిఁ

బాయ్యెదవనియెత్తి తల్పమునకుఁ జేర్చెన్॥ 29

వ॥ ఇట్లు చేర్చి. 30

ఉ॥ చేడియ యున్ని నాళ్లు మఱుచేతి వెతంబడినట్టి నన్ను నీ
కోడె మెఱుంగుచన్ను లెదఁ గ్రుచ్చఁగఁ గౌఁగిటఁ బిగ్గఁ బట్టి నీ
ఓడెపుచారమోవి సుధవిందులొసంగి వినోదకేలినో
లాడుచుఁ గూడి వాడి హృదయంబు గరాత్తఁగఁ జేయవే సఖీ॥ 31

చ॥ పుడమిని బెంపుమీఱు నృపపుంజము చేఁబనిఁగొన్న నేను నీ
యడిగము సేయఁగోరెదఁ దలోదరిఁ నన్ బనిగొమ్మ వేగ నీ
యెడఁదమి నాపనోప నొకయించుక యొందల యెత్తి చూచి నా
బడలిక తీరమైనివిరి భావజుబారికిఁ బాపవే చెలీ॥ 32

సీ॥ పేర్మి నీ బంగారు పేరే నాడిచికొంటి వామాక్షి మొలకట్టు వదలవేల
కమ్మ నా కదనైన నైకొంటిఁ గోమలి మురువులుపచరింప మొనయవేల
నాతి నీ మెడదండ నాచేతికిపుడబ్బె సరిగఁ గూటువలీయఁ జాలవేల
బోటి నీ మొద నానిపుడగోరికొనఁగొంటి జోడందియల మేలు చూడవేల॥

గీ॥ ఇంతి వలరాజునకు లంచమిచ్చి నేఁడు
గోప్యమునఁ బనిఁగాఁ జేసికొనఁగఁ దలఁచి
యంగరాజ్యంబు లెల్లనిన్న డిగినాడఁ
గడను కాకుండ నీరాదె కరుణఁ జేసి॥ 33

క॥ అనిపలికి పలికి యప్పతి
తనమనమున పులకలెత్తి తమకపుఁ దీవల్
కొనసాగి పెఱిగి పెనఁగొని
మును కొనఁగా నాపరాని మోహోద్వృత్తిన్॥ 34

సీ॥ ముద్దు పెట్టుటకునై మొగము మొకించుక చాఁపఁ బడతి మోమటు సేయ నెడపుఁదప్ప
నుదుటు జన్నులఁ గేలొయ్యనఁగదియించు నబలమైఁగడవంపనదనుదప్పఁ
బరిరంభణము సేయ సరసమెల్లన డాయ నబ్జాక్షి పెడబొర్లననువుఁదప్పఁ
జెక్కిటఁ జెక్కుఁ జేర్చెదనంచు దివురు నవ్వనిత యోరగఁ జేయ నైపుఁదప్ప॥

గీ॥ నసమకుసుమాశుగ ప్రేరణాతిమోహ
పరవశుండైన యట్టి యన్నరవరునకుఁ
బ్రథమసురతసముత్పన్న పృథులహ్రీప్ర
కర్షయై బాల యభిముఖి గామికతన॥ 25

వ॥ మఱియును. 36

చ॥ చనుఁగవచాయ చేఁబఱుప జవ్వనియచ్చటఁ గేలుదోయి మూ
సిననిజపాణిపల్లవముఁ జెక్కిటఁ గొయ్యనఁ జాఁచ కాంత యం
తనెకరముల్ కపోలములదాఁపనురోరుహముల్ బయల్పడన్
గనినిభుఁ డంతలో నొడిచి గ్రక్కునఁ బట్టెను పాయసంపదన్॥ 37

గీ॥ పుడమి ఱేఁడట్లు చనుఁగొండ లాడిసిపట్టఁ
దరుణి పెనఁగుట మఱి వెఱ్ఱితనము గాదె
పార్థివేంద్రుఁ బట్టినపట్టు వదల
నేరతు రెయ్యుగ్ధలరయంగ లేరు గాక॥ 38

క॥ చనుఁగొండలు చేపడుటకు
మనుజేంద్రుఁడు హర్షజలధిమగ్నుండయ్యెన్
మనమునఁ గోరిక లెల్లను
దనకొదవినముదము గాదె ధర నెవ్వరికిన్॥ 39

గీ॥ బాల పెనఁపవలెఁ గ సేలపనికివచ్చు
నతులితోపాయపరుఁ డైన యధిపుమ్రోల
కఠినతరములు రోజదుర్గములుఁ దొరకె
లోఁబడక యున్నె మెత్తనిలోనికోట॥ 40

ఉ॥ కలికి మెఱుంగుజన్నుఁగవ కాయలు మెట్లువకొల్ శరీరపు
రొయ్యిశేవలరోమరాజి నయమొప్పెడు త్రివళియగాధ రావరుం
డలరుచు నట్టిపీఁ బ్రియమారగఁ బ్రొమ్మన నానిపట్టి తాఁ
గలుకుచుఁ బాడె వారమణికూజితముల్ రతిరాజగీతముల్॥ 41

గీ॥ ధవుఁ డుతపఁబడ నీవిబంధనము విడుచు
నప్పుడు చెయ్యొడ్డమిడి పెనఁగాడియాడి
బాలవేసరిపట్టినపట్టు వదలె
నబలపఁపరంబె పెనఁగంగఁ బ్రబలుతోడ॥ 42

వ॥ అప్పుడు. 43

సీ॥ బలువైననిజమోహబలములఁ బైకొల్పి సాహసక్రియలనెచ్చరికఁ జేసి
కడువాడి మొనగోరకత్తులఝళిపించి యొదిదియంగఁ బులఁ గదిసి చెనకి
కాలుమూఁకలపీకఁ గడమఁ బాయఁగఁ బట్టి యాలోనఁ గొఁతపోటాటు చూపి
తొడరివక్షోరుహదుర్గముల్ చేకొని నడుచక్కి నొక్కింతతడవు పెనఁగి॥

గీ॥ యింతియౌవనసామ్రాజ్య మెల్లనొడిచి
వెలయ నసహాయశూరుఁడై విజయమంది
యంగజస్థానరుక్మసింహాసనమున
మహిమనొడ్డోలగంబుండె మనుజవిభుఁడు॥ 44

గీ॥ పలుకరించిన మారుమాట పలుకకయును
బాహువుచ్చోన ల్లిబిల్లిగాఁ గదియకయును
కూడునత్తఱి మొగమిచ్చి చూడకయును
చామ గనుపించె నూతనసంగమమున॥ 45

వ॥ అంత. 46

క॥ జననాథుఁడు కొండొక నే
ర్పునమునముఁ జేర్చి మదోదరబోధింపంగా
దినదినమునకించించుక
వనితకు లజ్జాతిశయము వదలం బాఱెన్॥ 47

గీ॥ పిలువఁ బిలువంగ మెల్లనఁ బలుకునొలికి
యోరచూపుల నెఱుఁగ రాకుండఁ జూచు
కౌఁగిటకుఁ దీయ నొక్కింత గదియవచ్చు
సుదతి లజ్జానుబంధంబు వదలుకతన॥ 48

సీ॥ పలుమారు పిలిచిన పలుకకుండెడు గోల కులుకు తెలుంగులు పలుక నేర్చె
కరమంటి తివిచినఁ గదియ నేరని పూప యలరుఁ గౌఁగిట బిగ్గ నలమ నేర్చె
ముద్దువెట్టెద నన్న మొగమీని పనిబాల పంటిపంటగ మోవి యంట నేర్చె
చేయి మీఁద వేయుమన్న భయమందు కన్నియ మొనవాడి కొనగోళ్లఁ జెనక నేర్చె॥

గీ॥ నంటుముట్టంగ మదిలోఁగనట్టి ముగుద
ప్రియునితో నంతకంతకు బెనఁగ నేర్చె
మొదల రతికోడి కడుముచ్చముణుఁగు నబల
కదిసి తను దాన యుపరతి గలయ నేర్చె॥ 49

ఉ॥ క్రొమ్ముడి వీడి దట్టపు విరుల్ జలుజల్లన రాలి నెన్నొసల్
చెమ్మటలింగ హారములు చిందులు ద్రొక్కఁగఁ గంకణధ్వనుల్
గ్రమ్మఁగ నిబ్బరంపు వలి గబ్బిచనుంగవ చాకలింపఁగాఁ
గొమ్మ వినోదలీలమగకూటమిఁ జూపు విచిత్రవైఖరిన్॥ 50

మ॥ ధరణీనాథునకప్పుడంబోదవ నృత్యద్వేణీధారాధరో
త్కర మాలింగనకుండలప్రకరయుగ్మంబైంద్రచాపంబు రా
ల్వీరిమొగ్గల్ కరకల్ తనూభవనవస్వేదంబువర్షంబుగా
సురతక్రీడను నాఘనంబుఁదలపించున్ భామపుంభావముల్॥ 51

క॥ సతిఁగ్రిందువఱుమపతియును
బతిఁగైకొనసతియు నగుచుపరిపరిగతులన్
జతురకళాస్థితులేర్పడ
నితరేతరకృతరతంబులింపుఘటించెన్॥ 52

క॥ పుక్కిటివీడెపుసొంపులు
చెక్కిటజవ్వాదిజారు చెమటలముంపుల్
ఒక్కటపుఁగౌఁగలింపులు
మిక్కుటమైయొప్పెనపుడు మెలఁతకుఁబతికిన్॥ 53

మ॥ కరపద్మంబులుకుంతలభ్రమరముల్ గండోత్పలంబుల్ పయో
ధరచక్రంబులు నేత్రమీనములువింతల్ చూపు శృంగారవ
త్యురు లావణ్యసరోవరాంతరమునందోలాడు నెల్లప్పుడున్
ధరణీనాయకరాజహంసము సముద్యత్ప్రీతిసంధిల్లఁగన్॥ 54

క॥ చిరకాలమివ్విధంబున
నిరతానందములనొంది నెలకొనఁగా న
య్యిరువురకును నుదయించెను
స్థిరపుణ్యుఁడుతనయుఁ డింద్రసేనుఁడనంగన్॥ 55

క॥ ధరఁగొండొకకాలమునకు
సిరిదళుకొత్తంగనింద్రసేనయనఁగఁగూఁ
తురుపుట్టెవారు వెలిచిరి
శరనిధికడచంద్రపద్మసద్మలపోల్కిన్॥ 56

వ॥ ఇవ్విధంబున. 57

గీ॥ పుత్రిసంపదసంపదపాలుపుమిగుల
మదనసామ్రాజ్యభువనసామ్రాజ్యములకుఁ
గరమొదమయంతితోఁగలసినలుఁడు
ధరణి వెలసె శచీపురందరునివోలి॥ 58

ఉ॥ అంతకుమున్నె ద్వాపరసమన్వితుఁడై కలిదైవతాళితోఁ
బంతములాడి నైషధనృపాలకుఁ గీడ్పడఁజేయఁబూని య
త్యంతమనస్కుఁడై కదిసి గర్వమహంకృతిమీఱఁ దత్పురీ
ప్రాంతముఁజేరవచ్చె హృదయంబున రోషము భీషణంబుగన్॥ 59

క॥ అరుదెంచి నైషధోర్వీ
శ్వరసత్త్వము నతని సుకృత సంపదమహిమన్
జొరఁబారఁగఁ దలఁగానక
పురి వెలుపలఁ దిరుగుచుండెఁ బూర్వజయుతుఁడై॥ 60

వ॥ మఱియును. 61

సీ॥ ఏవంకఁ జూచిన గోవిందదివ్య నామామృతధ్యానపరాయణాత్మ
లేచాయఁ జూచిన నిందిరాధిపకథా కర్ణనపులకితగాత్రయష్టు
లేదారిఁ జూచిన నాదిదేవాచ్యుతపాద సరోజపూజావిధాననిరతు
లెచ్చోటఁ జూచిన నిభరాజవరదసేవాను రక్తిప్రమోదాభిరాము॥

గీ॥ లెందుఁ జూచిన కాకోదరేంద్రశయన
భక్తినిర్భరమానసపంకరుహులు
కలిగి వైకుంఠనగరంబుకరణిఁ దనరు
నిషధపురిఁ జేరి చొర నోడి నిలిచి నిలిచి॥ 62

క॥ నిరుపమమహిమాస్పదమగు
సరసీరుహనాభచరణ సరసిజసేవా
పరమానసాబ్జవైష్ణవ
వరులం దూరమునఁ గాంచి వడవడవణఁకున్॥ 63

గీ॥ దండిచెడి సురిక్కునెమటఁ ద్రిదండిగనిన
క్షితినిలకములు యాగదీక్షితునిఁ గాంచి
తరలఁగాఁ బాయఘనపుణ్యతములఁ జూచి
కలిపురద్వారసన్నిధి నిలిచియుండె॥ 64

వ॥ ఇవ్విధంబునఁ గొన్ని దినంబులు చూచి పురంబు చొరఁబార నశక్యంబగుటకు వెతపడు
చు నగ్నిజునకిట్లనియె. 65

క॥ ఈపురము వైష్ణవావలి
కాపురమా నాథుఁడిందుఁ గలుగుటకతనన్

ద్వాపర ! యతిదుర్గమమా
భూపాలునిగెలుచునట్టిపోకడలుడిగెన్॥ 66

ఉ॥ మానితపుణ్యవర్తనులు మాధవపాదసరోరుహద్వయా
ధీనమనస్కులార్యనుత దివ్యచరిత్రులు సర్వశాస్త్రవి
ద్యానిధులాగమాంతవిధులంచిత తత్త్వవిధిజ్ఞులుత్తమ
జ్ఞానులు వైష్ణవాగ్రిణులు శక్యమె వారిమహత్వమెన్నఁగన్॥ 67

వ॥ కావున. 68

గీ॥ వైష్ణవులఁగన్న గజగజవణఁకు మేను
భాగవతకోటిఁజూచిన భయము వొదవు
దైత్యరిపుభక్తతతి గాంచి తల్లడింతుఁ
గాన నేనోపనిషధభూకాంతు గెలువ॥ 69

సీ॥ కాయోపవేష్టితకరవీరకుసుమ వర్ణోత్తరీయకముఁ గణోత్కరంబు
ఆశాంతపటుతరహాస్యమంత్రద్వయా తురనికరంబులు కాపుబలము
కంఠావలంబితోత్కటవనమాలికా ప్రీతతులప్రాసల్ పిరంగిగుండ్లు
నిటలోపరిస్నిగ్ధనిర్మలాచ్ఛిద్రోర్ధ్వ పుండ్రముల్ డెంచనమ్ములుగఁదనరి॥

గీ॥ అరిగణములకుఁగడియంగనలవిగాక
యమరు వైష్ణవచయదుర్గమండఁగొనిన
నలునిఁ బైకొనిపోఁగంగ నావశంబె
తరముగానె మేకనోటికిఁదాళఫలము॥ 70

గీ॥ దానములు దేవపూజావిధానములును
యాగములు నిత్యసత్యప్రయోగములును
ధర్మములు నైష్ఠికాంచితకర్మములును
గలిగివర్తిల్లు నలునెట్లు గెలుతు చెపుమ॥ 71

క॥ నాకనఁగ నేల నైషధ
భూకాంతునికిం దుపఱుపఁ బూనఁదరమె సా
జ్ఞాకాంతో మాకాంతశ
చీకాంతులకైన పుణ్యశీలుండగుటన్॥ 72

ఉ॥ ఏటికివచ్చితిన్ దివిజులేటికి నాకెదురైరి ప్రాగ్వరుం
డేటికి ప్రశ్న చేసె నపుడేటికిబింకములాడుకొంటి నే

నేఁటికి వారిబుద్ధి నెకయించుకయుఁ జెవియానసైతి ని
ష్టేటికి మూర్ఖునైతి విధి నేమనిదూఱఁగ నేర్తునగ్రజా॥ 73

క॥ ఎక్కడినలుఁ డెక్కడ నే
నెక్కడ దమయంతి వైన మెక్కడ మనతా
వెక్కడ యొక్కడి రాకడ
యక్కట! కనుఁగొంగఁదరమె యవ్విధికృతముల్॥ 74

సీ॥ బౌద్ధసంతతియుఁ గాపాలికవ్రాతంబు గోరివర్తింపనికోటికొంప
శాక్తేయపసులును జైనులునునికిఁ గైకొనక రోషించినచెనటికొంప
పాషండులునుదిగంబరనికాయంబును జేరంగనొల్లనిచెడుగుకొంప
వైతండికులును జార్వాకలోకంబును గాపురంబుండనికటికకొంప॥

గీ॥ నెట్టుచేరితి మీకొంప యెఱుకలేక
ఉచితసద్గుణసంశీలుఁడొక్కఁడైన
దండదాఁపుగనిచ్చోటనుండవలదె
యుండినను వానిప్రాపున నొదుగవచ్చు॥ 75

గీ॥ ఏమి సేయువాఁడ నెక్కడఁజొత్తునిం
కెద్ది యుపమనలుని నెట్టులోర్తు
కార్యమూటనకిచటకాలూదనైనను
నేర్పుకానరాదునిక్కమరయ॥ 76

క॥ నాకతమున నపవాదము
నీకుఁ బ్రాపించుమగఁడనీ వేగము నే
లోకంబునఁగప్పంబడి
కాకివలెఁదిరుగుదుననుచుఁగావున నేడ్చెన్॥ 77

వ॥ అప్పుడు ద్వాఃపాలుండిట్లనియె. 78

క॥ పురివాకిలిచేర నేరవు
దొరకొనియెద్వంగ నేల తోడాయి చటన్
దిరుగుదము కొంతకాల
మ్మరయఁగఁజేకూఱునిడివినైనన్ గోర్కుల్॥ 79

వ॥ అని యొత్తికన్నిరతుఁడిచ్చిన ద్వాఃపారోపదేశంబునఁ గొండొకధైర్యంబుగా నక్క
లిపురబాహ్యప్రదేశంబునం బరివర్తింపుచుండి ప్రమాణపరిచారులై తమవెంట వెడ
లిపోయెడు బౌద్ధపాషండప్రముఖ దురాచారులం గనియుబ్బుచు. 80

మ॥ మదిరాపానులసోమపానులను జేరిమంజేరఁగాఁబోవు స
త్యదయాహీనులఁబుణ్యశీలురనుచుం దాత్పర్యముంజేయు ని
త్యదురాచారులనైష్ఠికోత్తములుగాఁ దానాత్మభావించు దు
ర్మదమూఢాత్ములశాంతచిత్తులగతిన్ భావించునమ్మందుఁడున్॥ 81

వ॥ ఇవ్విధంబునంబ్రవర్తింపుచుండి తత్సమీపంబున. 82

క॥ ఆతుచ్ఛుఁడప్పుడగ్రిమ
హీతలమునఁగాంచెఁగాకగృధ్రోలూక
వ్యాతతశాఖోపేతవి
భీతకమున్ సన్నిహితనిబిడపాతకమున్॥ 83

క॥ ఈతాడినుండి మెల్లనఁ
జాతంబిఁక నంచునగ్రజుఁడుతోడుగఁదా
నాతరుకోటరమునఁగా
ర్యాతురుఁడై పెద్దకాలమట్లుండుటయున్॥ 84

మ॥ ఒకనాఁడానిషధావనీరమణుఁడత్యుత్సాహమొప్పార వే
త్రికరుల్ సందడికొల్వఁగా సమదమాతంగోత్తమారూఢుఁడై
సకలోర్వీధవులెల్లడంగొలువనిచ్ఛాప్రవృత్తిన్ నేతెంచెఁదా
నకలంకస్థితిమీఱఁగానగరి బాహ్యక్షోణినీక్షింపఁగన్॥ 85

వ॥ ఇట్లువచ్చి. 86

గీ॥ ఘనములగునట్టివనములు కాంచికాంచి
నిండుచెరువులపొర్వుల నిలిచినిలిచి
చెఱకుగుంపులముంపుల నొఱసియొఱసి
తేనెబావులక్రేవలఁ దిరిగితిరిగి॥ 87

క॥ ఒకచోహయములఁదోలుట
నొకచోనేనుఁగులుపోరుటొగిఁజూచుచు నెం
డొకచోమల్లులగాంచుచు
సకలోర్వీధవుఁడు మరలఁజనుసమయమునన్॥ 88

గీ॥ క్షితివరేణ్యుఁడంతఁ గృతమాత్రుఁడైజల
స్పర్శ సేయునపుడు చరణయుగముఁ
గడుగమఱచినట్టికతమున నతనిపై

కొనిదెనఘుముసందుకొనియెంగలియు॥ 89

క॥ త్వరితగతిఁగవిసెఁగరిభీ
కరవిమతమదాపహరణఘనసోమకులా
భరణుంభూభరణుంసిత
కిరణుంగబళించుసంహికేయునిపోల్కిన్॥ 90

వ॥ అప్పుడు. 91

గీ॥ రాహుముఖదష్టుఁడైన యారాజుకరణి
కళలుదిగజారియొండుమార్గంబుగలిగి
కలిసమాశ్రితదేహుఁడైకదలివచ్చి
నగరుసొత్తెంచియుండెభూనాయకుండు॥ 92

క॥ తదనంతరంబకలినలు
పెదతండ్రికుమారుఁడతనిపెంపుఁగనఁగనె
మ్మది సైరింపనిజడుఁబుష్కరుఁ
గదియంజనుదెంచివానిఁగనియిట్లనియెన్॥ 93

వ॥ ఏనుకలిపురుషుండ నితండుమదగ్రజుండగు ద్వాపారంబేమిరుపురము నలునందధిక మాత్సర్యంబుపూని యతనిదరియందరిగానక తత్పురద్వారప్రవేశంబునం గవసియున్న వారము. నాకుసహాయంబుగ మహాత్ముండెవ్వఁడుగలుగునొకోయని యూహుందలపోసి నీవతనిపితృవ్యపుత్రుండ వతండుదుండగంబునం బితృవ్యభాగంబునీకీక, ఏకభోగంబుగాఁగైకొనుటయుఁ దనదిగ్విజయంబుననిన్నుం బరాజితుంజేయుట యుఁ గారణంబుగా మనంబునందువైరంబుపూనినవాఁడవనియును జ్ఞాతివైరంబు కంటె నితరవైరంబులుసామాన్యంబులనియును నినుఁదోడుగొనవచ్చితిననిన నాము ష్కరుడనఘుఁ బుష్కరుండిట్లనియె. 94

క॥ జ్ఞాతివిరుద్ధంబుయశో
హేతుకమఘుకరమునింద కెక్కుడధర్మా
పేతముతద్విధిమెలఁగెడు
పాతకులకుసెందునిహాముపరముల్గలదే॥ 95

వ॥ కావున నిట్టిదుర్ణయవ్యవహారంబున కేనొడంబడననిన నతనింగని వెండియుఁగలియిట్లు
నియె॥ 96

క॥ నలుసామ్రాజ్యశ్రీని

న్నలముకొనందలఁప నెల్లననఁదగఁగనే
తలపైవ్రాలినవెన్నిధి
తోలుతంగడఁబారవైచుదుర్మతికలఁడే॥ 97

వ॥ మఱియును. 98

మ॥ నీతిజ్ఞుల్నరేంద్రయానతతులన్మానంబులేమింగటల్
ఘాతక్రీడఁగుఠారకాష్ఠమిలవృక్షవ్రాతముఁద్రుంచుటల్
జ్ఞాతిత్వంబునకాదెజ్ఞాతులెచటన్ సామాన్యులేచెల్లఁబో
జ్ఞాతిశ్చేదనలేనకిమ్మనెడుశాస్త్రంబుల్ పరీక్షింపవే॥ 99

క॥ జ్ఞాతులుమిగులగృతఘ్నులు
జ్ఞాతులెపో మేలుచూడఁజాలనికుమతుల్
జ్ఞాతులుకుటిలవిచారులు
జ్ఞాతులకంటెనిలవేఱెశత్రులుగలరే॥ 100

వ॥ ఇట్టిజ్ఞాతులయెడ మిత్రభావంబున మెలంగఁదలంచుట కర్తవ్యంబుకాదనియునుం గాక.

సీ॥ అన్నదమ్ములుగారె యాదిత్యదైతేయు లనిశంబుపోరిరికినుక లేచి
తోఁబుట్టువులుగారె తుదవాలిసుగ్రీవు లాకరణంగినదాఁక నెరసిరెయిది
సాపత్న్యులుగారె చక్షుశ్శ్రవఃఖగాధిపులువిద్వేష మెల్లప్పుడుగొనిరె
దాయాదులునుగారె ధర్మపుత్రసుయోధనులు కులక్షయముగాఁగలనుసలిపి॥

గీ॥ రనుజుఁడువిభీషణుఁడుకాఁడె యగ్రజన్ముఁ
బగరఁగూడిరణమ్ములోభంగపఱచె
సుందుఁడవరజుఁడనిచేసిసుకిగిచనిరి
జ్ఞాతివైరంబుసామాన్యమేతలఁప॥ 102

వ॥ కావున జ్ఞాతివైరంబుకంటెను వైరంబులుగలవె. బలసమగ్రంబులగువిూనంబులు బలహీనంబులగు నల్పవిూనంబులంగబళించునట్లు బలసంపన్నులైన జ్ఞాతిబలహీనుల గు జ్ఞాతులనేపాడవడంచు. నలుండెంతబలవంతుఁడైననున్న నంతియొకొరగామి యతనిదర్పంబణంతము రమ్మనిపలికిన, 103

క॥ మును పెక్కుమారులతనిన్
జెనకిపరాజితుఁడనైతి సిగ్గఱుఁగక నేఁ
డునునట్లచెనకియోడిన
వెనుకన్నగుబాటుగాదెవిచరింపంగన్॥ 104

వ॥ అనినఁబుష్కరునకుఁ బుష్కరుండగు కలియిట్లనియె॥ 105

క॥ మున్నిటివోటమి తత్తటి
నెన్నంబని యేమి యిప్పుడే నుసహాయం
బున్నాగము వెఱువక నీ
వన్నలుతోఁ దొడర విజయమగు నిజమరయన్॥ 106

ఉ॥ నేఁడు సహాయముల్ గలిగె నీకిటమంచము గల్గు నాఁడె నీ
ల్లాడు మనంగముల్ వినవె యాఘను బైకొన వేగరమ్మ తం
డోడుటకీవు సన్విజయ మొందుటకుం దలఁపయ్యెనింక మా
రాడకు గాలి పెట్టు సమయంబిది తూరుపుతట్టుకొనకుమీ॥ 107

క॥ పగవాని గెల్వ నోపని
మగవాని దియేటిబ్రదుకు మహి నెన్నఁగ నీ
పగవాఁడు గాఁడె నైషధ
జగతీశుని గెలిచికొనుము సర్వస్వమ్ముల్॥ 108

వ॥ అన్నృపాలున కపాయంబొందుట కొక్కయుపాయంబుఁ దలంచి నాఁడ నెట్లంటేని.

క॥ జూదంబులాడ నలుఁడు ప్రి
మోదంబునఁ బొందు నల్లమున మనమతనిన్
జూదంబున నోడించి ప్రి
మాదంబుల పాలు సేసి మహిఁ గొనవలయున్॥ 110

వ॥ అనిపలికి. 111

క॥ అక్షముఁడగు తే ద్వాపరు
నక్షములందు నిచిచి వశుఁడగు పుష్కరుతో
సాక్షణమయ చటువాసి న
లక్షోణిపాలకుని నెలవునకువచ్చెన్॥ 112

వ॥ వచ్చి పుష్కరుం దత్పురిసమీపంబున విడియనియమించి తానలమహారాజుఁ జేరఁజని,

క॥ అదె వచ్చి నాఁడు పుష్కరుఁ
డుదితామర్షశిఖి భస్మితోగ్రాహితరా
ణ్మదగహననివహుఁ డాఘనుఁ
గదనంబునఁ జెనకి బ్రదుక గాఁదరమగు నే॥ 114

క॥ మును గెలిచి నాఁడ నేనని

మనమున గర్వింపవలదు మా రాజు మనం
బునఁ జుట్టమవని నిను గా
చినమని కరుణాసమగ్రచిత్తుండగుటన్॥ 115

కం॥ కదనంబు సేయు నీకొక
టొదవిన నపకీర్తి యట్లనొల్లకు నీతోఁ
గదిసి ప్రదుజూదమున గెలి
చెదనని యురుదెంచె నతఁడు జితరిపుఁడగుటన్॥ 116

కం॥ ఆడుమిపుడాడకుండిన
నోడితి ననుమటులఁ బలుక నోపమి వేగం
బాడని బాడుము నాకున్
జూడఁగ నెందుపని లేదు సుమ్ము మహీశా॥ 117

వ॥ అని దుర్వహోఖర్వగర్వం బేర్పడఁ బలికిన సముద్దండదండాపహత ప్రచండపుండరీకంబు గతిన్ గనలి భీకరంబున మోకరించి యర్థాసనంబుగా నిలిచి గర్జించి యాదుర్జనునకు భూరమణపర్జన్యుం డిట్లనియె. 118

శా॥ ఎట్టెట్రా క్రికదుఁగండగర్వమున నన్నీ రీతి దుర్బుద్ధిచే
నిట్టట్టాడఁగ నంపె నే యతని జింహాస్థానమల్కన్మొదల్
దట్టంగోయక మద్భుజావిలసితోద్దండ ప్రచండాసి వాఁ
డెట్టెన్ జోరఁ బారినన్ విడుచునే యీరేడులోకంబులన్॥ 119

శా॥ ఔరా! వెన్నకుఁ బండ్లు వచ్చెనిపుడా హా పుష్కరుండింతలో
శూరుండాయెనె యింక నేమనఁగ వచ్చున్ వాని గర్వంబు వో
కారం జేయక మాన నేర్చునె మదీయం బైన బాహాసి దు
ర్వారారాతికఠోరమస్తక నటత్ప్రాగల్భ్యభావంబునన్॥ 120

వ॥ అని కొలువువారలం గలయంగనుంగొని. 121

కం॥ నేనఁట చుట్టమునఁట నా
తోనని సేయఁడఁట వానితో నఁట జూదం
బేనాడుదునఁట యిహిహీ
యీనీచుం డిట్టిమాట లెక్కడ నేర్చెన్॥ 122

కం॥ ఆడుదునఁట లేకంటే
యోడితినందునఁట యనక యుండినము నుపే

యోడని బాడఁ దనఁట యీ
వేడబముల నేడ నేర్చి పీడుతలంపన్॥ 123

వ॥ అని వెండియుఁ గలిఁ గని. 124

క॥ దూతవనినిన్నుఁ గాఁచితి
ద్యూతార్థము వచ్చినట్టి దొరఁ దోడ్కొని రా
చూతంబన వుడు విని చని
యాతఁడు తోడ్కొనుచు వచ్చె నా పుష్కరునిన్॥ 125

క॥ కలియుగ వశమానసుఁడై
కలితశ్రీయః ప్రబలుఁడు ఘనకాంతిసము
జ్జ్వలుఁడు నలుఁడపుడు తివురుచు
నలపుష్కరుఁ గదిసి జూదమాడఁదొడంగన్॥ 126

వ॥ ఆసమయంబున శేముషీసహితులగు హితులును నీతిమార్గస్వతంత్రులగు మంత్రులు
ను నిష్కపటమానసత్రిరోహితులగు పురోహితులును ఃమతతిమిరలోకబాంధవుల
గు బాంధవులును నలునిగదియ నేతెంచి యిట్లనిరి. 127

క॥ ద్యూతము సమస్తధర్మా
పేతము సంపత్సమృద్ధిభీషణదోష
వ్రాతము దూరితమతిసం
ఘాతము సమధిక యశోఃఘాతము దలఁపన్॥ 128

గీ॥ ఇట్టిజూదమాడి యిందుచే నపహతి
పొందవలవ దనఘ భూపవర్య
యనుచు విన్నపంబులొనరింప వారిది
రస్కరించి పలికె రాజవరుఁడు॥ 129

వ॥ అనవుఁడు. 130

క॥ తగవాపగవారమెనీ
తెగువాతగువారమింత తెలుపఁగ వినవి
ట్లగు నాజూదరిధరలో
సుగతిఁ గనఁజాలఁడనఁగ సుమతి దెలియవే॥ 131

వ॥ అని పెక్కుభంగులం గక్కసించి పలికినఁ బిక్కటిల్లు కలిమాయవలన నలనరేంద్రుం
డు విననేరకుండిన నరేంద్రనందనకడకేతెంచి వారలిట్లనిరి. 132

ఉ॥ అమ్మ భవన్మనోహరుఁడ హమ్మనిజూదములాడఁ గాదన౯
మమ్మనిరాకరించెవినుమా చనుమానమువాసిచేసి దై
వమ్ముజయమ్ము వాయఁగరువమ్ములు ధమ్ములునిమ్ములింక దూ
రమ్ములగు౯ మనమ్ములఁగరమ్ముగదా పరితాపమొందఁగ౯॥ 133

ఉ॥ పాటలగంధినీపతికిఁ బాటిలుకోటములాటలందు ని
ప్పాటునజేటువాటునగు బాటులనాటుకొన౯ హితోక్తులం
జీటికిమాటికేముగడుఁ జెప్పఁగనొప్పఁగఁగూడదయ్యె న
మ్మేటికి నేటికిన్విధికి మీయెడవైరము మేరమీఱుట౯॥ 134

గీ॥ వెలఁదిచెప్పిచెప్పి వేసరితిమిపైనఁ
డేమిసేయవచ్చు నీశ్వరాజ్ఞ
గడువఁదరముకాదు కావుననీవు చె
ప్పించి మాడవలయుఁబ్రియునితోడ॥ 135

వ॥ అనిపలికిన. 136

క॥ చెక్కిటఁజేఁజేర్చి చికడు
సుక్కడుబాటొదవనుస్సురుస్సనిమదిలోఁ
గ్రిక్కిరిసిన ఖేదముతో
నక్కాంతక శావతీవ్రగాత్రికిఁబలికె౯॥ 137

క॥ నీవతిహితమతివిక ద క
శావతివేగమున నరిగిలలితవృదూక్తి౯
భూపిభుని యూటమానిచి
రావలెనన నమ్మప్రగాత్రీరయమునఁజనియె౯॥ 138

క॥ చనియతనికెంతచెప్పిన
వినకుండినఁజెప్పి వెలఁది వేమరలంగాఁ
జనుదెంచి భీమనందనఁ
గనియిట్లనెవిన్నఁదనముగనుపట్టంగ౯॥ 139

ఉ॥ జూదమువాదమంటి గడుఁజుల్కదనంబనియంటి దీనిచే
ఖేదమువచ్చునంటి మముఁగీడ్పడఁజేయకుమంటిఁ బోవునీ
మేదినియంటిఁ గీడుబలిమి౯ గొని తెచ్చితివంటి నాఁడఁగా
గాదనియంటి నిర్భరులుకాదనిమారెదరంటిఁ గోమలీ॥ 140

క॥ ఏమనఁగ నేమి నీమగఁ
డేమాటలు చెవులఁ బెట్టఁ డించుక యేనిన్
నామధురవాగ్విలాసము
నేమన్నట్టడవిఁ గాచు వెన్నెలయయ్యెన్॥ 141

క॥ నామాటలెల్లనయ్యెడ
శ్యామా చెవుడునకుఁ బట్టుశంఖములయ్యెన్
నీమగని రాజ్య విభవో
ద్దామముఁ దలపోయ నేటిదరి మ్రానయ్యెన్॥ 142

గీ॥ జయముపుష్కరునకు నపజయము నీదు
వరునకీరెండు నిదిశిలాక్షరములయ్యె
భీతమ్ముగ నేత్రమున సిరి నూతికట్టి
బట్టవిధమయ్యె నింకఁ జెప్పెడిదియేమి॥ 143

వ॥ అనినఁ జింతాతురస్వాంతయై దమయంతియు. 144

సీ॥ కడలేనిసంపద లెడఁజేసిబలు లేమి మముఁబొందునోయంచు మదిఁగృశించు
ప్రాణేశుఁడెవ్వారి పంచనుండఁగ నోపుఁ బుల్లిందవలెనంచుఁ దల్లడించు
పోషించుటెట్లొకో పుట్టినాళ్ల యీనిసుఁగులనంచుఁ గన్నీరునించు
నెనరైనబాంధవానీకంబులెల్ల నేమగుదురోయిఁకనంచు నాత్మనెంచు॥

గీ॥ నిపుణవిధికంటికకట నేమింతభార
మైతిమేయంచుఁ దలపోసియలమటించుఁ
బువ్వులమ్మినవీథి నే పుల్లలమ్మఁ
జేసితే దైవమాయంచుఁ జింతటించు॥ 145

వ॥ అప్పుడక్కాంతం గాంచి. 146

క॥ కాంతా సంతాపము నీ
కింతాచింతాతురత్వ మేటికి లక్ష్మీ
కాంతుఁడు నలుఁ గాచు దయా
స్వాంతుండై దంతిఁ గాచు వైఖరి నెపుడున్॥ 147

ఆ॥ అనుచు నూరడించి యమ్మ యింకిటమీఁదఁ
గార్యమెవ్విధమునఁ గాఁగఁగలదొ
పతియనుజ్ఞనడపి పడుచులమీయమ్మ
కడకుఁ జేరనంపఁ గాఁగవలయు॥ 148

వ॥ అని చెప్పి హితపురోహితామాత్యాదులు నిజసదనంబులకుం జనిరి తత్క్షణంబ. 149

క॥ వనితామణియును దాఁబతి
యనుమతి గైకొనుచు సూతుఁడగు వార్ష్ణేయుఁ
గనుఁగొని కుండినమునకుం
గొనిపొమ్మని పనిచె ముద్దుకొడుకుఁ గూఁతుఁ॥ 150

వ॥ మఱియును. 151

క॥ లలనకళావతి మొదలుగఁ
గల చెలికత్తియలఁ బిలచి కార్యంబిఁక నె
వ్వలనగు నో వీరలు వీ
రలతోడ నెకదలుఁడనుచు రయమునఁ బలికెఁ॥ 152

వ॥ ఇట్లు పనుచుచు. 153

ఉ॥ అక్కట గొడ్డుపీగిక నిట్టి కుమారుఁ గుమారి నేఁడు నా
ప్రక్కలనుండనీక యెడఁబాపెడు పాపపుదైవమింక నే
నెక్కడఁ జొత్తు నేదిగతి యెవ్వని జీరుదు నెట్టులుందు నా
కెక్కడి యార్తి వచ్చె విధి నేమని దూరుదు నేమి సేయుదుఁ॥ 154

క॥ కడుఁబాపజాతినగు నా
కడుపున సంతానమేల కలిగెఁ గలిగెం బో
యెడవాయ నేల యిపుడీ
యెడ నిటువలెఁ జేసె దైవమేమన నేర్తుఁ॥ 155

సీ॥ కడినోటికింపౌనె కుడుచు వేళల ముద్దు కొడుకులు పా[illegible]ఁగకున్న
నిదుర కంటికి గూరునే ప్రక్కలో పలుఁగుదురుచు బిడ్డలుఁ గదియకున్న
నిలువ వచ్చునె బాలకులు డాయ నేతెంచి యాలముచుఁ జొట్టుముట్టాడకున్న
నడువఁ గాళ్లాడునే పదుచుల నిరుగడ నెడయక కేలఁటె నడువకున్న॥

గీ॥ బ్రతుకు గల్గునె తనయులఁ బాసియున్న
సొంపు దక్కునె కొమరులఁ జూడకున్న
చిత్తమలరునె సూనుల నెత్తకున్న
మేను నిల్చునె సుతులింట మెలఁగకున్న॥ 156

క॥ కట్టా పిల్లలఁ బాసిన
పిట్టవలెఁ బొరలి పొరలి ప్రేలుచు నిఁక మే

నెట్టుధరింతు నొదైవమ
కట్టిఁడివైనన్ను నిటులగాఁ జేసితివే॥ 157

గీ॥ తల్లినేనుండియును మీకుతల్లిలేని
కరణినింబేదలైయొడ్ల కాళ్లపంచఁ
బకుచుఁదతితోడనిదురయుఁ గుడుపులేక
బ్రతుకుచేసితిరో చిన్ని పాపలార॥ 158

వ॥ అనిపలికి దమయంతితల్లికిం జెప్పుమని యప్పుణ్యవతి కళావతికిట్లనియె. 159

సీ॥ కడయేరుపడనీక కడుఁబిట్టువీఁగు సంపదమము నేటితోఁబాయుననుము
దొరసినగురునైన నెరసులెన్నఁగనోపు జీవితేశునిబుద్ధి చెదరెననుము
మేలుమాడఁగలేక మిణికెనుపగవారి కోరుకోరికలు చేకూరెననుము
నవ్వేడువారికి నగుబాటుగాఁబెచ్చు పెరిగెడిమురిపెముల్ పెరిగెననుము॥

గీ॥ నాతియాపదలకు మొదలైతిననుము
బాలకులతోడ నెడఁబాయఁ బడితిననుము
వేయనఁగ నేలతలవంపు లాయెననుము
చెప్పెడిదియేమి విధియింత చేసెననుము॥ 160

వ॥ అని పెక్కుభంగులం జెప్పి వీడ్కొల్పినం గళావతీ యువతిపౌత్తుకత్రియలు తనవెంటనంటిరా నింద్రసేనేంద్రసేనాప్రముఖంబుగా రథారోహణంబుచేసి వార్ష్ణేయ పురస్కారంబుగాఁ గుండిన నగరంబునకుం జనియె. నిటనలుండును పుష్కరుండును జూదంబాడుచు. 161

సీ॥ ఈసారివేటున నీసారిదీతు నా వేసారియాడక విసుగవలయు
గనవబ్బ్రమముగ దానవదెబ్బకొట్టిన పెనుబొబ్బవెట్టుచుఁ జనఁగవలయు
దినమొక్కయాటన నినుమొక్కఁ ఫుత్తునా వినుమొక్కలంబటి వెడలవలయు
నీపట్టునకు జూడు నీపట్టుడుల్లైనా యేపట్టుఁగానక యేగవలయు॥

గీ॥ నింకనోడితివేని యీవంకనిలక
శంకమైబింకములుమాని జరుగవలయు
ననుచునొండొరు నాడుచు నాడిరప్పుడు
పుణ్యశ్లోకుఁడైన నలుఁడునుఁబుష్కరుండు॥ 162

క॥ ఇదిరేయిదిపవలిదితతి
యిదితఱిగాదనుచు నెన్న నెఱుఁగక మదిలోఁ

గుదిరినకాంతాళీముకుడు
వదలక యిట్లాడి రెదిరివారలు నవ్వన్॥ 163

ఉ॥ హారములున్ సఖీజనవిహారములున్ విడనాడె నిర్మలా
చారములున్ సుహృజ్జనవిచారము లెంతయుఁ గట్టిపెట్టె సం
సారముపైవివేకగుణ సారముపైఁ గలవాంఛ మానె న
బ్భూరమణుండు నైషధుఁడు పుష్కరుతోడుత జూదమాడుచున్॥ 164

క॥ వసనంబులు సంసార
వ్యసనంబులు రాజనీతివరశాస్త్రార్థా
భ్యసనంబులు పటువిభవో
ల్లసనంబులు నలుఁడు మదిఁ దలంపక యాడెన్॥ 165

క॥ ప్రతిదివసంబశ్రాంత
గ్లతుఁడై ద్వాపరమునలునికడఁ గడుఁగపటా
కృతి నెరపుచుఁ బుష్కరునకు
హితవృగనతఁడుగుపందె మెల్లనొసంగున్॥ 166

వ॥ ఇవ్విధంబునం జెక్కు కాలంబు. 167

క॥ ఆడం గానలకలిపై
నాడం గాఁ బుష్కరునకు నానందము చే
కూడం గా నైషధవిభుఁ
డోడం గాఁ దోడఁ గొ నిర్దయుఁడు విధియగుటన్॥ 168

గీ॥ ధనములోడెను దివ్యసాధనములోడె
మణులనోడెను జవనాశ్వమణులనోడె
పూజ్యతరమైన యట్టిసామ్రాజ్యమోడె
నోడె సర్వస్వమును భూవరోత్తముండు॥ 169

వ॥ ఇవ్విధంబున. 170

చ॥ విపులరథనాయుధాళిద్విజ విశ్రుతరాజ్యరమన్ విపత్తుచే
నపహతిఁ బొందె నైషధధరాధిపుఁ డాత్మవధూటితోడ రా
నపుడు తిదీనభావ వదనాంబుజుఁడై పురవీథిఁ బోవుచోఁ
జపలవిలోలలోచనలు సౌధములన్ వసియించి చూచుచున్॥

సీ॥ అలసితే బహుపరాకైకో యనుచుఁ గంచుకవ్రాతమేలొకో కదిసిరాదు
రంగదుత్తుంగతురంగసంఘము లెక్కి యేలొకో రాహుత్తు లెదిరిరారు
వెలిపల్లకులమూఁకల నండగొని యరిగెలవారలేలొకో కెలన రారు
బలుకెంపుచాయలఁ దులకించు పింజామరల వారలేలొకో కొలిచిరారు॥

గీ॥ ఏలొకో రాజు భద్రేభమెక్కి వెడల
డేలొకో వెంటదమయంతి యేగుదెంచె
నేలొకో విధివిరక్తి నింత చేసె
నక్కటా! దైవకృతము నేమనఁగవచ్చు?॥ 172

మ॥ అహహా యేగతిఁ బాలవచ్చు నిజజాయాయుక్తుఁడై యాతఁడ
గ్గహనాంతంబులనుండఁ గాఁదగునె నిష్కారుణ్యుఁడై పూని య
మ్మహనీయోజ్జ్వలపుణ్యశీలు పటు సామ్రాజ్యప్రభావంబుఁ దా
నహితుం జెందఁగఁ జేసె నే ద్రుహిణుఁ డాహా యెంతకష్టాత్ముఁడో॥ 173

గీ॥ ఒద్దఁబాయక కవగూడి ముద్దరాలు
పదములొత్తంగ నలరు భూపాలు డేవి
మొనసి కంటిరె యదె చిన్ని ముద్దరాలు
పదములొత్తంగఁ జనెను దుష్పథములందు॥ 174

సీ॥ వంశపోషణబుద్ధి వదలకుండెను మేటి వంశపోషణబుద్ధి వదలకరిగె
తతసాలయుతపురస్థితినుండు సుగుణుండు తతసాలయుతపురస్థితికిఁ జనియె
సతతధరావనోన్నతిఁ జెందు గుణశాలి సతతధరావనోన్నతికిఁ గదలె
సవనకేళీకాంతుఁ డపుడు పావనమూర్తి సవనకేళీకాంతుఁ దవిలిపోయె॥

గీ॥ పరికటబాడబసంఘసారంగగణముఁ
గాంచి యేపారిద్రుపారిద్రులు గడపుఘనుఁడు
పరికటబాడబసంఘసారంగగణముఁ
గాంచి యేపారిద్రుపారిద్రులు గడపవెడలె॥ 175

వ॥ అని పురకాంతలు కన్నీరు మున్నీరుగా వగవ మగువయుం దానును నగరిబాహ్యవీ
థిం జేరం జని యచ్చట. 176

ఉ॥ కానకుఁ బోవఁ గాఁ దెరవుకానక దీనకళాసమేతుఁడై
యానలుఁ డుండ దండకొక రైనను జేరక యుండిరప్డు కో్ర

త్తైనెలకొన్న పుష్కరుని యానలుమీఱకక్రూరకర్మముల్
మానకచేయుచున్న కలిమాయలఁబాయఁగలేకపోరులన్॥ 177

ఆ॥ మునిచరిత్రుఁడచట మూడహోరాత్రంబు
లుపవసించియుండెనువిదతోడ
విమలతర తపోవనములనరుంధతీ
సహితుఁడగువసిష్ఠుచందమునను॥ 178

వ॥ అప్పుడద్దమయంతి ప్రాణనాథుంగనుంగొని. 179

చ॥ అకటకటాహృదీశవలయా వనిమధ్యమహీతలాధినా
యక మకుటాగ్రభాగకలితాంబుజరాగ వినిర్గతప్రభా
నికరసమంచితాత్మపద నీరజవృత్తిఁదనర్చునిన్ను కూ
టికివెతనొందఁజేసెనె కడిందిమియవ్విధినేమిసేయుదున్॥ 180

ఉ॥ ఎచ్చటజూదమాడరె మహీధవులాడిననేమియాటలం
దొచ్చెములేకయిప్పగిదినోడిరె యోడిననేమిరాజ్యమి
ట్లిచ్చివనాంతరంబులకునేగిరె యేగిననేమిచెల్లఁబో
చెచ్చెరఁగూటికింగరవుఁ జెందిరెహా! విధినేమిసేయుదున్॥ 181

గీ॥ ఒరులయాకలిఁ గనికరమోర్వలేక
కనికరముమీఱఁ బోషించుఘనునినిన్ను
పెలుచనాఁకటఁ జెటపెటప్రేలఁజేసె
నట్టికట్టడివిధి నేమియనఁగవచ్చు॥ 182

ఉ॥ దానములున్ సదామఖవిధానములున్ సుకృతానుకూలసం
ధానములున్ మహావ్రతవితానములున్ నిరతంబుచేసి స
న్మానగరిష్ఠతన్ విబుధమాన్యుఁడవైతగు నిన్ను నన్న మే
కానకకానకే వెడలఁగా విధిచేసెనె జీవితేశ్వరా॥ 183

గీ॥ అనుచువగచుచునుండు నయ్యవసరమునఁ
గలియుచటనక్షుధలఁజూచి కదలిమీఱు
పక్షులైపోయినాడు విపక్షుఁడైన
నలునిపైచేలదోఁచితేవలయునని॥ 184

క॥ ఝుగఝుగమనుపక్షంబులు
ధగధగమనుచెంచువులును ధావళ్యమునన్

నిగనిగమను మైకాంతులఁ
దగిజిగిదళుకొత్తఁ జిత్రితమవిహగములై॥ 185

క॥ తళుకుటపరంజి టెక్కెలు
తళతళమనినలునియెదుట తలతలమనఁగా
నలకలి తెలియఁగ నంపిన
పులుగులు నావచ్చి రెండు పులుగులునిలిచెన్॥ 186

ఉ॥ అక్కపటాభ్రగంబుల ధరాధిపుడారసికాంతకాంచితే
టెక్కెలయంచులన్ బసిఁడిరేకులమించఁగమించులీనఁగా
నెక్కడనుండిచేరెనిటకిట్టి విచిత్రయులైనవీని నే
గ్రక్కనఁబట్టెదన్ మనికిగ్రాసముతాసమకూఱునట్లుగన్॥ 187

చ॥ అనుటయుభీమనందన నయంబుభయంబు బెనంగొనంగని
ట్లనుహృదయేశ యీఖగములద్భుతవేషములేమికారణ
మ్మనిటవ్రాలెనో మనము మున్గడు నెచ్చినవారమిట్టి వీ
నినిబయిఁకోషమన్న విననేరకయవ్విభుఁడున్ జలంబునన్॥ 188

వ॥ అప్పుడు. 189

క॥ ఆకలియును నాకలియును
బైకొని పైకోకవానిపై వైచినచో
నాకపటపువిహగములది
గైకొని కడువేగనింగికడకై చనియెన్॥ 190

వ॥ ఇవ్విధంబున.

ఉ॥ పుట్టముగొంచునింగివడి బోవుచునిట్లను వెఱ్ఱిరాజ నీ
కట్టినబట్టలాగ సమకట్టినయత్నములౌట మమ్ములన్
గట్టిగఁగానవైతి వటుగ్రక్కనమోసమువచ్చెనీకు మా
పట్టినపట్టు చెల్లెమముఁ బంచుముపోయెదమంచు నేగినన్॥ 192

క॥ తటతటమను డెందముతో
నటునిటు బెగడొందిచూచు నవ్విభుఁగని తాఁ
గటకటపడి వైదర్భియుఁ
దటుకునఁదనచీరకొంగు దగ్గర వైచెన్॥ 193

వ॥ ఇట్లువైచిన నమ్మహీకాంతుండు. 194

క॥ పయ్యంటకొంగుఁగొని మొల
పయ్యంటఁగఁజుట్టితరుణి ! పాచికలిటులన్
బయ్యాడఁబన్ని విను నా
పయ్యాడం గనుటయేల పైకొనినీకున్॥ 195

క॥ అక్షమతనన్ను నేచిన
యక్షములం బట్టిగెలుచునట్టి యుపాయం
బీక్షణమయొసఁగినరహరి
రక్షింపఁడెమనలలోక రక్షణుఁడగుటన్॥ 196

వ॥ అనిపలికి. 197

మ॥ తరుణీరత్న ముదాను నేకపట సంధానాంగుఁడై కుందుచున్
ధరణీనాయకుఁడచ్చటన్ దరలి కాంతారప్రదేశంబులన్
దిరుగున్ బర్ణఫలోదకాశనసముద్వృత్తింజనున్ ధూళిధూ
సరవైవర్ణ్యతనూవికాసములఁ బ్రచ్ఛన్న ప్రభావంబునన్॥ 198

క॥ శ్రీమన్నారాయణశుభ
నామస్మరణంబెవెసఁదనకుఁదోడుగన
బ్భూమీశాగ్రణి మెలఁగెను
భామాసహితంబుగాఁగ భయదాటవులన్॥ 199

గీ॥ సతతసత్వసమాగమోన్నతుఁడతండు
సతతసత్వసమాగమోన్నతిఁ జరించె
నచలసౌభాగ్యమహిమలనందు ధన్యుఁ
డచలసౌభాగ్యమహిమలయందు మెలఁగె॥ 200

వ॥ ఇవ్విధంబునం బ్రవర్తించునప్పుడు. 201

సీ॥ మృదుపాదయుగళంబు చిదుపరాలొత్తంగ సుడివడిసుళ్లును ద్రొక్కుచుండు
మిటమిటగాయు మిక్కుటపుబేరెండచే దగదొట్టిమిగుల నెవ్వగలఁ జెందు
కడుఁబిట్టువీచు పెన్పడగాలి కెదురెక్క నోపక నడవక్కి యురక నిల్చు
నాపగారాని పెల్లాఁకటదరలంగఁ జాలక పెటపెట వ్రీలిపోలు

గీ॥ నిర్దయాత్మక కలికృతనిబిడదీన
భావమానసుఁడగు నిజప్రాణనాథు
పిఱుదఁబాయక చనుచున్న భీమతనయ
బహుళకంటకమైన యగ్గహనసీమ॥ 202

వ॥ ఇట్లలంతంబొందు నిందువదనం గని నరపుంగవుండు తత్సమీపంబున నొక్కమడు
వుఁగని కదియఁజని జలంబులు త్రావించి తరుచ్ఛాయాశీతలస్థలిం బవళింపంజేసి
యొక్కింత సేదఁదేర్చి మనంబునన్ గొండొకతల పోసి కులకాంతకిట్లనియె. 203

క॥ అడవులనా వెంబడిఁగడు
నిడుమలుపడనేల మనలకెంతయు మేలాం
దెను నంతకుఁదలిదండ్రుల
కడఁజేరుటనీ త్రికాదె కంజదళాక్షీ॥ 204

సీ॥ క్రూరసత్త్వవిహార ఘోరమీవిపినంబు మందిరారామ మేయిందువదన
శైవాలజంబాల సహితమీ మడువు కేళీసరోవరమె నాళీకగంధి
యతులశార్కర కర్కశాయితంబీ నేలతూలికాతల్పమే తోయజాక్షి
నిబిడకంటకసమన్వితము లీప్రతతులు హేమడోలికలెమత్తేభయాన॥

గీ॥ ఘూకకర్ణకఠోర ఝిల్లీరవంబు
శుకపికానీకనాదమే సుందరాంగి
యేలనవయంగ నాతోడ నిచటనీకు
పుట్టినింటికిఁజనఁగాదె పువ్వుఁబోఁడి॥ 205

గీ॥ కోసలకుఁద్రోవయిదిచూడు కుముదనయన
దక్షిణాపథంబునకు నిది దారితరుణి
యుజ్జయినికిదిమార్గమో యుత్పలాక్షి
కుండినమునకుఁదెరువిది కోమలాంగి॥ 206

వ॥ ఇమ్మార్గంబునంజని మీయమ్మకడంజేరుట కర్తవ్యంబనిపలికిన నులికియక్కులికి
యిట్లనియె॥ 207

ఉ॥ జీవితనాథ మీచరణసేవయె నాకు సమస్తభాగ్యముల్
గావున మీసహాయమెడఁగాఁ జననేర్తునె యెట్టులైన మీ
రీవనవీథిలో బడలనేమిటి కిద్దఱమందుఁబోదమే
యీవటువచ్చినన్ గొదవయే పెఱవారలె యత్తవారలన్॥ 208

గీ॥ మామమాయయ్య మిమ్మెంత ప్రేమసేయు;
అత్తమాయమ్మ మిముఁజాల నాదరించు
బావమాయన్న మిమునండఁ బాయకుండు
నీవువచ్చినఁగొదవయే జీవితేశ॥ 209

క॥ మాతులగృహంబుశ్వశురని
కేతనమును భాగినేయుగేహముభగినీ
భ్రాతృస్థానములవసర
మౌతఱిఁజేరఁదగు నెలవులందురువిబుధుల్॥ 210

వ॥ కావున మనకార్యంబు సర్వంబును భద్రంబగునంతకుఁ గుండిన నగరంబుననుండిన నయంబుగాదేయనిన నాసతికిఁబతి యిట్లనియె. 211

శా॥ నాళీకేక్షణ యేకుదీవులదొరల్ నాచుట్టునన్ గొల్వమున్
లీలన్ బోవుదు బంధుగేహములకున్ నిత్యోత్సవం బేర్పడన్
గాలంబీగతిఁ జేయు లేమిఁబడి దుఃఖంబొందియే కాకినై
యీలాగే గతిఁ జేరనోపుదు లతాంగీ! యత్తవారింటికిన్॥ 212

మ॥ మతిచాపల్యకరంబు సర్వజనసామాన్యక్రియాపాది దూ
రితమిత్రప్రకరంబు నిర్మలకళాశ్రేయోవిఘాతంబు దూ
షితబంధువ్రజమార్తిహేతుకము విచ్ఛిన్నప్రమోదంబు సం
తతదైన్యాశ్రయకారణంబు తరుణీ! దారిద్ర్యమూహింపఁగన్॥ 213

క॥ ధరదూదికంటెఁ జులకన
బరికింపఁగనీటికంటెఁ బలుచన యెందున్
గురుచలముఁగురుచదనమం
బురుహాక్షి దరిద్రుఁడెందుఁ బూజ్యుండగునే॥ 214

క॥ కళితలుగునగవు వెడలదు
చలమతియగు దైన్యమొదవు సంతసముడుగున్
బలువిన్నబాటు పైకొనుఁ
గలకంఠీ లేమికంటెఁ గష్టముకలదే॥ 215

వ॥ కావున నిట్టికష్టదరిద్రుండనై యిట్లున్న నేను బంధుగృహంబులకెవ్విధంబున రానోపుదుననినఁ బ్రాణేశునకుఁ బ్రాణేశ్వరి యిట్లనియె. దేవా! నీవు రానోపవేని భవత్సమాగమంబే నెడఁబాయనోప నాయనుగమనంబున కొడంబడవలయునది యునుంగాక. 216

క॥ కాంతునకెయ్యెడనైనను
జింతాతురగరిమ విరియఁజేయను మదిలో
సంతోషము పురికొల్పను
కాంతాసంగతులకంటెఁ గలవె సుఖంబుల్॥ 217

వ॥ కావునం బతికిసతిసమాగమం బవశ్యకర్తవ్యంబు ప్రాణపదంబై యుండవలెనాయక
మెలంగుజాయం బాయందలంచుట న్యాయంబున కపాయంబుమఱియును. 218

సీ॥ ఉచితలీలలఁజేయు హోమకాలములందు స్వాహామనోభర్త సాక్షిగాఁగ
విలసదరుంధతీ వీక్షణక్రమమున సప్తమహామునుల్ సాక్షిగాఁగ
విప్రాశీర్వాద వేళ ధాత్రీసురల్ చదివెడువేదముల్ సాక్షిగాఁగ
ప్రకటితమ్ముగనాక బలియిచ్చునత్తఱి సర్వగీర్వాణులుసాక్షిగాఁగ॥

గీ॥ మిగులనమ్మించి ముగ్ధభామినులనప్పు
డదనుగైకొని యొకసమయమునవిడుట
జగతినఘములకెల్ల నాస్పదముకాదె
జితవిమతభూతలాధీశ జీవితేశ॥ 219

వ॥ ఇదిమొదలింగి మదధీనజీవనయనియు ననపాయనియనియు నన్నుంగరుణింపవలయు
నావిన్నపంబునిరాదరణంబు సేయకుండు మట్లభయదానంబీవలయుననిన నిజవల్లభునుఁ
బ్రాణవల్లభుండిట్లనియె. 220

గీ॥ ప్రాణమెట్లట్లనీవు నాకరసిచూడ
నిట్టినిన్నెడఁబాసిపోనెట్లునేర్తు
నడవినవయంగఁజూడలేకంటిఁగాక
నాగుణంబీవెఱుంగ వేనలినగంధి॥ 221

వ॥ అనిపలికి పరస్పరసంభాషణంబుల హృత్తాపశాంతింబొందుచు నచ్చోటువాసి చని
చని యమ్మహారణ్యమధ్యంబున నొక్క సభఁగని యంతసూర్యాస్తమయంబగుట
యుఁ గాలోచితకృత్యంబులు నిర్వర్తించి తత్సమీపంబుననుండి నిశాకాలంబునఁ
దనపాదంబుల పొంతంబడి మార్గాయాసంబునంజేసి నిదురించు కులకాంతంగని
భూకాంతుండు తనమనంబున: 222

మ॥ లలనల్ పాదములొత్తఁగా మృదులతల్పంబందువర్తించుకో
మలి యీసున్నపురాలనేలఁబడి యిమ్మైనిద్దురంజెందె నే
వలనందాళుదుదీనిఁబొమ్మనినఁ బోవంజాలదేమందు నీ
నెలవందే నెడఁబాయఁగుండినముఁ దానేచేరుదైవాజ్ఞచే॥ 223

క॥ అనితలఁచి యశ్రుధారలు
కనుగొనలన్ వరదవారఁగానొయ్యనఁగ
ట్టినపుట్టంబలుగొనిభా

మినియెఱుఁగకయుండలేచి మెల్లనఁజనియెన్॥ 224

వ॥ ఇట్లు పోవుచు. 225

సీ॥ పొదలెడునెమలిచప్పుడు వీఁకనాలించి తెరవలేచెనటంచుమరలిచూచు
నరుదెంచుకొదమరాయంచఁ జేరవఁగాంచి నెలఁతవచ్చెనటంచునిలిచిచూచు
నడయాడుదంతిచప్పుడు పోలనాలించిముగుదవచ్చెనటంచు మొనసిచూచు
కొమరొందుపికనిస్వనముదోల నాలించికొమ్మవచ్చెనటంచుఁగోరిచూచుఁ

గీ॥ బొదలమాటుననాచిల్కబోదవదర
తోయజేక్షణయోయని తొంగిచూచు
సుదతితెనునంటెరా నార్తి చూడఁజాల
కపుడువిడనాడిచనుచు నానృపవరుండు॥ 226

వ॥ ఇట్లు చనిచనిమఱియు. 227

సీ॥ కొలఁకులకలువరేకులసోయగముఁజూచి యెలనాగకన్నులుతలఁచితలఁచి
మవ్వంపునెత్తావి పువ్వుగుత్తులుచూచి కలకంఠిపాలిండ్లుతలఁచితలఁచి
బాగుగాఁగనుపట్టు సోగతీఁగెలుచూచి తరలాక్షినునుమేనుతలఁచితలఁచి
జిగిమించులేమావి చిగురుటాకులుచూచి తనుమధ్యయడుగులుతలఁచితలఁచి॥

గీ॥ చిత్తమునఁగుందు వెతఁజెందు చింతనొందు
నలమటలమించువిలపించుఁ బలవరించు
సారెసారెకువిధిదూఱు మేరమీఱు
నాపదలకెల్లఁబట్టుకొమ్మగుచువిభుఁడు॥ 228

క॥ ఈవిధమునఁజనిచని పృ
థ్వీవల్లభుఁడెదుటఁగాంచె విపులోగ్రజ్వా
లావిస్ఫులింగభీకర
దావానలమున్ విదగ్ధతరుసంకులమున్॥ 229

వ॥ అయ్యవసరంబున॥ 230

ఉ॥ ఆవనవహ్నిఁ బొంతభయమందుచు నాగకుమారుఁడొక్కఁడా
భూవిభుఁగాంచియిట్లనియె భూసురశాపహతుండనైయెటుల్
బోవఁగనోపనన్నుఁగొని పోయిసరస్తటభూమిఁజేర్చియి
ప్పావకభీతివాపినను బ్రత్యుపకారమునీకుఁజేసెదన్॥ 231

గీ॥ అనిననిట్లనితల్ల పోయునవనివిభుఁడు

తోడకిరయోరీతిఁ బట్టుదు దష్టఫణిని
బట్టుకొండిన నతనికిప్రాణహాని
పట్టివప్పుడు నాకగు ప్రాణహాని॥ 232

వ॥ అయినను ధర్మహానికాకుండ శరణాగతుండైన యీతని రక్షించుటయకర్తవ్యంబు. ప్రాణప్రదంబైన పత్నీత్యాగంబునకంటెఁ బ్రాణత్యాగంబైన నదిమేలుగావున నెన్నిభంగుల నీపని నిర్వహింతునని పూనికదియంజని. 233

క॥ ఆపామునుగొనిచని ధా
త్రీపతియొకసరసుపొంత దింపెదననఁగా
నాపన్నగమిట్లనియె ద
యాపర పదియడుగులింక నరిగివిడువవే॥ 234

సీ॥ అట్లైననీకు శ్రేయస్సిద్ధియగునన నలుఁడునుతద్వచనక్రియకునుఁ
బదములెన్నుచుఁజని పదియగునడుగున విడువంగఁగ్రక్కున నొడిసికఱచి
వికృతదేహునిజేసి విభునికిట్లనియెనో గుణనిధీ నేనుకర్కోటకుఁడను
నిన్నెఱింగినపరుల్ నిలుపనోడుదురని మద్విషతిమిరంబుమాటుసేయఁ॥

గీ॥ గఱచితినినీదుమేన నాగరళమెంత
కాలముండునొనీకంత కాలమురగ
వృశ్చికపిశాచరాక్షస విషరుజాగ్ని
జలభయాదులుపొందవు జయముకలుగు॥ 235

వ॥ కావున మహాత్మా నీవుమదీయంబైన సందంశంబునకు విషాదంబునొందవలదు, నీకు యథాపూర్వప్రకారంబున నుండునవసరంబయ్యెనేని యప్పుడు నన్నుఁదలంచిన నీయంశుకంబుఁ బుత్తెంతు దీనినుపధానంబుగఁజేసిన మద్గరళంబువాసి తేజోవిరాజితుండవగుదువు, నీకింక నొక్కహితంబు సెప్పెదవినుము. బాహుకనామంబున నయోధ్యకుంజని దినమణివంశమణియైన ఋతుపర్ణుంజేరి సూతవృత్తింగొలిచియుండుము. ఎల్లవిధంబుల నతనియుల్లంబురంజిల్లంజేసి నీయందుగల యశ్వసౌహృదంబ తనికిఁగఱపి యతనియందుఁగల యక్షహృదయంబు సాధ్యంబుచేసుకొనుము. తద్విద్యావిశేషంబువలన నీకుశత్రుపలాయనంబును సంగరవిజయంబును పునస్సామ్రాజ్యవిభవజాయాసంగమంబులునుగలిగి యథాపూర్వస్థితిని సుఖంబుండెదవు. భవద్దర్శనంబున నాకుశాపవిమోచనంబయ్యెనని యతనిఁబెక్కుభంగులం బ్రస్తుతించి కర్కోటకుండగోచరుండై చనిన. 236

గీ॥ అతనియుపదేశమున నలుండప్పుడయోధ్య
కరిగి ఋతుపర్ణధారుణీశ్వరుని గాంచి
యధిపబాహుకుఁడనువాఁడ నశ్వశిక్ష
కుండ నేఁ బాకవిధులు పెక్కులుగ నేర్తు॥ 237

క॥ నిను గొలిచెదనని వచ్చితి
ననినన్ ఋతుపర్ణుఁడతని నస్మద్రథర
థ్యనికాయములతిశీఘ్రజ
వనములు గా దిద్దుమనుచు వారకనిలిపెన్॥ 238

వ॥ నితిపి నూఱుగద్యాణంబులు జీతంబిచ్చిన నిఖిలజనసేవ్యుండైన నలుండు ఋతుపర్ణుం గొలిచియుండె నంతకమున్న యన్నలునిసూతుండగు వార్ష్ణేయుండు తదీయార్భకులగు నింద్రసేనాదుల విదర్భ నునిచి మరలిచను నెడ మార్గమధ్యంబున నలురాజ్యభ్రంశంబు విని విషాదంబు నొంది రథరథ్యసహితంబుగా ఋతుపర్ణు నొద్ద నే చేరి తదధీనుండై యుండె నంత. 239

చ॥ కరివరమణీత్రయీనికర కంబుసకంథర పుష్పవద్ద్విగ
జ్జ మదవపత్యపూత్వజ సభాస్థలిచైత్యశిరోధిదాస్థిరా
భ్రమరకచాసచాగ్రికకరకరమ విక్రమచక్రచక్ర శ
క్రమణివిలాసభాసవికాసతనూ విశదాబ్జలోచనా॥ 240

క॥ విమలాతను కమలాశుగ
సమధారితనయన విభవసంచితకమలా
రమణీరమణీయాస్యా
బ్జమదాళీనిజమనోవసత్త్వమదాళీ॥ 241

పంచచామరము॥ స్థిరాదరా మురారి వాసుదేవ సేవకావనా
దరా ధరాదరాతిహస్త ధర్మకర్మనిర్మలా
ఖరాసురాజివహ్ని కంద నందనందనా
పరాత్పరాత్మ రాజనీతిపక్షయక్షకా॥ 242

గద్య॥ ఇది శ్రీమదాచ్చివరదగురు చరణస్మరణాభ్యసన సరసనానివాస
తిరుమల వేంకటగిరీశ్వర వరప్రసాదలబ్ధకవితా విలాసహరితసగోత్ర
సిరిప్రగడ తిప్పనమనీషి పుత్రసుజనవిధేయ ధర్మయ నామధేయ
ప్రణీతంబయిన నళచరిత్రమనందుఁ బంచమాశ్వాసము.





శ్రీరస్తు

# నలచరిత్రము

## షష్ఠాశ్వాసము.

శ్రీసతివర్ధనకారణ
భాసురనామప్రభావ పటుచిద్విభవో
ల్లాసజనావనకరుణా
భ్యాసాక్షవిలాస వేంకటాద్రినివాసా॥ 1

వ॥ అవధరింపుమిట్లు దమయంతియుఁ బ్రాణవల్లభుండరిగిన కొండొకతడవునకు మేలు
కాంచి. 2

క॥ కనువిచ్చి కాంచుటయు గ్ర
క్కున నాథుఁడు లేమి గుండెగుబులుకొనఁగ భా
మిని లేచి పటార్ధనిక
ర్తనమరసి యతండు చనుట తథ్యంబనుచున్॥ 3

వ॥ శోకవ్యాకులతఁ బొరలిపొరలి విలపింపఁదొడంగె. 4

ఉ॥ హా నల! విద్విషద్వనదహానల! నన్నిడనాడి పోయితే
కానల నెందొ డాఁగితివికా కనుపట్టుటయెట్లు నాకు నీ
కో నల సగ్నిసాక్షిగను గోరి వరించి పరిత్యజింతురే
చానల నక్కటా! వినఁగఁజాలనె నే మొరవెట్టవే నలా॥ 5

మ॥ లలనాస్త్రాణసమానవైన నిను నేలాపాయుదే నన్న నీ
పలుకే సమ్ముఖభవత్పదాంబుజ సమీపక్షోణి నిద్రింపఁగా
గలితవ్యాళమృగాదిజంతు భయదోగ్రంబైన యిక్కానలో
పల నన్నీడఁగ నాడిపోవదధిప నీపాదంబు లెట్లాడెనో॥

గీ॥ కల్లలాడుటనీకెందుఁగాని వాని
యనఘరాధులపైఁ గలనైననలుగ
విట్టినీవర్తనముఁదప్పియేలబొంకి
తలిగితేటికినామీఁద నమలశీల॥ 7

వ॥ అని వెండియు. 8

మానిని॥ జీలుగుమ్రాఁకలచింతలదాకలఁ జేఁగటపోకలచెట్టులలోఁ
వాలుగురెమ్మలవంకలఁదుమ్మల వంపులనిమ్మలవాడలలోఁ
చాలుపుమద్దులచాయలబొద్దుల చాటులలొద్దులసందులలోఁ
సోలుపురావులచోటులమావుల చుట్టులతావులఁజూచి వెసన్॥ 9

ఉ॥ హాయను దూరితౌఘనివహాయను నన్నెడవాసి తేలనా
థాయను నాదుజన్మమువృథాయను నీబ్రదుకేటికింక ని
స్సీయను భర్తఁజూపుమతెసీయను నేఁగతిఁబాతుదుఃఖమ
మ్మాయనుఁ దాళ నాకుదరమాయను శాపురె! దైవమాయనున్॥ 10

వ॥ అనియచట నిలువనోపక పతిని వెదకుతలంపున వనంబునందిరుగుచు. 11

సీ॥ కరులార కదళికాతరులార ప్రోడవానరులార కానరే నలునిమీరు
అళులార భల్లుకావళులార పాటీరకులులార కానరే నలునిమీరు
యతులార చమరికాతతులార హరిణసంతతులార కానరే నలునిమీరు
హగులార భూదారవరులార భిల్లసుందరులార కానరే నలునిమీరు॥

గీ॥ నారదములార కానరే నలునిమీరు
కలువగములార కానరే నలునిమీరు
చలదళములార కానరే నలునిమీరు
మలయజములార కానరే నలునిమీరు॥ 12

ఉత్సాహ॥ లాలితప్రభావమాన లక్షితీశు గానరే
సాలమాతమాలమారసాలమాసృగాలమా
వ్యాలమాబిడాలమా ప్రవాలమామృణాళమా
శైలమాపటోలమారసాలమామరాళమా॥ 13

క॥ పికమాకురువకమాసిం
ధుకమాతిందుకమ సన్మధుకమాబకమా
వృకమాయిఁకమానలుఁజూ
పకమానఁగఁదగవెరూప పటుకింశుకమా॥ 14

సీ॥ కమలమా ముదితదేవకమలమా నీవయో జీవితేశునితోడఁ జెప్పరాదె
తిలకమా నగరాజతిలకమా యీవేళ ప్రాణనాథునకుఁ దెల్పంగరాదె
వంశమా లలితాత్మవంశమా నామాటప్రియునకియ్యెడ విన్నవింపరాదె
కమలమా నిశితహృత్కమలమా నీకైన హృదయేశ్వరుని యున్కి యెఱుఁగరాదె॥

గీ॥ నీపమా కోపమా కాంతు నెమకరాదె
చూతమా నీతమా భర్తఁ జూపరాదె
కుందమా చందమా పతిఁ గూర్పరాదె
సారమా నేరమా విభుఁ దూరరాదె॥ 15

గీ॥ వేగిన వేగి ప్రాణేశు వెదకి తెమ్మ
నిమ్మ కానిమ్మ నాకోర్కె నీవు పూని
చింత నాచింత యుడిపి రక్షింపుమనుచు
వనజలోచన తిరిగెఁ గాననములోన॥ 16

క॥ గజగామిని యిబ్బిధమున
నిజవిభుఁ గానంగలేక నెమకుచు మదిలో
న జాఁగరముఁ జూచి చననొక
యజగర మాహారవాంఛనై వడిఁ బట్టెన్॥ 17

ఆ॥ వె॥ పాము చేతఁ బట్టువడి తినెఁ గైనను
జీవితేశ నన్నుఁ గావుమనుచుఁ
గదల మెదల నేర్పు గానక యాక్రంద
నము నిట్టులనియె నలినగంధి॥ 18

క॥ అటవిపతి బాసి కడులం
పటములు పడు నన్ను పాముపట్టెనయో! య
క్కటకటగోడు చుట్టుసైరో
కటిపాటును జూచి నిజము గానఁగ నయ్యెన్॥ 19

సీ॥ కరుణింపరే నన్ను ఘనదీనసంరక్షణాక్షీణ కరుణాసముద్రులార
ఆదరింపరె నన్ను నత్రిదీనవిపులార్తి జన పోషణవ్రతాచరణులార
కావరే నను సముత్కటభీతమానస నిత్యాపహక్రియానిరతులార
యరసి ప్రోవరె నన్ను శరణాగతత్రాణ చిరబిరుదాంక ప్రసిద్ధులార॥

గీ॥ ఆఁడుమొఱ యాలకింపరో యన్నలార

తనయకిపాముఁదునువరో తండ్రులార
ఆపదలుబీడఁజేయరో యనఘులార
అనుచువిలపించుచుండు నయ్యబ్జవదన॥ 20

క॥ అడవిని యొక్కకిరాతుం
డిదియేమిరయాఁడుదాని యేడుపటంచుం
గదియఁజను దెంచినదయా
స్పదమతినప్పాముఁదునిమి సతివిడిపించెన్॥ 21

క॥ ఆరమణిసన్నిహితకా
సారజలస్నానసమసారమృదుఫలా
హారంగావించిప్రియం
బారఁగనెఱుకిట్టులనియె నళికచతోడన్॥ 22

వ॥ నీ వెవ్వరిది వ్యధంబున నేకాకివై కాకియున్నారని యీకారడవి నేలతిరిగెదవు తెలియంజెప్పుమనిన నప్పతివ్రతాతిలకంబు తనవృత్తాంతంబంతయుఁ జెప్పినవిని. 23

ఉ॥ పుత్తడిబొమ్మఁబోలుసతి పొంకముచూచి కిరాతుఁడెంతయున్
చిత్తజుబారికగ్గమయి చిత్తమునెత్తమినత్తనత్తఱిన్
దత్తరపాటుతోఁద నవిధంబె జెఱఁగింపుచు డాయఁగోరుచో
నత్తరళాక్షిరోషవివశాత్మకయై కడుఁదాల్మిఁగిట్లనన్॥ 24

సీ॥ అకట నేఁజెల్ల నావంటియాఁడుతోడ
బుట్టువేయిట్లుపలుకనోరెట్లువచ్చె
నన్న! చెలియలికరణి నన్నాదరించి
మంచినోరను క్షేదేల నించుకొంటి॥ 25

వ॥ అనిన నక్కిరాతుండిట్లనియె. 26

ఉ॥ ముద్దులగుమ్మకమ్మవిరి ముల్కులమారుఁడునొంచిమించ నా
వద్దనునున్న వాఁడఁ బలుపల్కులుపల్కకుమన్న నేలి యా
గద్దరిచిల్కవారువపు గొరకడంక యడంపుమేను నీ
వద్దనుబాయకేలుబడి వానివిధంబునఁగాచియుండెదన్॥ 27

క॥ అపకారికినైననుమది
నుపకారముచేయఁదలఁతు రుత్తములిట నీ
కుపకారముఁజేసితి ప్రి
త్యుపకారము సేయవలదె యుత్పలగంధీ॥ 28

వ॥ అనిన నప్పతివ్రతాతిలకంబిట్లనియె. 29

క॥ కలుషంబునకింతేనియు
నులుకవునే జెల్ల నిప్పులొడిఁగట్టికొనం
దలఁతురెకటకటతలపైఁ
దలవచ్చెఁధరఁబతివ్రతలఁ జెనకుదురే॥ 30

క॥ సత్యాత్మకులను బాతి
వ్రత్యగుణాన్వితలఁ జెనకు వారలుదోషా
సక్త్యమునదవిలిచెడుదురు
నిత్యమనావిన వేధర్మనియమజ్ఞులచే॥ 31

వ॥ అనిన నద్దురాత్ముండిట్లనియె. 32

ఉ॥ శంఖసుకంఠ! శాస్త్రముల చాయలకేమిరతీశ్వరుండు వి
శృంఖలలీలఁ బ్రేల్వఁదనువిత్తుఁటినిల్చునె మేనువాసినన్
సంఖలప్రాప్తి చేసగు విచారములున్ గలవే శరీరమా
ద్యంఖలుధర్మసాధనమటం చనఁగా విన వేధ శాస్త్రలిన్॥ 33

వ॥ అనిన నప్పుణ్యసాధ్వికోపోద్రేకమానసయై వెండియునిట్లనియె. 34

క॥ తెలిపినఁ దెలియక క్రొవ్వున
మలయుచుఁబలుమారుఁ దిక్కుమాలెనుదలరో
కలిచుట్టుమనిన క్రైవడిఁ
బలికెదవిదియేమి చెప్పు పాపవిచారా॥ 35

గీ॥ కటకటా కేలుపోదవైనఁ గన్నతల్లిఁ
బట్టఁగానూహఁదలపోయుచెట్టగలఁడె
వలదునాబుద్ధిమదిలోన నిలిపినీవు
మనువిచారంబునొలుపు మీజనులునొగడ॥ 36

వ॥ అని యివ్విధంబున. 37

చ॥ పదతుక పెక్కుభంగులను బల్కినయట్టి హితోక్తులన్నియున్
బెడచెవిఁబెట్టి మీఁదనగుభీతిఁదలంపక కొంచకెంతయున్
జెడిదవుగండఁడై మదనుఁడుబిట్టుగలంపఁగ వాఁడులేచి పైఁ
బడఁదమకించినన్ దెలిసి భైమినిరోషనిరీక్షఁజూచినన్॥ 38

క॥ అక్కాంత వరమహత్వం
బక్కాంతపతివ్రతామహత్వమ్మునఁదా
నొక్కటియై నిమిషంబున
గ్రక్కునభస్మంబుఁజేసెఁ గష్టపుటెఱుకన్॥ 39

క॥ మెప్పులతముగీడొందెడు
చొప్పెఱుఁగక యొగ్గుసేయఁజూచినధంబెం
పొప్పినసతులకు నేమగు
నిప్పులఁజెదలంటనేర్చునే తలపోయన్॥ 40

వ॥ అంత నచ్చోటువాసి. 41

క॥ వనజాననయవ్వనమునఁ
జనిచనిదూరమునఁగాంచె జలఫలపర్ణా
శనులన్మునుల న్ఘనులన్
వినుతతపోధనులనిత్యనిర్మలతనులన్॥ 42

క॥ దవ్వులఁగనికడియంజని
నెవ్వగఁదమయెదుట నెలఁతనిలిచినదయతో
నవ్వాచంయమి నాయకు
లవ్వానివెవ్వరనిన నంగనపలికెన్॥ 43

ఉ॥ ధీవరులార నైషధునిదేవి నరాతులచేత రాజ్యల
క్ష్మీవిభవంబుఁగోలుపడి జీవితనాథుఁడు నేను దోడరా
నీవనిఁజేరిబిట్టలసి యేమఱినిద్దురవోవువేళను
దావిడనాడిపోయె ఘనధార్మికుఁడవ్విభుమీరుగంటిరే॥ 44

వ॥ తదన్వేషణార్థంబయి యివ్విధంబునం దిరుగుచున్నదాన నాపుణ్యవశంబున నిమ్మును
లఁగనుఁగొంటినిటమీఁదట. 45

మ॥ అతనిన్గానక యున్న నేవిపుతు దేహంబన్న నమ్మాత్రనుల్లో
పతినీకున్ బ్రియుఁగూడఁగల్గెకుఁ బునస్సామ్రాజ్యభోగంబు నీ
పతికిన్ జేకుఱు యోగదృష్టి నిటనీపైఁ బర్వుతాత్పర్యసం
స్థితిఁజేఁజూచితిమింక నమ్మి మిము లక్ష్మీభర్త ప్రోచున్ దయన్॥ 46

వ॥ అనిపలికి యాతపోధనులు తమజపోధ్యయనహోమానలంబులతో నదృశ్యులైన
నప్పతివ్రతామతల్లి భయాద్భుతసంశయంబులం బొందుచు. 47

క॥ వనిచని యగ్రస్థలమున
ననుపమమగు చనుషనందున గ్రేసరుఁడై
తనరిన సుచియను వానిన్
గనిమ్రొక్కి ణోనునలుని గానరెయనినన్॥ 48

ఆ॥వె॥ అతని నేము గానమని చెప్పి వారలు
చేదినగరమునకుఁ బోదలంచు
చందమెఱుక పడినఁ జందనగంధియా
దారి చనియె నతివిచారసరణి॥ 49

క॥ హరిణాక్షియు సార్థముతో
నరిగిన యా సార్థవాహులటు పోవు మవే
సరిపట్టపగలు గా గురు
తరమగు పేరెండ కాకఁ దాళక డప్పిన్॥ 50

క॥ అలసి తటాకము ముందట
నిలిచి దివముఁ గడపి రాత్రి నిద్రింపఁగ నా
లలన దమయంతి వారల
కెళవునఁ బవళించి కూరకే గాసిలుచోన్॥ 51

క॥ ఆ వేళ భయదవనదం
తావళములు చెరువులో వనంబులు ద్రావం
గా వచ్చి చనుపఁ గాంచిమ
దావేశతఁ జదియఁ ద్రొక్కె నందలి జనులన్॥ 52

ఉ॥ కొందఱుఁ బాదఘట్టనలఁ గొందఱు దంతనిపీడనంబులన్
గొందఱుఁ దుండసంహతుల ఘోరతరంబుగఁ జంపియుందఱన్
జెందరవందరై నలియఁ జేయఁగ రాయఁగ ముందుముందుగాఁ
గొంద ఱెఱింగి చెట్లకొనకొమ్మల నెక్కిరి పాఱియార్తులై॥ 53

వ॥ ఇవ్విధంబున. 54

క॥ అలచనుపలో నిజనులనె
వెలుచన్ వడిఁ ద్రొక్కెఁ గాని భీమతనయ చెం
తలఁ జేర వెఱచుఁ గరుల
య్యేలనాగపతి ప్రతాపమహిమయొ కానా॥ 55

క॥ అంతట మేల్కని యానృప
కాంతత దాహతజనాలిఁగని దుశ్చింతా
క్రాంతస్వాంతాంబుజయై
యెంతయుఁ గన్నీరు దొరుగ నిట్లనుఁ దనలోన్॥ 56

గీ॥ వీరలసహాయమున నైన వెడలఁగలుగు
నిమ్మహారణ్యమనుచు నే నెవరు చూడ
నేమి సేయుదుఁ గటకటా యిపుడు దోస
కారి దైవంబు సేఁత యీకరణి యయ్యె॥ 57

గీ॥ చెనటివిధి వీరలను జంపి చెరిచెఁగాని
వరుఁడు రోసిన ననుజంపవదలె నకట
మగఁడు వలవని దానిని మారియొల్ల
దనుట నిజమయ్యె నింక నేమనఁగ నేర్తు॥ 58

వ॥ అని శోకవ్యాకులితం బొంది యయ్యిందీవరాక్షి ప్రభాతంబున హతశేషభూసురస
మాగమంబునం జని చేదిపురంబుఁ జేరి యందు రాజమార్గంబునం జనునప్పుడు. 59

ఉ॥ అప్పురిరాజమాతమణి హర్మ్యతలంబుననుండి ధూళిచేఁ
గప్పినమేనిదాని తిరికట్టిఁ వేవలిదాని జీర్ణమై
యొప్పెడు చేలదాని నయనోత్పలకోణములందు బాష్పముల్
చిప్పిలుదాని భైమిఁగని చిత్తమునన్ జిగురొత్తు ప్రేమతోన్॥ 60

మ॥ తనదాదిం బ్రియమాడి పేసుకొని కాంతావింతయై మబ్బుగ
ప్పినపద్మాహితరేఖచందమున రూపింపం గృశీభూతయై
ఘనపాంసుప్రచయంబు మాటుగొను సాకారంబుతో వచ్చు దా
నిని సైరంధ్రి నిదోడి తెమ్ము మది నెంతేఁ బ్రేమ సంధిల్లెడున్॥ 61

గీ॥ అనినఁ జని దాదితో తేవ నవ్వధూటిఁ
ప్రీతితోఁ గాంచి యా రాజమాత వలికె
నవ్వ యెవ్వరిపాపవీ విట్టివిధమున
నేల వ్రతనిష్ఠఁ బూనితి వెరుగఁ జెపుమ॥ 62

వ॥ అనిన నప్పురంధ్రికి సైరంధ్రి యిట్లనియె. 63

క॥ వినుమత్పతి జూదంబునఁ
దనసిరిఁ గోల్పోయి నేను దానునరణ్యం

బునఁ జేరదైవకృతమున
ననువంచనఁజేసిచనియె నాథుండడవిన్॥ 64

వ॥ వాటంగోలెఁ దదన్వేషణార్థంబు సైరంధ్రీవేషంబునందిరుగుచున్నదాన ననికన్నీరు మున్నీరుగావగవనమ్మగువ నూరార్చి యారాజమాత నీపతింబశామర్మసేయు ధరామరులంబుత్తు వాదండనుండెదవేయని పలికిన వైదర్భియిట్లనియె. 65

క॥ కొఱగానిపనులు సేయను
బరపురుషులతోడఁబలుక పతి వెదకెడుభూ
సురవర్యులతోఁబలుకుదు
నిరతంబిట్లైన నన్ను నిలుపుము తల్లీ॥ 66

వ॥ అనవుడు. 67

గీ॥ అతివ నీకిష్టమెట్లయ్యె నట్లయుండు
మని సునందాఖ్యఁదనరెడు తనదుకూఁతు
మహితగుణశీలయా రాజమాతతనకు
నప్పనము సేయ సైరంధ్రి యపుడుపలికె॥ 68

క॥ ఓయమ్మ నిన్నుఁ జూచిన
మాయమ్మను జూచినట్లు మదిఁ బ్రియమయ్యెన్
నీయొద్దనుండుదనని విహి
తాయతమతితోడనుండె నాయమదండన్॥ 69

వ॥ ఇవ్విధంబుననుండి యయ్యింతి నిరంతర నిబిడవ్రతంబులుసలుపుచు జీవితేశ్వరచరణ సరసిజాధీనమాన మానసయగుచు నారాజమాతనికేతనంబునందుండె నిటనలుండు వార్ష్ణేయజీవలులు సహాయులుగా సూతపాకక్రియాతులదివంబులు గడుపుచు రాత్రులెల్ల దమయంతీవియోగదురంత సంతాపంబునంబొరలుచుండ నొక్కనాఁడు నిశాసమయంబున. 70

ఉ॥ హా సతి హా విలాసవతి హా హరినీలశనీలవేణి హా
భాసురకీరవాణి మృగబాధకమైనయరణ్యవీథిని
వ్రాసిన్నిఁబాయనమ్మమని పల్కినపల్కులు బోఁకపోలుగాఁ
జేసితి నిట్టికష్టునకు జెందకపోవునె దుర్యశస్థితుల్॥ 71

క॥ పాపపువిధిననుజంపక
యాపగిదిన్ బ్రదుకఁజేసె నేటికిఁజంపున్

బాపీచి రాయువనియెడి
యాపలుకదియేలకల్లయగుఁ దలపోయన్॥ 72

సీ॥ లేమ నీచూపులు లేఁడిచూపులటంచుఁ గఱకుబెబ్బులులు పైనుఱుకవన్నె
యింతి నీకుచములు దంతికుంభములంచుఁ గంఠీరవశ్రేణి కవియవన్నె
వనజాక్షి నీయూరులనఁటికంబములంచు వేదండములు చేరి విఱువవన్నె
వనిత నీజంఘలు వరిపొట్టలోయని గమియైన శాహముల్ నమలవన్నె॥

గీ॥ హా మనోహరగుణజాలహా సుశీల
యడవిమెకములచేత నే మైతివొక్కొ
కటకటా యింత చేసిన ఖలుని నన్ను
నెంత దూఱితివో కదా యిగురుబోణి॥ 73

వ॥ అని యివ్విధంబునం బ్రేలుచున్న యన్నరవరుని పల్కులు విని జీవలుండు తనమనంబున. 74

మ॥ ఇదియే రాకడు వింత యీ చెనటివాఁ డేణాక్షి వాపుచ్చుచున్
మదనావేశతఁ బ్రేలు నీజడుఁడు ప్రేమం గోరు నక్కాంతయె
ట్టిదియో రూపవిలాసరేఖతనకం బెన్నించుఁగాకున్న నా
మదినిన్ సంశయ మెల్లఁదీరఁగఁ బరామర్శింతు నంచున్ వెసన్॥ 75

ఆ॥ వె॥ కదియవచ్చి బాహుకా యిదియేమి నీ
వింత తలఁచి వగచితివుడు చాల
నవ్వధూటి యెవ్వ రెవ్విధంబున నెడఁ
బాసితేల తెలియఁ బలుకుమనిన॥ 76

వ॥ జీవలునకు బాహుకుండిట్లనియె. 77

క॥ ననుజూడు కామినీమణు
లనుజూడుము నీదుమాటలకు నవ్వరె చె
ప్పినవాఁడు చెనటి యైనను
వినువారలకైనఁ గడువివేకము వలదే॥ 78

క॥ అనఘా మందప్రజ్ఞుం
డను పేరిటి భటుఁడు తనలతాంగి నరణ్యం
బునఁ గోల్పడి కానక యి
ట్లనియడఁగఁగ బచిన నాఁడ నాతని యలపుల్॥ 79

వ॥ అని జీవలుని గతసంశయాత్మునింగావించి వెండియు జాయావియోగసంతాపంబం
తకంతకుద్రేకంబుగా శోకవ్యాకులతం బొరలిపొరలి తెరలినమనంబుననుండునంత
గొంతతడవునకు నత్యద్భుతంబును నకారణహేతుకంబును, ననంతకల్యాణసంధా
యకంబును నపారకృపావిభూతియుం గనుపట్టు బుత్తుసద్వృత్తు నిజప్రభాసాంద్ర
చంద్రికాపూర్ణ నివారితాశాంతరధ్వాంత పదనఖరుండును, హలకులిశపంకజధ్వ
జాంకుశాది భాగ్యరేఖావిరాజిత సుందరచరణారవిందుండును, ఘనమేఘనాదబం
ధురమంజీర రంజత్క్వంజాత రాగసంజాత శోభావిజృంభమాణ జంఘాద్వయుండు
ను, నితంబబింబావలంబ జాంబూనదాంబరాంచలాంచత్సముద్దండ వేదండశుండా
దండ ప్రతిమానసంభదూరుయుగళుండును, మణిఘంటికారణత్కాంచీ సమంచి
తకటిస్థలుండును, నంభోరుహప్రసూనాయతగంభీర నాభిగహ్వరుండును చరాచ
రాదిభూతసంఘాతసమేత లోకానీక ప్రపూర్ణోదరుండును, శతపత్రమిత్రసమాన
శోభాప్రశస్తకౌస్తుభరత్న శ్రీవత్సలాంఛనవిమలవక్షోవిలాసుండును, వజ్రవైడూ
ర్యగోమేధిక పుష్యరాగాది నవరత్నభాసమానాసమాన చారుబాహుపరిఘుండు
ను, కేయూరకంకణోర్మికాద్యాభరణ రుచిరకరారవిందుండును, శంఖచక్రగదా
నందకాత్తిసుందరహస్తచతుష్టయుండును, అంసోత్తరీయమానకనత్కనకాంశుకుం
డును, రాజద్వైజయంతీ వనమాలికావిలాసికంబుకంఠుండును, రాకాసుధాకరనిక
రప్రభావిభాసితమందస్మిత సుందరవదనమండలుండును, హేమప్రసూనసమానప
టుతర నాసాపుటుండును, ప్రచండమార్తాండమండలోప మానప్రవరమణి ఖచి
తకర్ణస్వర్ణమండనమండితగండస్థలుండును, కరుణాంతరంగరంగత్కటాక్షవీక్షణుం
డును, నగణితపరిమళమిళద్భృంగఘుగాయమాన మృగమదరేఖావిలాస భాసురాళీక
ప్రదేశుండును సకలమణినికరప్రకటమకుట సమంచితమస్తకుండును, ననవరతసు
గంధబంధుర పారిజాతప్రసూన దామప్రశోభితుండును, సర్వగుణపరిపూర్ణుండును,
సర్వజీవదయాపరుండును, కోటిసూర్యప్రకాశుండును, కోటికందర్పలావణ్యగ
ణ్యుండును, ఆర్తత్రాణపరాయణుండును నగు శ్రీమన్నారాయణుండు క్రొక్కా
రు మెఱుంగులతోడి నీలమేఘంబు తెఱంగున భూరమాసమేతుండై నిలిచి నిజతనూ
వికాసంబు యింద్రనీలంబులనీన నమ్మౌనవేంద్రుని కట్టెదుటంగనుపట్టినంగనియ
తండు పెన్నిధిగన్న పేదచందంబున సుధాసారంబుచేకొనిన క్షుధాతురునిభంగి
ప్రహృష్టాంతరంగుండై సాష్టాంగదండప్రణామంబులాచరించి పరంజ్యోతిప్రకా
శుండగు నప్పరమపురుషుని దివ్యతనూప్రకాశంబు చూపులకు మిఱుమిట్లుగొలుపని

మీలితలోచనుండును రోమాంచకంచుకితశరీరుండును, గద్గదకంఠుండును నగుచు
నజ్జగదీశ్వరుని నిట్లని స్తుతియించె. 80

దండకము:— శ్రీనాథ! ధాత్రీసనాథా! జగన్నాథ! సద్భక్తహృత్పద్మరోలంబ!
కారుణ్యసంవీక్షణా! నిర్మలజ్ఞానవాతాహతక్రోధకామాదిషడ్వర్గజీమూత! వా
చంయమివ్రాతహృద్దీప్య దారామచైత్రోదయా! దుర్వహాఖర్వగర్వోదయదోశ్శక్తి
మత్పూర్వగీర్వాణ సర్వంసహాజాత రాజీబృహద్భానుకీలాయమాన ప్రకృష్టప్రతా
పా కృతానేకపానీకపత్రాణ! ప్రోత్తుంగభంగోరుగంభీర శుంభత్సుధాంభోధి మ
ధ్యస్థశుద్ధాంతరంగైక శేషాహిరాట్తల్ప! కంజాతసంజాతసంక్షాళితోదార పాదా
రవిందాగ్ర నిష్ఠ్యూతగంగానదీవారి పాత్రీకృతానంగవిద్వేషికోటీర! స్రష్టృస్వరీ
శానలాబ్జాతరాజీసుహృజ్జాతయాత్వ్యంబు రాడ్వాతపౌలస్త్య ఫాలాంబకాద్యాదితే
యోరుమస్తస్థమాళివ్రజన్యస్థ నిర్వక్రశక్రోపలవ్రాత భూతిస్ఫురద్భంభరీపుంజసం
క్రీడితాంచత్పదాంభోరుహా! శుంభదామ్నాయమంజీరసంజాత వర్ణావళీహారవార
చ్ఛవిచ్ఛన్న జంఘాద్వయా! సంతతానంతవిజ్ఞాన భాస్వత్తపోయజ్ఞనిష్ఠాయతస్వర్సం
మిశ్రేష్ఠధైర్యాపహృత్తుర్య చాతుర్యసౌందర్యలీలోర్వశీనామ వామాదికోట్యప్సరః
పంకజాక్షీసముద్భూతహేతూరుకాండా కనజ్జంగమస్థావరానీక నిర్మాణకర్మప్ర
వీణాత్మభూజన్మసంస్థాననాభీసరోజాత! ధాత్రీవధూపీన వక్షోరుహద్వంద్వ
కాశ్మీరపంకాంకితోరస్స్థలా! సర్వగీర్వాణవిద్వేషి దుర్వారదోర్గర్వనిర్వాపణావ
క్రసంవిక్రమాలోల చక్రాబ్జకౌమోదకీ ఖడ్గశార్ఙ్గాదిదివ్యాయుధాంచత్కరాం
భోజ! వక్షస్స్థలాసీనసౌందర్యలీలాస్పద క్షీరవారాశిరాడ్బాలికాకేళికావైజయం
తీవిరాజచ్ఛిరోధీ! సుధాసారకర్పూరసంకాశ మందస్మితాంకూర రమ్యాస్యపంకే
జ హేలాసముత్తాలనీలావధూటీ నఖాంకూరదంతక్షతాఢ్యాధిదీవ్యత్కపోలాధ
రా! భవ్యచాంపేయసూనాభనాసాపుటా! నూత్నరత్నోజ్జ్వలత్కుండలోదీర్ణ
కర్ణద్వయా! భాసురాపాంగపూర్ణానుకంపా! సుధాంభోధిరాడ్భూమికాజాలడో
లావిహారోల్లసద్రాజహంసాక్షిపంకేరుహా! నీలశైలాగ్రరూఢ ప్రచండార్కబిం
బోపమానస్వమస్తో పరిన్యస్తమాణిక్యమాళి ప్రభాక్రాంతఫాలప్రదేశా! మురారీ!
సురారాతికాంతోరుసీమంతసిందూరనిర్భేదకృద్భూరిశౌర్యోజ్జ్వలా! స్వర్ణవర్ణస్ఫు
రత్పక్షవిక్షేపసంభూతవాతావధూతాభియాత్వ్యంబు ముక్పక్షిరాట్కంధరారోహ
కేళీవిలోలా! సమస్తాగమానీకదస్యుక్రియాపాటవప్రౌఢిమద్దైత్యపత్యన్వయాధా
ర దుర్వారదోస్సారసంహార కృన్మీనరూపా! నిలింపాసురవ్రాతసంక్షోభిత క్షీర

వారాశినిర్మగ్న మంథాన భూమీధ్రనిర్వాహకప్రౌఢి మత్స్యచ్ఛపాకార! స
ర్వంసహాచోరహేమాక్షనామామరద్వేషి విధ్వంసకృద్దివ్యభూదార! కాలానల
జ్వాలికామాలికాభీలదృగ్విస్ఫులింగచ్ఛటాపూర్ణ కాష్ఠాంతరిక్షాంతరై రమ్మదాపా
దదంష్ట్రోల్లసన్మర్త్యకంఠీరవా! చారువిజ్ఞానభాస్వద్వినిర్ధూత దోషాంధకారాది
యోగీంద్రహృత్పంజరం జత్పదాంభోజసంఛన్న నీరంధ్రవిశ్వంభరానంతశబ్దాకృ
తీ! సప్తవారాశివేలాపరీతావనీభారనిర్వాపణోద్దండదోర్దండ శాతాసినిర్భిన్న వి
ద్విట్చమూకార్తవీర్యాదిభూపాల కంఠస్రవద్రక్తసిక్తారచంచత్కుఠార ప్రశ
స్తావనీదేవరామావతారా! మరుద్యక్షసిద్ధోరగ స్వర్ణవిద్యాధరప్రాభవైశ్వర్యక
ల్లోలినీనాయకార్వాయమానప్రతాపానలాంచద్దశాస్యాసురాధీశ నిర్భేదనోపాయ
హేలాభుజస్తంభ సంరంభకాకుత్స్థవంశాగ్రణీ! చారుసౌందర్యసౌభాగ్యలీలాలస
ద్రేవతీనామవామాకటీభాగ నృత్యత్సనద్వంద్వవేణీ చరద్భవ్యహస్తాబ్జసంశోభినీ
లాంబరా! సిద్ధసాధ్యామృతాంధో మహోరస్సముద్వేల కీలాలధారాశిశుంభద్భ
జాటోప పౌరాదితేయాది నారీవ్రతాచార నిర్వాపణోపాయపారీణ బుద్ధాభిధా
నా! సురాపానహింసారతస్వర్ణ చౌర్యాదిదోషార్మికాసంకులాజ్ఞాన వారాశిమ
గ్న ప్రమత్త ప్రజాప్రాణవాతాపహృత్సైంధవారూఢకల్కిస్వరూపా! విరూ
పాక్షసంస్తుత్య! మాంపాహి పాహిత్వమేవాత్రబంధుః పితాత్వంచ, మాతాత్వ,
మార్త్రైకరక్షాగుణా! త్వాంవినానాస్తికించిన్మమ, శ్రీశమహ్యంభవాన్ పాదసే
వానిధానందదాతు; క్షమాదేవతాప్రాణబంధో! సదాహంభవంతంభజే; మేసమ
స్తాపరాధాన్ క్షమస్వ; శ్రియఃకాంత! తుభ్యం నమస్తే నమస్తే నమః 81

క॥ అనివినుతియొనర్చి పునః
పునరభివందనములొసఁగ భూవరతిలకుం
గనుఁగొని గనుఁగొని దయకను
గొనలం గనుపట్టనమ్ము కుందుఁడు వలికెన్ 82

క॥ వినుమిఁక మత్సందర్శన
మునభవదాపన్నికాయములు దలఁగును బై
కొనునుశుభము లెప్పటికర
ణిని వెస సామ్రాజ్యలక్ష్మి నిన్ను వరించున్ 83

వ॥ అని మఱియు నభీష్టంబులగు వరంబులు దయచేసి యప్పరమపురుషుండంతర్ధానంబు
నొందె నంత నలుండు మోదంబు నెమ్మదిం బాదుకొన యథోచితవృత్తినుండె నిట

కుండినవగరంబున దమయంతియు నలుండు నరణ్యంబునకుంజనుటవినిభీమభూకాం
తుండు చింతాక్రాంతుండయ్యె నంతఃపురకాంతలు సంతాపంబులంబొందిరందు
దమయంతి జనయిత్రి పుత్రిందలంచి 84

క॥ వాచిన్ని ముద్దుమాతుర
యో చెల్లరె యెచటనెట్టులున్నావో నీ
నోచిననోముఫలంబిపు
డీచందంబాయెతల్లి యేమననేర్తున్ 85

సీ॥ అబలనీనెయ్యంపుటయ్య నీరాకడకెదురుచూడఁగఁ జూడనేలరావు
యువతినీతోడబుట్టువులు నీరాకడకెదురుచూడఁగఁ జూడనేలరావు
లలననీముద్దుబాలకులు నీరాకడకెదురుచూడఁగఁ జూడనేలరావు
తెరవనీచెలిమికత్తియలు నీరాకడకెదురుచూడఁగఁ జూడనేలరావు

గీ॥ బాలనీవేలవత్తు వీవేళఁజాల
వగలనొగలంగఁజేసె దైవమ్ముమిమ్ము
నక్కటామిక్కుటంబైన యడలుగడలు
కొనఁగనెన్నఁడుచూతునో నినుఁగుమారి 86

వ॥ అనివగచుచున్న యచ్చపలనయనుపలాలించి భీమభూకాంతుండు తననగరంబునం
గల జగతీసురముఖ్యులరావించి సముచితోపచారంబులఁ బరితృప్తులంగావించి యి
ట్లనియె. 87

క॥ వినుఁడయ్యలారయిత్తఱిఁ
జనిమాదమయంతినిషధ జననాయకుఁడుం
డినచొప్పుఁదెలిసివచ్చిన
ఘనునకునేనిత్తువేయి గద్యాణంబుల్ 88

వ॥ అదియునుంగాక 89

గీ. వారినిచటికిఁదోడ్కొనివచ్చినట్టి
వారికేనిత్తు నూఱుగ్రామములును
గోసహస్రంబు నవరత్నకోటియనుచు
విభుఁడునమ్మించిపలికిన విప్రవరులు 90

వ॥ ప్రముదితాంతరంగులై యప్పనికొప్పి మప్పిరిగొన్న సంభ్రమంబున నలుదిక్కులంగ
లయంజని 91

క॥ మును నేనమాతు నేమును
గనుగొందునటంచు నెందొకరిమీాఱుచు వే
చని వెదకిరియిలఁగలపు
ణ్యనదీతీరములఁ బట్టణములవనములన్ 92

వ. అందు సుదేవుండను భూదేవుండు చేదిపురంబునకుం జేరంజనుదెంచి 93

ఉ॥ ఆహరిదశ్వతేజుఁడపుడప్పురియేలు నృపాలునింటఁబు
ణ్యాహము సేయఁబోయెదు ధరామరముఖ్యులతోడఁగూడి త
ద్గేహముఁజొచ్చియందుఁ బరికింపుచుఁగ్రక్కునఁగాంచెలోచనో
త్సాహమెలర్పభీమసుతఁ జారుపవిత్రితనార్యసన్నుతన్ 94

వ. కాంచి యద్ధరణీసురుండు ధరణీరజస్సమేతం బతిక్రశీభూతంబగు నంగంబుతోఁ దనరూపుమాటి వేఱొండురూపంబు చూపువేషధారిణిరీతి మైలచీరంబొదవిన రత్నపుత్రికచందంబునఁ దనయందంబేర్పరుపరాకయున్న యక్కన్నియదమయంతియగుంగాదను సంశయంబునం గొంతతడవునిరీక్షించి యంతనక్కమలవదన బొమల నడుమనమరియున్న చిహ్నంబట్టిన మంటిచేనెఱుంగరాక సూక్ష్మంబుగాఁగనుపట్టినంగని దానివలన నానలిననేత్రిభీమపుత్రికానిశ్చయించి తనలోన 95

క॥ ఔరా నా భాగ్యమునకు
మేరాయీరామఁగంటి మెచ్చివిదర్భ
క్ష్మారమణుఁడునాకటుస
త్కారంబులుసేయఁగఁటి ధన్యుఁడనైతిన్ 96

వ॥ అనిసంతసిల్లుచు సునందాసహితయైయున్న యన్నాతిఁగదియనేతెంచి యతండిట్లనియె 97

క॥ మగువవిను నాదిమండిన
నగరంబు సుదేవుఁ డండ్రునన్నీతోఁబు
ట్టుగులకుఁ బ్రియసఖుఁడను నె
వ్వాగతోమీయయ్య వనుపవచ్చితినని నన్ 98

క। తరుణీమణిధరణీసుర
వరునింగుఱుతెఱిఁగి కన్నదందొరఁగెడుబిం
దురతరశరధారలుతన
గురుకుచయుగళంబుమీఁదఁ గురియఁగఁబలికెన్ 99

ఉ. అమ్మకు సేమమే యనుఁగుటయ్యకు మోదమె యన్న లెంతయుఁ
నెమ్మదినున్నవారె వదినెల్ను భయుక్తలె ప్రీతచిత్తలే
తమ్ములు మంగళంబె మరదండ్రి సుబంధులు తక్కు మంత్రివ
ర్గమ్ములుఁ బౌరకోటులు శుభస్థితులే ధరణీసురోత్తమా 100

గీ॥ అన్న నాకూర్మి బాలకు లమ్మ నెమ్మ
దిగనుదగఁ బ్రోవనున్నారె వగలమిగుల
బెగ్గటిలకుగదా సదా ప్రేమ నన్న
లయ్యయును గారవింతురే యనఘ చెప్పుమ 101

వ. అనిన నలు దేవికి సుదేవుండిట్లనియె 102

క॥ ఏమని చెప్పుదు వారల
సేమము మీయమ్మ వగలఁ జెందుచు నెపుడుఁ
నీమీఁది ప్రేమచేఁ గృశ
యై మిగులం బ్రేలుచుండు నంబుజవదనా 103

క॥ ఓ కాంత భీమసేనుడు
హా కూఁతుర యెందు వోయి తయ్యో యనుచుఁ
వాకు నమనసున నెప్పుడు
నీకై కలపోయు నతని నెనరెట్టిదియో 104

గీ. వినుము దమనాంత దమనులు నినుఁదలంచి
మదిఁ గృశింపుచునుండు దురదియటుండె
తల్లి నీ చిన్ని పాపలు తల్లిఁ జూపు
మనుచుఁ బోరిడుచుండుదు రనుదినంబు 105

క. అనుచు నతఁడశ్రుధారలు
కనుఁగవ జలజలను గురియఁ గాఁబలుకఁగఁ దా
వినివగ చెభీమసుత హా
యని కన్నులనీరు వరదలై పారంగఁ 106

వ. అంత నావృత్తాంతంబంతయును సునంద తమతల్లికిం జెప్పి యనిపిన నా రాజమాత నిజసఖీజనపరివృతయై యేతెంచి సైరంధ్రిను పలాలించి బ్రాహ్మణోత్తముఁ గాంచి॥

క॥ సదమలగుణ యెవ్వరు నీ
విది యెవ్వరి పాప మీరలీగతివగఁ జెం

దేవ దేల చెప్పుమనన
మ్మదితకుఁ దెలియంగ విప్రముఖ్యుఁడు వలికెన్ 108

మ॥ విను నే భీమునకుం బురోహితుఁడ సాధ్వీరత్న మిక్కాంతయా
యనఘుంగూఁతురు నైషధేశ్వరునకిల్లాలాత్మ సాధుండఁవం
చనచేఁబోయిననిందుఁ జేరినది కాంక్షన్నవ్విదర్భేశుఁడం
పినరోయం జనుదెంచి యీసతిని సంప్రీతుండనై కాంచితిన్ 109

వ. మఱియు నిఖిలనృపవధూటీలలాట కాశ్మీరపంకాంక చరణ పంకజయగు నిమ్ముగుద యిట్టిదురవస్థం బొందెఁగదాయనియు సప్తద్వీపవసుంధరాధ్యక్షుదక్షుండైన నలుండిటపోయెనోయనియు నయ్యురువురకుం బరస్పరక్లేశపాశంబులుదవిలె నవియెవ్విధంబునం బాయునోయనియు దుఃఖించుచున్నవాఁడనిపలికిన నారాజమాత అయ్యా యివ్యేల నాగ నేగతిం దెలిసితివని యడిగిన నవ్విప్రముఖ్యుండిట్లనియె 110

క. కమలసంభవుఁడీయింతి బొమలనడుమ
భాగ్యరేఖార్థముగ వ్రాసెఁ బద్మరేఖ
యదియిపుడు సాంద్రమగు ధూళిఁబొదవినూత్న
గతినిగనుపట్టఁగని యెఱింగితిలతాంగి 111

వ॥ అని చెప్పి యాత్మజాంబ 112

గీ. బాలికారత్నము సునంద భైమి నుదురు
కనకకలశోదకంబులఁ గడిగిచూప
శ్రీకరంబైనయాపద్మరేఖంజూచి
యిందుముఖులెల్ల నాశ్చర్యమందిరపుడు 113

వ. అంత 114

క. ఆరాజమాత భైమిన్
గారవమునఁ గౌఁగిలించి కాంతా నేనీ
కూరిమిపినతల్లిని నీ
వారయ నాప్రియతనూజ వదియెట్లన్నన్ 115

ఉ. కొమ్మ దశార్ణనాయకునకుం దనుజాతలమై జనించి మీ
యమ్మ విదర్భభూవరున కాత్మవధూమణియై తనర్చెఁ దా
నిమ్మెయి వీరబాహునకు నేసతినైతినటంచుఁ జెప్పినన్
సమ్మతి మ్రొక్కె భైమి నయసంపద లేర్పడ రాజమాతకున్ 116

వ. మఱియు నద్దమయంతి సునందనెత్తికొని తనపినతల్లి కతివినయంబులు సలుపుచుండు
నయ్యెడ సుదేవమహీదేవుండా రాజమాతచేత నుచితసత్కారంబులువడసి వైదర్భి
యనుజ్ఞఁజని తత్కుశలవార్త భీమాదులకెఱింగించిన సంతుష్టాంతరంగులై దివ్యాం
బరాభరణాదులొసంగి యతని గారవించిరి. భీమకన్య యన్నగరంబునఁ గొన్ని వా
సరంబులుగడపి మాతృపితృపుత్రమిత్రసందర్శన లాలసమానసయై యొక్కనాఁడు
మాతృభగినిం గాంచి 117

శా॥ అమ్మా నీగృహమావిదర్భవిభుగేహంబెన్న నాకొక్కచం
దమ్మౌ గంగకు నీవలావలను భేదంబున్న దేయైన మా
యమ్మం దమ్ముల నయ్య నాత్మజుల మిత్రానీకముం జూచెదన్
సమ్మోదంబున నన్ను బంపుమనుచున్ సంప్రీతిగాఁ జొక్కఁగన్ 118

గీ. అపుడు రాజమాత యాత్మసుత ప్రేక్షి
తేష్టజనుల వెంట నిచ్చి పనుప
రత్నఖచిత హేమరథము పైదమయంతి
యెగుదెంచెఁ బుట్టినింటికడకు 119

వ॥ ఇట్లువచ్చి కుండిననగరంబు దరిసి జననీగృహంబు సొచ్చెనంత 120

సీ॥ ప్రాణనాథుని నెడబాసిన నాఁటి గాఁగను దామరల నీరుగ్రమ్మువాని
పోవుచుం బత్రించిపోయిన జీర్ణాంశుకార్ధసమావృతయైనదాని
నిబిడధూళీసమన్విత లోహితములైన కుంతలంబులు జడగొన్నదాని
పుడమిపైఁ బొరలఁగా నొడలనంటినమన్ను గప్పినలీనమౌ కాంతిదాని

గీ॥ అతికృశీభూతతను నంగయష్టి దాని
నురుమనస్తాపమున వెచ్చనూర్చుదాని
సతి నిదమయంతిఁ గాంచి దాశార్ణభీమ
వసుమతీనాయకుండుఁ జాలవగచి రపుడు 121

వ. తదనంతరంబ 122

క॥ జననీజనకులకును వం
దనమొప్పఁగఁ జేసి తమ తనయుం దనయన్
గనియెత్తి గారవింపుచుఁ
దనదుయథాపూర్వమగు వసతంబున నుండెన్ 123

ఉ॥ ఘోరపతివ్రతాతిలక నద్దమయంతి ధరిత్రిశయ్యయున్

చీరసగంబు సెవ్వగలఁ జిక్కినదేహము కల్గియుండియున్
గూరిమిభర్తరాకడలు కోరుట గాకిలబుట్టినింటనిం
పారెడుచారుశయ్య వసనాభరణాదులు గోరదెప్పుడున్ 124

వ॥ ఈక్రమంబునఁ బెక్కుదినంబులు గడపి యంతదురంతంబగు పతివియోగసంతాపభ
రంబున నెంతయుం దాళనోపక యొక్కనాఁ డప్పతివ్రతామతల్లి తల్లికిట్లనియె 125

సీ॥ అమ్మ నేఁ బ్రాణవల్లభు నెడఁబాసి
వత్సరంబులు మూడుగా వచ్చె నేటి
కైన నేర్పడదయ్యె నాకతనియునికి
యేవిధంబునఁ దాళుదు నింకఁ జెపుమ 126

క॥ అకటా వెనుకటిదివసము
లొకదినమొక యేడురీతి నుండు నిపుడు నా
కొక నిమిషంబొక యేడై
తెక తెకమదియుడుకఁ జొచ్చె దృఢతాపాగ్నిన్ 127

క॥ వను వెదకినచందంబున
ఘనుమత్ప్రాణేశు నరయఁ గాఁ బంపుండెం
దునతఁడు గనఁబడకుండిన
వినుమిఁకఁ బ్రాణంబులైన విడిచెదఁ దల్లీ 128

గీ॥ అనిపలుకుకూఁతు నూరార్చి జననివలికె
నింతిమీయయ్యకల్గుగ వెయ్యేండ్లకనుచు
బోలువగనింత మాటాడ నేల యిపుడు
విన్నపము చేసి పనుతు నీవిభుని నరయ 129

వ॥ అనిపలికి యాక్షణంబ యావాశార్ణపాణేశ్వరుండగు భీమకీర్తీశ్వరుని కడకుం జే
రం జనుదెంచి తద్విధం బంతయుం జెప్పిన విని తదనంతరంబ 130

క॥ భీముఁడు నలునరయుటకు ధ
రామరులం బంచె నప్పుడవ్విప్రులతో
భైమియిటులనియెఁ దనవా
చామాధుర్యంబు సరసచాతుర్యము గాన్ 131

ఆ॥ అనఘులార వినుఁడు మనుసల్పుఁడధిక సం
పన్నుఁ డగుటఁ జేసి తన్ను నిప్పు

ఘోరతెలుంగపండ నొదిగియుండెడుగాన
నతని నెఱిఁగికొనఁగ నరిది మీకు 132

వ॥ అయిన నొక్కయుపాయంబు చెప్పెద మీరు సకలదేశాంతరంబులకరిగి తత్తత్స
భాసమక్షంబున నిట్లనిపలుకవలయు 133

చ॥ అతులితధర్మమార్గములనారడి బుచ్చివినిర్దయుండవై
సతి మొలచేలఁజించికొని సత్యముఁదప్పియరణ్యవీథిని
క్కతవిడనాడినిందఁబడి కష్టతనంబునవచ్చియిచ్చటన్
హతమతినున్నవాఁడవహహా యిదిధర్మమెకీర్తిహేతువే 134

వ॥ అని మీరుపలుకవలయుననిన నందుపర్ణాదుండను బ్రాహ్మణుండయోధ్యానగరం
బునకరిగి ఋతుపర్ణసభాస్థలంబున దమయంతి వచనప్రకారంబున 135

చ॥ అతులితధర్మమార్గములనారడి బుచ్చివినిర్దయుండవై
సతి మొలచేలఁజించికొని సత్యముఁదప్పియరణ్యవీథిని
క్కతవిడనాడినిందఁబడి కష్టతనంబునవచ్చియిచ్చటన్
హతమతినున్నవాఁడవహహా యిదిధర్మమెకీర్తిహేతువే 136

క॥ అనినసభాసదులందఱు
వినియూరకుండిరపుడు వెసబాహుకుఁడో
య్యనగడకుఁజేరఁబిలిచియ
తనితోఁగడువెచ్చనూర్చి తానిట్లనియెన్ 137

క॥ పతియొకసమయంబునదు
ర్మతిచేనపరాధియైన మదిఁదాళినయా
సతికినిజసామ్రంతరముల
నతులితభోగములుకలుగు నవ్విభవలనన్ 138

వ॥ అని వేఱొండుపలుకక యబ్బాహుకుండతిత్వరితగమనంబునసరిగిన 139

ఆ॥ అతనిపలుకు చందమరయంగలేక తా
నెట్టియగుటఁజేసి విప్రముఖ్యుఁ
డతని నెట్టియనుచు నాత్మలోఁబదరుచు
తిరుగఁజని విదర్భకరుగుదెంచి 140

సీ॥ అతఁడువైదర్భికిట్లనిపల్కె వినుమవ్వ యేనునీయనుమతి నేగి సకల
దేశాంతరంబులకరిగి తత్తత్సభాస్థలముల నీవన్న చందమునను

బలికిననెవ్వరుబ్రత్యుత్తరంబీని కారణముననట గానలేక
మగుడుచో సాకేతనగరిలో ఋతుపర్ణసాస్థానమున నెప్పటట్లయంటి

గీ॥ ననఁగవినియొక్కరుడు బాహుకాభిధాను
డతివికృతరూపి హయశిక్షణాధికారి
సభికులకుమాటు గాఁ గనుసన్నఁ జేసి
యెడకుననుఁజీరివడి నూర్చియిట్టులనియె 141

క॥ పతియొకసమయంబునదు
ర్మతిచేనపరాధియైన మదిఁబాలినయా
సతికినిజజన్మాంతరముల
నతులితభోగములుగలుగు నవ్విభువలనన్ 142

క॥ అనియెంజ్జేమియు నాడక
గునగునఁబరువారెనతఁడు కోమలి నేనా
తనివెత్తియనుచుఁ బదరుచుఁ
జను దెంచితినన్న నలునిసతిమదిలోనన్ 143

వ॥ చింతాక్రాంతయై తల పోసి 144

చ॥ అతివికృతంపుచందమగు నాకృతినుండిన నేమిమాటలం
జతురత గాననీక యొక చాయఁ బల్కిన నేమిచూపఁబుల్
సతతము బేలఁడీతఁడని సారెపనవ్విన నేమి పోల్పఁగా
నతఁడు నలుండు గావలయు నారయనిప్పటివాక్యవైఖరిన్ 145

క॥ పలువిధములఁదలపోసిన
నలఘుతరుండతఁడు నలుఁడయగు గాకున్నన్
తలఁపఁగఁదనుఁ దానూరక
పలుకన్ బనియేమి భూసుపర్వునితోడన్ 146

వ॥ అనితలపోసి యబ్బాహుకుండిటకు వచ్చినం బరీక్షించి నిశ్చయింపవచ్చు నతనిరాక కుపాయంబెద్దియొకో యని కొండొకచింతించి యిట్టియెడఁ గార్యనిర్వాహకసమ 147
ర్థుండు సుదేవుండొక్కరుండ కాని యితరులసమర్థులని

క॥ వనితసుదేవునిభీముని
యనుమతిరప్పించి సవినయముననలనికి
ట్లనియె మహాత్మ యిత్తఱిఁ

జనవలయునయోధ్యకీవు సంప్రీతి మెయిన్ 148

వ॥ మనపర్ణాదులవలని వృత్తాంతంబంతయు మీరువినినదియొకదా దినమణివంశమణియైన ఋతుపర్ణునెదుట దమయంతి ద్వితీయస్వయంవరంబెల్లియగునని వినిపింపవలయు బాహుకుండు నైషధుండగునేని దత్సమయంబున నబ్భూకాంతుం డేకవాసరంబున నిటకుంజేరంజనుదెంచు నతండు నలుండుకాఁడేని రానోపఁడు నేతత్ప్రకారంబునం దదీయంబగు భేదంబేర్పడునని తెలిపి పనిచిన నతండయోధ్యానగరంబునకరిగి ఋతుపర్ణునివలని యాతిథ్యసత్కారంబులువడసి యప్పుడమిఱేఁడు దేశాంతరవృత్తాంతంబులడిగిన తత్తద్విశేషంబులెఱింగించి ప్రసంగంబుగా నింకనొక్కమహాశ్చర్యంబుగలదు వినుమని యిట్లనియె 149

చ॥ వినికనిము న్నెఱుంగనిది వేఱొకవింతజనించెనిప్డు స
జ్జనను తుఁడైననైషధుఁడు సాధ్వినరణ్యములోనడించిపో
యినదిహేతుకంబుగ మహీశుఁడుభీముఁడు పేర్మినాత్మనం
దనకుఁబునస్స్వయంవరము తానొనరింపఁదలంచిప్రీతుఁడై 150

ఆ॥ జగతినెల్లదిశలఁ జాటింపనప్పురి
కఖిలరాజవర్యు లరుగుదెంచి
రింకఁదడవుసేయ రెల్లిటనెల్లుంట
నగునుడత్పున స్స్వయంవరంబు 151

వ॥ అనినవిని యత్యద్భుతంబుంబొంది ఋతుపర్ణుండు 152

క॥ ఏమేమీదమయంతిస
తీమణియనవెలసి యిట్టితెరగయ్యెనయో
హోమగువలమధినమ్మిన
పామరులకునింక నిహాముపరముగలదే 153

వ॥ అనిపలికి తనమనంబున 154

చ॥ కలికిపునస్స్వయంవరముఖంబున భూవరులెల్లఁగూడఁగా
నిలవినివేనుఁబోవునికి హీనతవాటిలుగాదెచేరఁగా
నలవియెయొక్కనాట నిటకప్పురియెంచఁగ నూఱుయోజనం
బులుగలదెట్లొకోయనుచు భూపకులాగ్రణి ఖిన్నచిత్తుఁడై 155

క॥ ఉన్నయెడఁగాంచిబాహుకుఁ
డన్నరవరుఁగదియవచ్చి యనఘానీవీ

పిన్నదనంబుననీగతి
నున్నపనేమనినఁబలికె నుర్వీధవుఁడున్ 156

సీ॥ వినుము బాహుక నలుని దేవికిపునస్స్వ
యంవరము చాటిపెయనుచుఁ దథ్యముగ వింటి
దినములోపల నూఱు యోజనము లెట్లు
బోదు నను చింత నామదిఁ బుట్టెననిన 157

వ॥ బాహుకుండిట్లనియె 158

క॥ మనుజేంద్ర యింతమాత్రపు
పనికై చింతింపనేల బాహుకుఁడుండన్
నిను నొక్కగడియ వానే
ర్చిన గతిఁ గొనిపోదు నశ్వశిక్షాప్రౌఢిన్ 159

సీ॥ అనిన ఋతుపర్ణుఁ డుప్పొంగ నతనిగార
వించి తాపయక నీవేగి వేగ మరద
మాయితము చేసి తెమ్మని యానతిచ్చి
పనుపఁబనిఁబూని చనుచు నబ్బాహుకుండు 160

వ॥ తనమనంబున 161

చ॥ అకలుషలీల నాయెడఁ బ్రియంబున యంబుఁ దలిర్పఁ జేయు పూ
నికగ నుపట్టభీమసుత నీచమతింజలచిత్తయయ్యునే
యకటగణింపనేలయిఁక హాతెలపోయఁగఁ బూతక్లిమ
చ్చికలుగ దావభూజనము చేసెడి యిచ్చక బుచ్చకంబులన్ 162

ఉ॥ కాంతపతివ్రతాజనశిఖామణి యయ్యును దన్ను నేనర
ణ్యాంతరభూమిలో నెడసినట్టి మనోవ్యథ నింత చేసెనో
యెంతయు మిథ్యయో తలఁప నీయనుమానమి దేలయమ్మహీ
కాంతుని గూడి పోవు నెడఁ గానఁగ నయ్యెడు నన్ని చందముల్ 163

వ॥ అనితలపోసి 164

క॥ మును వార్ష్ణేయుఁడు చేర్చిన
తనహయముల నొక్కకట్టి తద్రథము వనీ
శునియెదుట నిలుపు చోనా
యనయొక్కన్ మొగ్గి నవ్వదశ్వంబులిలన్ 165

ఉ॥ మేరువుఁజుట్టి రాఁదిరుగు మెచ్చులపచ్చగురాలకంటెపై
త్యారికిఁగల్కి-రూపసమయంబునఁ బూనెడువాజికంటె జం
ఘాకినింపుసొంపొదవసాగెడు వెల్లపతాణికంటెనీ
వారువముల్ రయోన్నతినివాసిఁ దనర్చుధరానరోత్తమా 166

క॥ అనిపలికినవినిసంతస
మునఁబొదలుచు భానువంశముఖ్యుఁడు వార్ష్ణే
యునితోడరథారోహణ
మొనరించెనుబాహుకాఖ్యుఁ డురుమోదమునన్ 167

వ॥ రథంబత్రిత్వరితగమనంబుగాఁ బరపింపందొడంగె మఱియును 168

చ॥ అనిలునిఁ జిన్నబుచ్చుసరయంబగు తద్రథయానమప్పుడే
మనిగణుతింపవచ్చునహహా యెదురంగనుపట్టుపంచయో
జనమితదూరతుంగనగపంచయముల్ నిమిషంబులోపలం
దనువెసఁజూడఁగానమరెఁ దద్దయయోజనసప్తకంబునన్ 169

వ॥ అడిగనుంగొని ఋతుపర్ణుం డద్భుతంబునుంబొందె. వార్ష్ణేయుండు తనమనంబున 170

గీ॥ అకట యీరథనిర్ఘోషమరసిచూడ
నలునరదమెట్టులట్లయ్యె నాదుమదికి
బాహుకుండీవికృతరూపభావమొందు
టేమియోకాని నిజరూపమెట్లుఁగాదు 171

సీ॥ అనిసంశయాకులితాత్ముఁడై చనువేళఁ దనయుత్తరీయంబు ధరణిఁబడిన
పార్థివేంద్రుఁడుకాంచి బాహుకవార్ష్ణేయుఁడరిగి నాయుత్తరీయంబుఁదెచ్చు
నంతకురథమాపుమనిన బాహుఁడిట్టులనికె భవద్వస్త్రపతనమైన
యచ్చోటుయోజనంబగు నిచ్చటికినింక నేరీతిఁబోనేర్చునితఁడటంచు

గీ॥ దనయసమనూత కౌశలత్వంబుఁదెలిపి
రమ్యవనశైలదేశాంతరములుగడచి
పోవునెడనొక్క- గహనాంతభూమియందు
గురుతరంబౌ విభీతకతరువుఁగాంచి 172

వ॥ ఋతుపర్ణుండు బాహుకునకిట్లనియె 173

క॥ పెక్కులుగలవిలవిద్యలు
ఒకొక్కఁడునేర్చియుండు నొకొక్కటియుం

దోఃకూటికోకూటిమిక్కిలి
యొక్కువయైభిన్నవిధము తేర్పడియుండుఁ౯ 174

॥ ఏనువస్తుసంఖ్య లెన్నక చూచియ
క్షణమె చెప్పనేర్తుఁ గానఁజూడు
మిపుడు తెలియఁజెపుదు నిబ్బిభీతకఫల
పర్ణచయముగణన బాహుకాఖ్య 175

॥ అనఘమొదలింటి శాఖాద్వయంబునందు
నెన్నఁబదివేల నెక్కుటియితరమైన
వన్నియును రెండువేలపై నరయఁదోంప
దేనుఫలపర్ణచయమొప్ప భూనుతముగ 176

వ॥ అనిననలుండాక్షణంబ వృక్షంబుఁబడంద్రోచి తానదళఫలంబులెన్ని బుతుపర్ణుండె న్ని చెప్పె నన్నియైన నత్యాశ్చర్యమనస్కుండై యతనివలనిచూచి యవ్విద్యనా కుంబరిసాదింపవలయుననిన నయ్యినవంశరత్నం బిట్లనియె 177

క॥ ఈవిద్యవలనసకలసు
భావహమగు నక్షహృదయమనఁగఁ బ్రసిద్ధం
బై వెలసెనియ్యదనిప్పు
డ్వీవరుఁడవ్విద్యఁగర పె విధ్యుక్తముగా౯ 178

వ॥ అంత 179

క॥ ఇలనక్షహృదయమనురవి
నలమానసపద్మపూర్వ నగమనుచక్కి౯
నెలకొనినంతనెకలికృత
బలవద్దోషాంధకార పటలమువిరిసె౯ 180

వ॥ ఆక్షణంబ 181

చ॥ అలఘుగుణోన్నతాక్షహృదయాంచిత శక్తికితాళలేకయా
నలవిభునందు వెల్వడి ఘనంబగుభీతిని గేలుమోడ్చితఁ౯
దెలుపుమునిల్చియున్న కలిఁ దీవ్రతరంబగు శాపవహ్ని చేఁ
బొలియఁగఁజేయువాఁడనని పూనినసైషధుఁజూచియార్తుఁడై 182

వ॥ దైన్యోక్తుల నక్కలి యిట్లనియె 183

గీ॥ అధిపనీమొదనపరాధి నైనన్నుఁ

గాల్చెఁ గర్కోటకాహీంద్రు గరళవహ్ని
యిట్టి నామీఁదఁ దెగిపూన నేలపెఁడుగ
బడిన యాతనికో యవిఁ గాల్పంగదగునె 184

వ॥ అనిన కరుణాసముద్రుండగు నలుండు వానిం గరుణించి విడిచి యిట్లనియె 185

క॥ వను ఋతుపర్ణనిదమయాం
త్రినిగర్కోటకఫణీంద్రు దినదినమును మే
ల్కొనుతఱిఁ గీర్తించిన యా
ఘనులం గదియకుము నీవు కపటవిచారా 186

వ॥ అనినం గలి మహాప్రసాదంబని యావృక్షంబు నాశ్రయించియుండె నలుండు ఋతుపర్ణుం గనుంగొని మహాత్మా భవత్ప్రసాదంబున ముదిత యక్షహృదయం బైన యక్షహృదంబు నాకు సిద్ధించె నాయందుఁ గలుగు నశ్వసౌహృదంబు నీవు కొనవలయు ననిన ఋతుపర్ణుండు నావలసినప్పుడు కొనియెద నుండ నిమ్మనిన నతండు ప్రహృష్టాంతరంగుండై రథంబు గడపం దొడంగె నివ్విధంబునం జని యమ్మువ్వురు నపరాహ్ణాంతరంబున కుండినపురంబుఁ జేరం జనుదెంచిన 187

క॥ ఋతుపర్ణనకు భీమ
క్షితిపతి వినయములు సలిపి శ్రీకరమహిమాం
చితకాంచనరత్నసమ
న్వితమగు సౌధంబునందు విడియం జేసెన్ 188

వ॥ అప్పుడు 189

చ॥ అటదమయంతి సౌధశిఖరాగ్రతలంబున నిల్చియుండి మి
క్కుటముగ కోర్కెఁ గాంచి తనకూరిమితో యవ్వలిఁ బిల్చిపల్కె నో
కుటిలవినీలవేణిక సుగొంటివె రత్నవిభూషణాలిచే
బటుగతి నొప్పవాని ఋతుపర్ణనిభానుకులాగ్రగణ్యునిన్ 190

గీ. అతని చెంగట నిలుచున్న యట్టివాఁడు
వెలఁదిపార్ష్ణేయుఁడతఁడు మద్విభుని యంత
యతని నెఱుఁగుదు వారల కవలనున్న
యల్లమూఁడవవాఁ డెవ్వఁ డెఱయవలయు 191

వ॥ అతని చందంబు డెందంబునం దలపోసిన మనప్రహ్లాదనకరుం బ్రత్యుత్తరం బిచ్చిన యతండిలెండై కావలయు నీవతనికడకుం జని స్వరూపస్వభావంబు లరసికొని రావలయు న

నినఁ గేశినియనునక్కాంత బాహుకుంజేరంజని మృదువచనంబుల నిట్లనియె 192

క॥ అన్నా మీరెవ్వరు నేఁ
డిన్నెలవునకరుగుదేర నేపనిగుణసం
పన్న వినఁ గానఁ బ్రియమ్మున
నన్నలినేత్రకును బాహుకాఖ్యుఁడు వలికెన్ 193

క॥ కోటీబుతుపర్ణుఁడొక
నాటనుజనుదెంచె యోజనంబులునూఱు
చొప్పడదమయంతి పెండ్లికిఁ
జాటించినవార్తవిని ససంభ్రమలీలన్ 194

గీ॥ అతనిరథచోదకుండ నే నల్లయతఁడు
నలునిసారథి వార్ష్ణేయ నాముఁడనిన
ననఘ నలుఁ డెందునో యెఱ్ఱో యాతఁ డెఱుఁగ
కుంకు నేయని పల్కె ననువిదఁ గాంచి 195

వ॥ బాహుకుండిట్లనియె 196

క॥ సకియా! దమయంతీ నలు
లకలుషసామ్రాజ్య మేలునపుడతడీయా
ర్భకులం గొనియచటికి తే
లుకడపుకొనివచ్చి వీఁడెఱుంగడు వారిన్ 197

క॥ రమణీమణినలుజాడలు
దమయంతికిఁ దెలియు గాని తక్కొరులకు శ
క్యము గాదు తెలియ వారి
దభ్రమునన తండె చటఁజేరి దాఁగిన వాఁడో 198

మ॥ అని కాంతాళి దవద్యోత్య వంటపని చేయం బోదు నేనంచు నా
యనదిక్పాలకదత్తపూర్వ వరసామర్థ్యంబునన్ గడ్డిగా
క్కానఁ బోయ్యాదకమండె నింగిలము లేకేశూన్యకుంభంబు వె
ట్టినఁ దాఁ బానజలంబు నిండెఁ గడువం డెన్ దాను నేర్వొప్పడన్ 199

క॥ అదియంతయుఁగనికేశిని
మదినబ్బురపడుచు భీమమనుజేంద్రసుతా
సదనంబుఁ జేరఁ గాఁజని

విదితంబుగఁబల్కె నతని విధమాయమతోన్ 200

వ॥ ఇట్లు చెప్పిన తద్వృత్తాంతంబంతయును విని దమయంతి యంతరంబున 201

క॥ వరుణానలులొసగిరిమను
వరములునలవిభునికతఁడు వలసినయెడలన్
శరములువహ్నియుఁగలుగఁ
బరికింపఁగదీననిషధ పతిగావలయున్ 202

క॥ అనుచుఁదలపోసియబ్జాభ
మినికేశినికిట్లుపలికె నెలఁతయతఁడువం
డినవంటయెద్దియేనియుఁ
గొనితెచ్చిననతనినెఱిఁగి కొందముదానన్ 203

మ॥ అనినన్ గేశినిబాహుకాహ్వయుని డాయంబోయినీవిష్ఠుచుం
యనదాలించినకమ్మగూర మనసయ్యెంగాన నర్థింతుని
న్ననభాస్వత్కృపనించుకంత దయచేయంబాడినాకన్న నా
యనయొక్కించుక మాంసఖండమిడెనయ్యంభోజపత్రాక్షికిన్ 204

క. అదికొనిచనియక్కేశిని
సుదతీమణియైన భీమసుతకిచ్చినన
మ్మదితతదాఘ్రాణమ్మన
హృదయేశునివంటయగుట యెఱిఁగెముదమునన్ 205

వ॥ ఇష్వాకసౌరభ్యంబభివర్ణింప మత్ప్రాణేశ్వరకృతంబయగుంగాని యితరంబుగా ద
తనింగదియ మదీయార్భకులంబంచినంగాంచి యేమనగలవాఁడో పరీక్షింపవలయున
నితలంచి యక్కేశినింగాంచి 206

క॥ తనకూర్మిడింభకులఁదో
డ్కొనిపొమ్మన వారినెత్తుకొనికేశినిపో
యిననబ్బాలురనిద్దఱఁ
గనుఁగొనినలుడాత్మ నడలుగడలుకొనంగన్ 207

ఉ॥ కన్నులబాష్పబిందువులు గ్రమ్మగమైఁబులకల్ జనింపనా
కొన్నతఱిన్ సుధారసము కుండలరాఁగయికొన్నయట్లు పై
కొన్నతమిన్నిజార్భకులఁ గూరిమినందిశుభాంకపాళిన
త్యున్నతలీలనిల్పి ప్రియమొప్పగనక్కునఁ జేర్చివెండియున్ 208

గీ॥ కన్గొనలనీరువరదలు గట్టమోము
వాంచికొనియున్న యన్నలువలనుజూచి
యనఘుయిదియేమి కారణమ్మనవ నేడ్చె
దీవనినఁగేశినికి నతండిట్టు లనియె 209

గీ॥ జాతిబాలకులిరువురు నాకుగలరు
వీరిప్రతిబింబములు వారువారినెడసి
యింతదూరంబువచ్చితి నెట్టులున్న
వారొవారనిమదిఁజాల వగపుదొడరె 210

వ. అని వెండియు నతండిట్లనియె 211

క॥ లలనబహుదూరదేశ
స్థులమేమతిథులము మాకుసుదతులతోమా
టలుపచరింపనధర్మము
పలుమరునిల్లేగ దేరఁ బాడియెనీకున్ 212

క॥ నెలఁతలుడాసినసన్న్యా
సులకైననుమనసు చెదరిసుజ్ఞానంబున్
దలపోలయు వెడలఁబారెడు
నిలపాపంబులకుమూల మింతులుకారే 213

క॥ పైకెక్కులోనిచిక్కున్
మాటలతియ్యందనంబు మలయుగమటమున్
జాటించిచూడబోటీ
బూటకములు మేడిపండుపోలికగాదే 214

మ॥ సరసజ్ఞానవినాశహేతుక మనుష్యావాదిదూరంబు దు
స్తరమోహాతిశయానుకూలము విపత్సంప్రాప్తిమూలంబు దు
ష్కరసంసారనిబంధకారణము దోషవ్యాజసంధానబం
ధురమాశీజనసంగతంబు మదినెందున్మెత్తురే సజ్జనుల్ 215

క॥ కావుననిచ్చటనుండం
గావలవదు వెడలుమీవు కాంతాయనినన్
దావిన్న బాటుతోఁగసె
నావనజదళాయతాక్షి యద్భుతయుతయై 216

వ॥ ఇట్లుచని యవ్వనిత తనపోయినతెఱంగును నతండుడింభద్వయంబు గనుంగొని పులకాంకురితతనుండును గద్గదకంఠుండును నగుచు వారలఁగౌఁగిలించికొని నిజాంకతలంబుననునుపుటయుఁ దానడిగినప్రశ్నకుఁ బ్రత్యుత్తరంబిచ్చినచందంబును ఓదప స్త్రీనిందాప్రశంసంబులుగాఁ బలికినవిధంబును సవిస్తరంబుగాఁ జెప్పినవిని దమయంతి యయ్యంతికిట్లనియె, నతండు నిషధేశ్వరుండగుట నిజంబు. మదీయంబైన మృషాద్వితీయస్వయంవరంబు నిజంబకాతలంచి పలికినచందంబు గనిపించుచున్నయది కాఁడేని యీనిసుఁగులంగని వగయుటకేమికారణంబు మఱియును 217

గీ॥ ఎన్ని భంగులనరసిన నితఁడునిషధ
పతియగుటనిశ్చయంబింక నతనినిటకుఁ
జేరరప్పించి నేను భాషించిచూడ
వలయునందులమర్మంబు దెలియవచ్చు 218

క॥ అనిపలికిమార్మిజనకుని
తనకడకుంజేరఁబిలిచి తద్విధమెల్లన్
వినిపించిజనక ! ఋతుప
ర్ణునిసూతునివలన మద్వరుని దెలియనగున్ 219

వ. అనివిన్నవించి యతనినిటకురప్పింపవలయుననిన నాతఁడునంబ 220

క॥ కుతలాధిభర్తభీముం
డతివేగముమీరఁ బిలువనంపినవచ్చెన్
ఋతుపర్ణక్షితిపతియను
మతిఁగొనిబాహుకుఁడు భైమిమందిరమునకున్ 221

వ॥ అప్పుడు 222

క. అరుదెంచినందులకున
బ్బురమొందుచునతనిఁగాంచి భూవరసుతక
న్నీరములుఁగురిసెదుఃపలుకులఁ
దెరమఱుఁగుననుండిపలికె దీర్ఘోష్ణ తయై 223

చ॥ సురవరముఖ్యదిక్పతులు చూచుచునుండఁగ నగ్ని సాక్షి గాఁ
బరిణయమైనయట్టి కులపత్ని నిదుస్తరఘోరకాననాం
తరమునఁబీడనాఁడి దురితంబునకోడక నిందకోర్చిదు
ష్కరమతినైషధేశ్వరునికైవడిఁ బోయినవారిఁగంటిరే 224

వ॥ అనిన నలుండిట్లనియె 225

చ॥ వినుముసరోజనేత్ర పృథివీస్థలినాపద లొందువేళలన్
వనితలఁబాయునట్టి మగవారలఁ జూతుముగాని భర్తృవా
సినను బునస్స్వయంవరము సేయఁదలంచినయట్టి భామలన్
వినికనియెన్నఁడేనెఱుఁగ వేయును జెప్పఁగనేలయిత్తఱిన్ 226

వ॥ అనిన వైదర్భియిట్లనియె 227

తరళ॥ ప్రియుదనిన్నడవాయనేనని పల్కి దాని నరణ్యమ
ధ్యమునన్నిదురవోవగా విడనాడిపోయిననిర్దయుల్
తమనెపంబటు పెట్టి కాంతలఁదప్పలేనిదెయ్యైన భా
వమున నెన్నఁడురేలోకో మగవారివర్తనలిట్టివే 228

వ॥ అనిన వైరసేనియిట్లనియె 229

చ॥ ననుకలి వొందుటన్ సిరులునాశిలి పోవుచుఁ బుట్టినింటికిన్
నినుఁజనుమన్నఁబోకునికి నీవును నేను వనాంతభూమికిన్
జనియటనీవుకష్టపడుచందము చూడఁగలేకపోయితిన్
మనమున నెన్న దీన నెపమారపమాయిటులాడ బోఁట్లకున్ 230

వ॥ అనిన భీమపుత్రియిట్లనియె 231

సీ॥ అదినీకునెపము గాదనఘ నన్నడసినీవరిగిన నడవెల్లఁ దిరిగితిరిగి
పెక్కుపాట్లంబడి యిక్కడఁజేరి నిరాహారనై కార్శ్యమైనయంగ
యష్టితో నాటి యీయమ శోకతో ధాత్రి శయ్యగా వ్రతమోలి సలుపుచున్న
దాననై యిలనయోధ్యాపురిలో వేషధారివై మెలఁగునీదారి దెలిసి

గీ॥ నిన్నునిచటికి రప్పింప నేర్పుఁదలఁచి
యచటదమయంతికి పునస్స్వయంవరమ్ము
సేయుచున్నట్టులోకవార్త చెప్పవిప్రుఁ
బంచితినిదీన నేమినెపంబు చెప్పుము 232

వ॥ అనిన నిషధపతి యిట్లనియె 233

క॥ వినుభామమాటలింక నే
యననేమిటికిపుడు నీస్వయంవరమునకున్
జనుదెంచిన ఋతుపర్ణుం
డనయమ్ములోకస్తులకు సాక్షి యగునో కాదో 234

వ॥ అనిన నప్పుణ్యవతియిట్లనియె 235

క॥ అకటమగవారితోమి
న్నకవాదింపంగరాదనను! యరుదయ్యెన్
బ్రకటముగాబుతుపర్ణుం
డొకఁడేలాసాక్షి పెక్కురున్నారరయన్ 236

సీ॥ అఖిలభూతములచర్య లుపపరామర్శింపజగతిఁ దిమ్మరుకర్మసాక్షి సాక్షి
ప్రాణపంచకలీలఁ బాయక చేతనావలిలో మెలఁగుగంధవహుఁడు సాక్షి
జఠరసంగతిఁ జరాచరులయంతర్బుద్ధు లరయఁగా నెలకొన్న యగ్ని సాక్షి
ప్రతినిమేషంబును బ్రాణులచేష్టలుగని పెట్టు రేయుంబగళ్లు సాక్షి
గీ॥ త్రొక్కినిలిచిన భూదేవితోడ సాక్షి
మీఁదనుండివిలోకించు మిన్ను సాక్షి
ఘనుఁడుశశిసాక్షి తారకాగణముసాక్షి
మాటలిఁక నేలనాథ నీమనసెసాక్షి 237

క॥ అనియావధూటితెరస
య్యనఁగడకటుత్రోసి యవనతాననయై క
న్గొనలజలధారలొలుకఁగఁ
దనవిభుకట్టెదురనిలిచి తద్దయుఁబలికెన్ 238

వ॥ ప్రాణనాథా! భవద్వియోగంబునం జెందిన శోకవ్యాకులతంజేసి శరీరంబు రక్తమాంసాదిశూన్యంబై యస్థిమాత్రంబుతో నున్న యది జీవితేశ్వరుండైన భర్తనెడబాసి బ్రదుకుటకంటె దేహంబువిడుచుటయె సహజకర్తవ్యంబైనను నీతోఁ బునస్సంగమంబు కలుగునను నాశాపాశంబులంగట్టువడి యీక్రమంబున నేతత్పర్యంతదినంబులు గడుపుచుంటి మదీయంబైన పూర్వపుణ్యవిశేషంబువలన మీ చరణపద్మంబులు క్రమ్మఱంజూడఁగంటి నింకనెట్లయిన మేలయగునని పలుకుచున్నట్టి యవసరంబున సకలభూతసంత్రాణపరాయణుండగు జగత్ప్రాణుండు నిజవాహనారూఢుండై నిలిచి నలునుద్దేశించి యిట్లనియె 239

శాంతి॥ నవయశోజితాబ్జకాశ నైషధక్షితీశయి
భ్భువినిజూచువారి దేవపూజగాదునిక్క మీ
యువతిచిత్తశుద్ధిబుద్ధి యుత్తమోత్తమంబునై
నవతులేకయొప్పుదీని చందమెన్ని చూడఁగాన్ 240

గనుగొనినవనజాప్తుఁగనిన కమలమువోలెన్ 247

వ॥ అప్పుడు

క॥ ఇలదమయంతీనలులకు
మలినంబులతోడ సెడలె మదిఖేదంబుల్
కలితానురాగములతో
లలిమించెన్ సకలమగు నలంకరణంబుల్ 249

వ॥ ఆసమయంబున 250

క॥ కురిసెన్ బువ్వులవానలు
విరిసెన్ సజ్జనులహృదయవీథులచింతల్
మురిసెన్ బంధుజనావలి
నెఱసెన్ దత్కీర్తిలక్ష్మి నిండెన్ దిశలన్ 251

వ॥ అయ్యవసరంబున విదర్భేశ్వరుం డానందభరితుండై మహోత్సవంబుచేయించిన 252

తోటకము॥ ఆడిరివారమృగాక్షులుసారెన్
జాడఁగ పౌరులసొంపులుమీరెన్
పాడిరిగాయకపఙ్క్తులువింతన్
వోడనె మ్రోసెను దుందుభులంతన్ 253

వ॥ అక్కాలకలంబువలన నెఱింగినవాఁడై ఋతుపర్ణుఁడు నైషధేశ్వరుఁ గదియ నేతెంచి
కృతాంజలియైనిలిచి గద్గదస్వరంబున 254

క॥ అపరాధినినపరాధిని
నృపవరనిషధాధినాథ నిన్నెఱుఁగక నీ
చపుఁబనులనియోగించితిఁ
గృపతోఁ క్షమియింపు మెగ్గులెన్నెనైనన్ 255

గీ॥ అనినఋతుపర్ణుఁగని నలుఁడనియెనప్పు
డనఘకంటికి రెప్ప యెట్లట్లు నన్ను
నరసి ప్రోచితి కలఁడె నీయట్టిహితుఁడు
నాకనుచు డాసి యాలింగనంబొనర్చి 256

వ॥ అశ్వహృదయోపదేశంబొసంగి వీడుకొలిపిన భీమదత్తధారాఢ్యుఁడై సాకేతనగరం
బునకుం జేరంజని 257

క॥ పదియాఱేఁపంగులు నే

బడిహయములు నూఱుకాలుబలములునుమదిన్
ముద మొదవఁగ ఋతుపర్ణుఁడు
విదితంబుగఁ గాన్క నిషధవిభునకుఁ బనిచెన్ 258

అయ్యవసరంబున జీవలుండు నిజస్వామియగు నైషధేశ్వరుని క్షేమవార్త విని పరమా
నందకందళిత హృదయారవిందుండై తత్సేనాసమేతంబుగాఁ గుండిననగరంబునకుం
జేరంజనుదెంచి నిజస్వామిపాదపద్మంబుల కెఱఁగి పార్ష్ణేయుండెనుం దానును నతని
యొండవాయకుండిరంత నలుండు దమయంతీసహితుండై యథేచ్ఛావిహారంబులం
బ్రొద్దులుగడపుచుండి యొక్కమాసంబుచను నెడ నక్కాంతంగనుంగొని 259

ఎన్నఁగ భీమునిల్లె మనయిల్లు సుఖస్థితి నిందు నెన్ని నా
ళ్లున్నఁ గొఱంత లేదయిన యుగ్రమలిపుష్కరు చేతయుల్లమం
దు [illegible] నవెరసున్న విధంబునఁ బూనివానిగ
ద్రోవన్న [illegible]పుమాపి విభవోజ్జ్వలరాజ్యరమన్ వరించెదన్ 260

అనిఋతుపర్ణుఁ డంపిన గజాశ్వచమూనిచయంబుతోడ రాఁ
డవరథమెక్కి భైమిఁ దలిదండ్రులయొద్దననిల్పి వేగిరా
చనియె నతండు ధైర్య గుణసారము వాయువరప్రభావమున్
దనకు సహాయమై యమరఁ దామరసాప్తసమానమూర్తితోన్ 261

తనపూర్వస్థానంబగు నిషధనగరంబునకుం జేరంజనుదెంచి రమ్యప్రదేశమున విడిసి
బుద్ధికుశలుండగు దూతనొక్కరుని బుష్కరునిపాలికిం బుత్తెంచిన వాఁడరిగి పుష్క
రు నింగనుంగొని 262

అరుదెవచ్చె నైషధుఁడు దుర్మదరిపుగర్వాంధకార మార్తాండుఁ డుసీ-
మ దిఁ బ్రమకఁ దలఁచితేనియు, సమమలమతి రాజ్యమొసఁగి శరణొందఁదగున్ 263

భూరిబలాన్వితుఁడు నల, శౌర్యరమణుఁడు నిన్ను నోర్చి మహిఁ గొనుటరుదే
యాఁగ బలిమిగలిగిన, వాఁడె రాజ్యంబునంగ వారక వినవే 264

రాజ్యకాంక్ష విడిచి ప్రాణంబు బ్రదికించు
కొనెదొ కాక బిఱుగుతనముచేత
రాజ్యమీయలేక ప్రాణంబులిచ్చెదో
యేది నీదువాంఛ యెఱుఁగఁ జెపుమ 265

ఇలలోఁ బ్రాణముకలిగిన, బలుసాకులువండి కుడిచి బ్రతుకఁగవచ్చున్
జెలమడిగి రాజ్యసంపద, నలునకొసంగుటయె మేలు నాకుం జూడన్ 266

వ॥ అదియునుంగాక వెండియుం జెప్పెదవినుము 267

ఉ॥ శ్రీమితిమీఱు రాచసిరిచేకుఱనియ్యఁగ నేరవేనిసం
గ్రామము సేయుమా రణముఖంబుననిల్వఁగ నేరకుంటివే
నీమహనీయరాజ్యరమ నెంతయుఁ రోయఁగ జూదమాఁడు నీ
కామనుజేంద్రుఁడొడ్డుదమయంతిని రోయిఁగ గెల్చు కాంక్షచేన్ 268

వ॥ ఎద్దియైననొండు నిశ్చయంబుగా వేగంబరుగుదెమ్మనినం బుష్కరుండు 269

చ॥ కొలువుననున్న మంత్రిహిత కోటులనందఱఁ బారఁజూచిని
శ్చలమునవింటిరే యొక విచారమువింతలుపుట్టె నెవ్వఁడో
నలుఁడట తా నెఱూరుఁడట నన్నెదిరించిరణంబు సేయఁగాఁ
గలఁడట యిట్టియబ్రము జగంబున నెచ్చటనైనఁ గంటిరే 270

క. ఆరయఁగ బలిమిగలిగిన
వారిదె రాజ్యంబటంచు వదరెనితఁడు నా
పౌరుషము నలునిమగటిమి
శూరులు మెత్సంగ నెల్లి చూపెదమనిలోన్ 271

వ॥ అదియునుంగాక 272

క॥ నాఁడునిజరాజ్యసంపద, లోడుటచాలక పుడాలినొడ్డఁగఁ జూదం
బాడఁగవచ్చెనె యిహిహీ, కూడును జీరయును నడపఁగొలగాదే మో 273

వ॥ అనియుద్ధసన్నద్ధుండై చనునవసరంబున నతనింగని హితామాత్యవరు లిట్లనిరి 274

గీ॥ జూదమున రాజ్య మెట్లట్లసులభలీల
గెలిచితమయంతిఁ గొనుట కేవలము లాభ
మదియుఁడిగి దేహమలయఁ బోరాడవలెనె
గోరఁ బోయెడుపనులకు గొడ్డలేల 275

క॥ ములుముంటనెపుత్తురు గా, కిలరోకటఁ బుచ్చుటుచితమే జూదము చే
గెలిచికొనవలయు దానిని, కలన్ మేనలయఁ బోరఁగాఁ దగునెన్నపా 276

వ॥ అనిననగుగాక యని పుష్కరుండు సంగరోద్యోగంబు చాలించి దయాత్మీయంబ సైన్య
ధేశ్వరుఁ గదియ నేతెంచి జూదంబాడం దొడంగిన 277

క॥ నీతిగురుఁడు నలుఁడు పున, ర్ద్యూతంబున గెలిచి పుష్కరుని చేఁగొనియెన్
భూతలరాజ్యరమం బ్రి, ఖ్యాతిగ బుధవరుల జయజయధ్వను లెసఁగన్ 278

వ॥ ఇట్లు లబ్ధసామ్రాజ్యుండై నలుండు తనయెదుట నోటువడి దీనాననుండై నిలిచియు

న్న పుష్కరునిం గనుంగొని 279

క. గెలిచితి నేననిమనమున, వలవదు గర్వింప నెట్టివారలకైనన్
గెలుపు జయాపజయంబులు, ఖలులగుమిముబోంట్లు తెలియఁగానరు సుమతీ 280

వ॥ అని వానిఁ గద్దియుం జేయక పుత్రమిత్రకళత్రంబులతో వెడలనడచె నప్పుడతికు
తూహలమనస్కులై పురజనులు పట్టణంబుఁ గైసేసిన 281

సీ॥ ముచ్చటదీర నెల్లెడల ముత్తెపుముగ్గులు నిచ్చపచ్చరా
పచ్చులతోరణంబులును గోడలఁ గప్పడు నున్న సున్నముల్
పచ్చలపైఁడి వ్రాత పనిపట్టు తెరల్ మృగనాభిపూఁతలున్
మెచ్చులుగుల్కు టెక్కెములు మించెఁబురిన్ సిరి విఱ్ఱవీఁగుచున్ 282

వ॥ అప్పుడు 283

ఉ॥ తత సామ్రాజ్యరమావిభూతి తను చెందన్ నైషధుండంతను
ద్ధుత కౌతూహలమానసుండగుచుఁ దోడ్తోఁ బంచినన్ రత్న భా
సితమహాపల్లకి నెక్కి భీమసుతవచ్చెం దత్పురిం జేరనా
త్మతనూజాతకళావతిప్రముఖ కాంతారత్నముల్ తోడరాన్ 284

వ॥ మఱియు దమదాంతదమనులు జనకుఁడగు భీమసేనుని యనుజ్ఞవడసి యనేకాక్షౌహిణీబలంబులతోడ రథారూఢులై కూర్మిభగినింబనుప నేతెంచి నిషధనగరంబు సొత్తెంచి పటువిభవనిర్జిత నిర్జరేశ్వరుండగు నలక్షితీశ్వరుం గాంచి దండప్రణామంబులర్పించిన నతండు వారల సముచితసత్క్రియలసంభావించి తనప్రియసూను నింద్రసేనుం గాంచి గాఢాలింగనంబొనర్చి దమయంతీసహితుండై యథేచ్ఛావిహారంబుల యథాపూర్వసంభ్రమాతిరేకంబు నందనర్చియుండె నివ్విధంబున 285

క॥ లీలమెయి నమరపురిలోఁ, బౌలోమీత్రిదశలోకపాలుర గరిమన్
శ్రీలలరు నిషధనొప్పిరి, హాళిం దమయంతి నైషధాధిపులంతన్ 286

ఉత్సాహ॥ ఏడుదీవులందు రాజు లేగుదెంచి రివ్విభున్
జూడనాడ వేడుకైన సుందరాంగనామణుల్
బాడబంబులొప్ప నెప్ప భద్రనాగముల్ గముల్
గూడఁబ్రోడలీలఁగానుకఁ గొంచుమించుభక్తితోన్ 287

వ॥ మఱియును 288

గీ. అనుదినంబును నిఖిలధరాధిపతులు
కేలుదమ్ములు ముకుళించి చాలుగట్టి

యిరువురుదలనిల్వ రెండవయింద్రుఁడనఁగ
నలుఁడుగొలువుండె సింహాసనస్థుఁడగుచు 289

క॥ కమలాకరములనారా, మములంగృత్రకాచలముల మణిసౌధములన్
దమయంతీసహితుండై, సముచితమార్గములఁ గ్రీడసలుపుచునుండున్ 290

సీ॥ సంధ్యాద్యనుష్ఠాన చతురక్రియలచేత సంతతాధ్వరసమాచరణచేత
నంబుజోదరపదాబ్జారాధనముచేతఁ దత్కథాశ్రవణతత్పరతచేతఁ
గమనీయవైష్ణవకైంకర్యములచేత గురుజనవిద్వత్ప్రగోష్ఠిచేత
సతతాతిథేయపూజావిధానముచేత సకలార్థదానప్రశస్తిచేత

గీ॥ నిఖిలశాస్త్రార్థ నిర్ణయనిరతిచేత
విహితసజ్జనసంసర్గ మహిమచేత
నెడయకానందములఁబొద్దు గడపుచుండు
రాజమణియైన నలధరారమణుఁడెపుడు 291

సీ॥ వర్ణింపనేరీతి వరగుణాంచితవృత్తి నమరిపుణ్యశ్లోకుఁడైనయట్టి
యీనలచారిత్ర మెవ్వరేనియు భక్తినేకాగ్రచిత్తులైయెపుడువినిన
వ్రాసినఁజదివినవారలు కలిదోషదూరులై ధర్మవిచారలీల
నలరుచుఁబుత్రపౌత్రాభివృద్ధిఁదనర్చి విపులసంపదలచేఁజీవించి

గీ॥ యాయురున్నతిఁబొదలి సత్యమునదవిలి
శిష్టభాగవతప్రియశీలురగుచు
నవలవిష్ణునిసారూప్య మందగలరు
భద్రగుణవర్య శ్రీవేంకటాద్రివర్య 292

మాలిని॥ సరసిజదళనేత్రా శాతకుంభోరునేత్రా
నిరతగిరిశమిత్రా నిర్జరాశాబ్జమిత్రా
పరమగుణపవిత్రా పాపవల్లీలవిత్రా
పరిహృతరిపుగోత్రా పాణిపద్మాత్తగోత్రా॥ 293

గద్య॥ ఇది శ్రీమదాచ్ఛివరదగురుచరణస్మరణాభ్యసన సరససావికాస
తిరుమల గిరి వేంకటేశ్వర వరప్రసాదలబ్ధకవితా విలాసహారితసగోత్ర
సిరిప్రగడ తిప్పనమనీషి పుత్రసుజనవిధేయ ధర్మయనామధేయ
ప్రణీతంబయిన నలచరిత్రంబునందు షష్ఠాశ్వాసము
సర్వంబును సంపూర్ణము.